సాహిత్య మాసపత్రిక

# భారతి



మే 1986

వెల: 4 రూపాయలు

# నాగేశ్వరరాయ నిర్యాణము

## శ్రీ శే. మేడూరి గోవిందాచార్యులు

['దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి నిర్యాణ సందర్భమున 1938లో మేడూరి గోవిందాచార్యులుగారు రచించిన పద్యములివి. గోవిందాచార్యులుగారు పెక్కు పద్యకృతులు, పౌరాణిక నాటకములు రచించిన సత్కవి. నాకు ప్రారంభ విద్యాగురువు, పితృసమానుడు. 1979లో కీర్తిశేషుడయ్యెను. ఆయన రచించిన గ్రంథముల వ్రాతప్రతులను ఇటీవల పరిశీలించుచుండగా, ఈ క్రింది పద్యములు నా కంటబడినవి. దేశోద్ధారకుని నిర్యాణము జనుల నెంత సంతప్తులను గావించెనో స్పష్టీకరించు పద్యములు గనుక ఇవి అవశ్యము ప్రచురణ యోగ్యములని భావించితిని

**శ్రీ వి. వి. యల్. నరసింహారావు** [సేకరణ కర్త]

**మృత్యువు నుద్దేశించి —**

కాశీనాథుని వంశవార్ధి శశి, సత్కారుణ్యమూర్తిన్. ఘనున్
దేశోద్ధారకు, విశ్వదాత, సుగుణున్, తేజః కళాపూర్ణునిన్,
ధీశాలిన్, సువిచారు, నాంధ్రజనయిత్రీ గర్భసంజాతు, నా
గేశున్ పొట్టను బెట్టుకొంటివి గదే, హా! మృత్యువా! దుర్మతీ! 1

పాపీ! మృత్యువ! దేశభక్తుని, కృపాపారీణు, నాగేశ్వరున్
చేపట్టన్ మనసయ్యెనా? ఖలమతీ! చేదోడు వాదోడుగా
మాపాలన్ గల పెన్నిధిన్ గొనుట ధర్మంబె? కడున్ దుష్టులౌ
పాపుల్ లేరె? వరింపరాదె సతమున్ భర్తృత్వమున్ పొందగన్! 2

**కాశీనాథుని నాగేశ్వరరావుగారి నుద్దేశించి**

కన్నపుత్రిక కంటె కడు ప్రేమతో చూచు
    'ఆంధ్రపత్రిక' వీడి అరిగినావె?
సంస్కృతాంధ్రంబుల చవిచూపు 'భారతీ'
    పత్రికారత్నంబు బాసినావె!

చిరకాలముననుండి సేవచేసెడి 'అమృ
    తాంజనంబు' వదలి తరలినావె?
కమనీయమైన 'దుర్గాకళామందిరంబు'ను
    బాసి వెడలితే పురుషసింహ!

భారతావని స్వేచ్ఛను వడయలేదు,
ఆంధ్రరాష్ట్రంబు సిద్ధింపనైన లేదు,
అఖిల జనముల గుండియ లవిసిపోవ
ఏగినాడవె దివికి నాగేశరాయ! 8

కాశీనాథుని ఆత్మకు కాశీ విశ్వనాథుడు శాంతి చేకూర్చుగాక!

(ఈ పద్యాలని పరిశీలించి పంపిన డాక్టర్ వి. వి. ఎల్. నరసింహారావుగారికి కృతజ్ఞులము. సం.)

---

# మిమ్ము పొగడని కవిత వమ్ము!

## (సానెట్)

ఎంతమంచి గడింపలేదు కోట్లకొలంది
    ధనము! మీవలె వారు జాతి అభ్యున్నతికి
    జ్ఞానప్రసారమ్మె సాధనమ్మని మతికి
తట్టి, పత్రికలు ప్రారంభించిరా? మంది
హృదయమ్ములో చిరంజీవియై ఉన్నారు?
    నూటికొక్కడు కాదు, కోటికొక్కడు కూడ
    నేల నాలుగు చెఱగులందున వెదకి చూడ,
మీవంటి విశ్వదాతలును, దేశోద్ధార
కులును, సుకళాప్రపూర్ణులును కానరారు!
    పూర్ణపురుషుని సృష్టి చేయనెంచి విరించి
మిమ్ము సృష్టించెనని అనుకొందు నాధారు
    లౌని! మీ సుగుణసంఖ్యనుడుసంఖ్య తిలకించి
తలపంచె! మీరాంధ్ర జాతికే గర్వమ్ము!
నాగేశ్వరా! మిమ్ము పొగడని కవిత వమ్ము!!

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

(ఇది పంతులుగారి దివ్యస్మృతికి అంకితం)



5-5-'86 చైత్ర బహుళ ద్వాదశి సోమవారం

కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి, 118 వ జయంతి.

సంపుటము 63 మే, 1986 సంచిక 5

# భారతి

సాహిత్య మాసపత్రిక

★

సంస్థాపకుడు

## కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

★

సంపాదకుడు

## శివలెంక శంభుప్రసాద్

(1938 - 1972)

★

విషయానుక్రమణిక

ముఖచిత్రం కుమారి ఆలమూరు సుధారాణి



**విడి పత్రిక వెల : నాలుగు రూపాయలు**

నాగేశ్వరరావు ఎస్టేట్సు ప్రయివేటు లిమిటెడ్ తరపున ముద్రాపకుడు ప్రచురణకర్త : శివలెంక రాధాకృష్ణ
ముద్రణ : ఆంధ్రపత్రికప్రెస్, గాంధీనగరం, విజయవాడ-3; సంపాదకుడు శివలెంక రాధాకృష్ణ

# స్వవిషయం

"మొదటి తెలుగు గ్రంధ రచయిత మల్లియరేచన" వ్యాసం భారతిలో మంచి చర్చక దారి తియ్యగలదని ఆశిస్తున్నాము' దీనిని గురించి రాయదలుచుకున్న వారు పెద్ద వ్యాసాలు రాసి పంపరని కూడా ఆశిస్తున్నాము

★★ ★★ ★★

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారి వ్యాసం భారతిలో పడి కొంత కాలం అయింది "సంస్కృత నాటకములు ఎట్లు ఆడుచుండిరి?' భారతి పారకులలో ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండగలదు

★★ ★★ ★★

డా. కె. వి. పుట్టప్పగారి నాటకాలు కొన్ని భారతిలో పడ్డాయి. వారి కవిత్వాన్ని (అనువాదంలో) చదివే అవకాశం ఈ నెల భారతి కల్పిస్తోంది....

★★ ★★ ★★

కొంతకాలం కింద భారతి చిన్ననవలల పోటీ ఒకటి ప్రకటించింది. పోటీకి చాలా నవలలే వచ్చాయి. ఫలితాలు త్వరలో నే వెలువడగలవు!

★★ ★★ ★★

రచయిత్రులకీ, రచయితలకీ పంపే "కాంప్లిమెంటరి కాపీలు" కొన్ని వారికి అందటం లేదన్న ఫిర్యాదులు ఈ మధ్యనే వస్తున్నాయి. ఇంతకి ముందు ఈ రకం ఫిర్యాదు చాలా అరుదుగా వచ్చేది అందరికీ కాంప్లిమెంటరి కాపీలని రిజిస్టర్డ్ పోస్ట్‌లో పంపటానికి వీలుకాదు! మళ్లీ పంపిద్దామంటే పాత కాపీలు కూడా ఎక్కువగా మిగలవు! ఈ సమస్యని పరిష్కరించటం కోసం ప్రయత్నిస్తున్నాము....

★★ ★★ ★★

సీరియల్ నవలలు ఎదురు చూసినంతగా రావటం లేదు. ప్రతి సంచికలోనూ కనీసం రెండు సీరియల్‌లు పాఠకులకి అందచెయ్యాలని మా ఆశ! ఈ ఆశ నెరవేరటానికి రాసే వారందరూ తోడ్పడగలరని ఆశిస్తున్నాము....



శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

# స్వరసుధారాణి-సుధారాణి



అలంకారికులు అప్పటికప్పుడు వికసించేబుద్ధిని 'ప్రతిభ' అనీ; శాస్త్రాదుల వల్ల వొచ్చే పరిజ్ఞానాన్ని 'వ్యుత్పత్తి' అనీ; నిరంతర కృషివల్ల వొచ్చే తెలివి తేటల్ని 'అభ్యాసం' అనీ నిర్వచించేరు. ఏ శాస్త్రాలకైనా కళలకైనా ఈ మూడూ వున్ననాడే తిరుగులేని రాణింపు.

ఇలాంటి రాణింపుగల గాన కళారాణి - కుమారి ఆలమూరు సుధారాణి. ఇరవై రెండు వసంతాల లేతవయసులోనే ఈ సుధారాణి స్వరసుధాలహరులు రాష్ట్ర రాష్ట్రేతర శ్రోతల హృదయారవిందాల్ని ఆనందరస నిస్యందులుగా మార్చడం ప్రత్యేకత!

## అభ్యాసం

'అచటపుట్టిన చిగురు కొమ్మైన చేవ' అని వాసిగాంచిన విజయనగరం ఈమెది. సుప్రసిద్ధ ఆర్థికశాస్త్రోపన్యాసకులుగా; పట్టాలులేని సాహిత్య, సంగీతోపన్యాసకులుగా వాసికెక్కిన డా॥ ఎ. వి. రమణమూర్తిగారు ఈమె తండ్రి. శ్రీమతి కళ్యాణి ఈమె తల్లి. 'ఆంధ్ర రఘువంశము', 'భగవద్గీత' వంటి గ్రంథకర్త శ్రీ ఆ. వెంకటాచలము ఈమెకు పితామహుడు.

ఈమె గణితం ప్రధానవిషయంగా బి.ఎస్.సి.ని ప్రప్రథమశ్రేణిలో సాధించింది. విద్యాభ్యాసకాలంలో విద్యలోనేగాక వివిధ విషయాలలోసైతం ఎన్నెన్నో బహుమానాల్ని ప్రప్రథమస్థాయితో అందుకోడమేగాక; రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలనుండి ఎన్నెన్నో స్కాలరుషిప్పులను కూడా సంపాదించుకొంది. వీటిలో కేంద్రప్రభుత్వమిచ్చిన సైన్స్ స్కాలర్‌షిప్; నేషనల్ టేలెంట్ స్కాలర్ షిప్‌లు తలమానికాలు. ఈ కాలంలోనే హిందీ సంస్కృతాల్లోకూడా ఎన్నో సర్టిఫికెట్లని సంతరించుకొంది.

పై వ్యాసంగంతో సరిగా చిన్ననాడే శ్రీ కె. రంగాచార్యులు, శ్రీమతి ఎం. శేషమణిగార్ల శిక్షణలో సరిగమలకు గొంతు సరిచేసుకొంది.

78 నుంచి 83 దాకా సాగిన విద్యాభ్యాసకాలంలో సంగీతపరంగా రాష్ట్రంలో వివిధ సంస్థలు నిర్వహించిన ఎన్నెన్నో పోటీలలో ఈమే అగ్రగణ్య. వీటిలో బాలల అకాడమీ ఎ.ఐ.ఆర్. మద్రాసు-మ్యూజిక్ అకాడమీలనుండి గాయని పరంగా; వల్లవిపరంగా అందుకొన్న ప్రప్రథమ బహుమానాలు ప్రస్తుతింపదగినవి. సంగీతంలో డిప్లొమాని సర్వోత్తమస్థాయిలో సాధించుకొంది.

## వ్యుత్పత్తి

విఖ్యాత వాయులీన విద్వాంసునిగా, విశేషించి సాంప్రదాయక గానకళా కోవిదునిగా ప్రత్యేకించి శిష్యవాత్సల్యతాధురీణులైన సంగీతాచార్యునిగా, ఆకాశ వాణీ నిలయవిద్వాంసులుగా వాసికెక్కిన బ్రహ్మశ్రీ ఇవటూరి విజయేశ్వరరావు వద్ద '78 నుంచీ ఈమె నాదోపాసనచేస్తోంది.

పేరుమోసిన నాదోపాసకుల పోకడలను వీలైనంతమేరకు నేరుగాకాని, గ్రంథాదులవల్లగాని ఆకళించుకోడం—ఆచరణలో అలవోకగా మలచుకోడం ఈమె అలవాటు. సాంప్రదాయపు విలువలపట్ల ప్రపత్తి; తనదైన బాణీని సంతరించుకోవాలన్న తపనా ఈమెకుగల ప్రత్యేకతలు.

## ప్రతిభ

గణిత, విజ్ఞానశాస్త్రాది విభిన్న శాస్త్రాధ్యయనంలో గణనీయంగా బహిర్గతమైన ఈమె ప్రతిభ సంగీతంలో పరావర్తనంచెంది గొప్ప రాణింపుకు దారితీసిందనవచ్చు.

11వ ఏటనే సుసంపన్నమైన స్థాయిలో కచేరీచేయడం; 18వ ఏటనే బహుముఖ ప్రతిభకారణంగా ఆకాశవాణిచే 'క్యాజువల్ ఆర్టిస్ట్‌గా గుర్తింపుపొందడం 19వ ఏటనే ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుండి డిస్టింక్షన్‌లో సర్వోత్తమంగా డిప్లొమా పొందడం; 20వ ఏటనే ఆకాశవాణిచే బి-హై ఆర్టిస్ట్‌గా మన్నింపబడడం ఈమె ప్రతిభకు తార్కాణాలు.

లబ్ధప్రతిష్ఠులైన సర్వశ్రీ నేదునూరి కృష్ణమూర్తి, ద్వారం దుర్గాప్రసాదరావు, ద్వారం భావనారాయణరావు, సాలూరు రాజేశ్వరరావు, శ్రీమతి కె. అంబుజవల్లి వంటి ఎందరో మహానుభావులు ఈమె ప్రతిభకు ప్రశంసాపత్రాలిచ్చేరు.

పందకు పైచిలుకుగా ఈనాటిదాకా ఈమె చేసిన కచేరీలు రాష్ట్రంలోనేగాక బొంబాయి, బరోడా, మద్రాసు, కలకత్తా, భువనేశ్వర్, కటక్, బిలాసపూర్ జబల్‌పూర్, రాంచీ, కోయంబత్తూరు వంటి రాష్ట్రేతర నగరాల్లోకూడా సాగేయి.

శ్రీ పి. వి. పరబ్రహ్మ శాస్త్రి

# మొదటి తెలుగు గ్రంథ రచయిత-మల్లియ రేచన

తెలుగు ఛందోలక్షణ గ్రంథములలో కవిజనాశ్రయము అతి ప్రాచీనమైనది దాని కర్తృత్వమును గూర్చి రెండు వాదములు గలవు. గ్రంథాదియందు రెండు విధములగు అవతారికలు మూల ప్రతులలో గనుపించుచున్నవి. ఒకదాని ననుసరించి వేములవాడ భీమకవి. రెండవదాని ననుసరించి మల్లియరేచన దీని కర్తగా చెప్పబడెను. జయంతి రామయ్య పంతులుగారు కాకినాడ, ఆంధ్ర సాహిత్య పరిషత్తు ద్వారా 1917 లో మొట్టమొదట దానిని ప్రచురించిరి. ఆ ముద్రణమునకు వారు. ఆంగ్లమున, ఆంధ్రమున, పీఠిక వ్రాసిరి. అందు వారు పవ వ్రాతప్రతులను సంప్రదించినట్లు తెలిపిరి. వ్రాత తప్పులు మాత్రమే వారు సదిరించితిమనియు పాఠ భేదములను ఆయా పుటలలో అడుగున చూపితి మనియు చెప్పిరి. గ్రంథ కర్తృత్వమును గూర్చి కొంత చర్చించి వేములవాడ భీమకవియే దానిని రచించెనని వారు నిశ్చయించి అట్టే ముఖపుటమీద వేములవాడ భీమకవి పేరు గ్రంథకర్తగా వేయించిరి. పరిషత్తువారే దానిని తిరిగి 1936 లోను, 1959 లోను రెండుమార్లు పునర్ముద్రణ చేసిరి. మూడవ ముద్రణకు చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు పీఠిక వ్రాసిరి. మొదటి ముద్రణకు పీఠిక వ్రాయుచు జయంతివారు. గ్రంథ కర్తృత్వమును గూర్చి చర్చించుచు క్రీ. శ 17 వ శతాబ్దమువాడైన అప్పకవి నాటికే అది భీమకవి కృతముగా నిశ్చితమైయున్నది గనుక తాము దాని నట్లే విశ్వసించు చుంటిమని వ్రాసిరి. మూడవ ముద్రణకు పీఠిక వ్రాయుచు చిలుకూరివారు కూడ ఆ అభిప్రాయమునే ధ్రువపరిచిరి అప్పకవి మొదలైన వారు చెప్పిన విధము ఇట్లు కలదు.

ఆ. వికట కవులు కొన్ని వింతలు కల్పించి కవి జనాశ్రయమున గలిపినారు
వానిగైకొనంగ వలద ప్రయుక్తములేల సెప్ప భీముడెఱిఁగి మెఱిగి
(అప్ప. తృతీయ. పద్యము 260)

ఇంచు మించు అప్పకవి కాలమువాడైన పొత్తపి వేంకటరమణకవి తన 'లక్షణ శిరోమణిలో'

"యతులు కవితా మహత్త్వంబునం దాది భీమన్నగారి
మతంబున దశ విధంబు లనఁబడియె" అని చెప్పెను.

క్రీ. శ. 1740 - 50 ప్రాంతము వాడైన కస్తూరి రంగకవి తన 'లక్షణ చూడా మణి' లేక 'ఆనంద రంగరాట్ఛందస్సు' అను గ్రంథములో దశవిధఛందో గ్రంథములు పేర్కొనుచు భీమన ఛందమును గూడా పేర్కొనెను. ఇంకను కొందఱు లాక్షణికులు భీమనకృత ఛందస్సును పేర్కొనిరి. ఆ గ్రంథము కవి జనాశ్రయమేనని అప్పకవి చెప్పినట్లు పైన తెలిపితిమి. ఇంతేకాక జయంతివారు పరిశీలించిన పది వ్రాత ప్రతులలో నొకదానియందు మాత్రమే మిగతప్రతులలో నున్న దానికంటె అధికముగ ఆఱుపద్యములున్న అవతారికగలదు. ఆ పద్యము లిట్టుగలవు.

1. కం. శ్రీకరముగ రేచనపై.
లోకంబున సుకవి వరులు లోలతఁ బొగడన్
ప్రాకట ముగ నీఛందము
లోకం బొననఁగ దెలుఁగులో నొనరింతున్.

2. కం. వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవినేఁ
గోమటి రేచన మీదను
నీ మహిఁగవు లెన్న ఛందమెలమి రచింతున్.

3. కం. లచ్చన మెఱుఁగని కవులను
జిచ్చియని సుకవివరులు చేపట్టరుగా
మెచ్చరు వివేకి నృపతులు
మెచ్చిన యవివేకి నృపులు మిడుకరె రేచా!

4. కం. ఆ చంద్ర తారకంబుగ
భూ చక్రములోన సుకవి పూజిత మగుచున్
ఏ ఛంద మమరు చుండును
నా ఛందము నీదుపేర నమరును రేచా!

5. కం. రేచన సంతోషింపగ
భూ చక్రములోన భీమ పురహరు కృపచే
నే ఛందము సుకవులు బ్రదు
కే ఛందము తెరువు దానినే రచియింతున్.

6. కం. నిను నీవె పొగడు వైఖరి
నొనరించెదఁ దెనుగు బాస నొప్పఁగ ఛందం
బును గనక కవిత చెప్పిన
వినవే లచ్చనము వాడు వెంగలి రేచా!

పై పద్యములను బట్టి భీమకవి వేములవాడ భీమేశ్వరదేవుని కృపతో గోమటి రేచవపేర నమరునట్లు ఈ ఛందో గ్రంథము రచించెనని తెలియుచున్నది. అంతేగాక తనను తానే (రేచనను రేచనయే) పొగడుచున్నట్లు ఈ గ్రంథాన్ని భీమకవి రచించెనట. శ్రీనాథ మహాకవి వంటి విద్వత్కవుల పొగడ్తకు పాత్రుడైన ('వచియింతు వేములవాడ భీమన భంగినుద్దండలీల నొక్కొక్కమాటు' కాశీ. అవ.) భీమకవి యింత బట్ట బయలుగాను పేలవముగాను రేచన పేర తన కృతిని అమ్ముకొనునా? శాపానుగ్రహ సమర్థుడని ఖ్యాతి నొందిన భీమకవి కోమటి రేచన యిచ్చెడి మడిమాన్యములకు ఆశపడెనా? భీమేశ్వరదేవ వరప్రసాదమున మహదైశ్వర్యము నొందగలనను అచంచల విశ్వాసముగల భీమకవి జినేంద్ర పద సేవకుడగు రేచన కొరకు తన కృతిని అమ్ముకొనెనా? ఇట్లాంటి ప్రశ్నలు పుట్టుచున్నవి. అసలు వేములవాడ భీమకవి కృతులు కొన్ని శ్రీనాథుడి కాలంలో ఉన్నప్పటికి ఇప్పుడు నిశ్చయముగా ఆ కవివేనని చెప్పదగిన కృతులేవియు లేవని కొందరు తలంచు చున్నారు. అప్పకవినాటికే వికట కవులు కొందరు వింత పద్యములు అల్లి భీమకవిపేర రూఢి చేసినట్లు చెప్పవచ్చును. అట్లాంటిదే జయంతి వారు చూపించిన ఒక వ్రాతప్రతిలోని అధికమైన ఆరు పద్యముల అవతారిక కావచ్చును. వీరేశలింగము పంతులుగారు.మానవల్లి రామకృష్ణకవిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, చాగంటి శేషయ్యగారు భీమకవి కర్తృత్వము నంగీకరించుట లేదని ఆంధ్రకవితరంగిణిలో (మొదటి భాగము పు. 284) చెప్పబడింది. శ్రీనాథాదులు భీమకవిని కవిగా స్మరించినను అతడు ఛందోగ్రంథము రచించినట్లు చెప్పలేదు. అదెట్లున్నను భీమకవి ప్రసక్తి ఆ కృత్రిమ అవతారికలో దప్ప మఱెచ్చట ఈ గ్రంథములో గానరాదు.

ఇంక రెండవ పక్షము. ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) ద్వారా జయంతి రామయ్య పంతులుగారు ప్రచురించిన కవిజనాశ్రయ మూడు ముద్రణలు గాక 1950 లో వావిళ్ళవారు, వేఱొక ప్రచురణము దెచ్చిరి. దానిని నిడుదవోలు వేంకటరావుగారు పరిష్కరించిరి. తెనుఁగు భాషలో ఛందోలక్షణ గ్రంథములు అను శీర్షికలో వారు దానికొక విపులమగు పీఠికనుగూడ జేర్చిరి. వీరి ముద్రణలో

మూలమునందు అనేక పాఠములు సవరింపబడెను. దీనికి ముఖ్యమైన వ్రాతప్రతి శ్రీ రేకులు శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు సంపాదించి స్వయముగ ముద్రించ నెంచినదట. పరిషత్తువారి ప్రచురణమందున్న పద్యములనేకము దీనిలో కానరావు. అధికమైన ఆరు పద్యములు అవతారిక దీనిలో లేదు. గణముల జాతులు, గోత్రములు, నక్షత్రములు, రాసులు, యోనులు, గుణదోష విచారము, బీజాక్షరములు, ఫలములు ఇత్యాది విశేషములు వావిళ్ళవారి ప్రచురణలో గనరావు అని గ్రంథాంతమున ప్రక్షిప్తములుగా చేర్చబడెను. ఈ విశేషములు సంస్కృత ఛందోగ్రంథములలో కూడా అంతగా గనుపించవు. తెలుగు దేశంలో క్రీ. శ. సుమారు. 1370 లో మొదటి బుక్కరాయల కొడుకు భాస్కర రాయలు ఉదయగిరి రాజ్యంలో పోరు మామిళ్ళ గ్రామంవద్ద గొప్ప చెఱువు త్రవ్వించి శాసనము వేయించెను. అందు మొదట శాసన రచనా విధానాన్ని చెప్పుచు గణ ముల విశేషములు కొన్ని చెప్పబడెను. (ఎ.పి. ఇండికా. 14) అంతకు పూర్వము తెనుగు ఛందోగ్రంథములలో ఈ విశేషములున్నట్లు తెలియదు. కనుక నిడుద వోలువారు వేతొండు ప్రతులలో గనుపించుచున్న ఆ విశేషములను ప్రక్షిప్తము లుగ జూపుట సముచితమే. ఈ విధంగా అధికమైన అవతారిక, గణ విశేషముల వర్ణన పోగా మిగిలినగ్రంథము మాత్రమే నిజమైన గ్రంథమని తోచుచున్నది. ఈ నిజగ్రంథము యొక్క అవతారికలో వావిళ్ళవారి ప్రతియందు అయిదు కంద పద్యములు గలవు. పరిషత్తువారి ప్రతిలో మూడు మాత్రమే గలవు. అవి

## వావిళ్ళ వారి ప్రతి

1. కం. శ్రీ కాంతా త్రిప్రియ వా
   క్ర్పీ కాంతా జగత్త్రయైక సేవితనుత వి
   ద్యాకాంత దివ్యకావ్య స
   దేకాంత నితాంతకాంతి నీవుతమాకున్

ఇది వాగ్దేవతయైన సరస్వతిని గూర్చి ప్రార్థన. పరిషత్తువారి ప్రతిలో గూడ ఈ పద్యము మొదటిదే ననవచ్చును. అనగా అధికమైన అవతారిక పద్యాలు తొలగించితే.

2. కం. గురుయతి గణముల పాదాం
   బురుహంబుల కెఱఁగి సుకవిబుధ జనములనా
   దరమునఁ దలఁచి దదాజ్ఞం
   బరహిత చరితుడు జినేంద్ర పదభక్తిమెయిన్

ఈ పద్యము నాలుగవ పాదము పరిషత్తు ప్రతిలో 'బరహిత చరితుండ. నాంధ్ర పదభక్తిమెయిన్' అని యున్నది. పాఠాంతరముగ 'జినేంద్రపద' కు బదులు 'జితేంద్రపద' అని చూపబడెను. 1వ పద్యములో సరస్వతీ ప్రార్థనతో గ్రంథము ప్రారంభమగుట, 2వ పద్యములో 'జినేంద్రపద' 'భక్తిమెయిన్' అని జినేంద్రుని స్తుతించుట. గ్రంథకర్త జైనుడని విశదము చేయుచున్నది. 'ఆంధ్ర పదభక్తిమెయిన్' అని యున్న పరిషత్ర్పతిలోని పాఠము ఒకవిధంగా కృత్రిమమని చెప్పకచెప్పుచున్నది. అట్టిదే 'జితేంద్రపద భక్తిమెయిన్' అను పాఠము కూడ 'పరహితచరితుడు' అను విశేషణము సాధారణముగ జైనులకు చెప్పబడును. అది యితరులకు చెల్లదనేమాట లేదు కనుక పాటించ తగ్గది కాదు. ఈ విశేషణము మఱికొన్ని చోట్ల గూడ కనుపించును.

3. కం. పరగిన విమల యశో భా
   సురచరితుడుఁ భీమనాగసుతుఁ దఖిల కళా
   పరిణతుడయ్యును భూసుర
   వరప్రసాదోదిత ధ్రువశ్రీయుతుఁడై

ఈ పద్యము పరిషత్ప్రతి యందులేదు. భీమనాగసుతుడను పదమునకు అన్వయమెక్కడో యిందు తెలియదు. ఆ భీమనాగసుతుని వర్ణించు పద్యము లొండు, రెండు లుప్తమై యుండునని తోచును.

4. కం. అసమాన దాన రవితన
   యసమానోన్నతుడు వాచకాభరణుఁడు ప్రా
   ణ సమాన మిత్రుఁడిక్కృతి
   కి సహాయుఁడుగా సుదాత్తకీర్తిప్రీతిన్

ఈ పద్యము కూడ పరిషత్ర్పతిలో లేదు. రెండవ పాదములో 'వాచకాభర ణుఁడు' అను దానికి బదులు 'యాచకాభరణుఁడు' అని పాఠాంతర మొక ప్రతిలో నున్నట్లు చెప్పబడెను. ఈ పాఠాంతరానికి సరియైన అర్థము చెప్పట కష్టము. యాచకులలో శ్రేష్ఠుడనే విశేషణము చెప్పట యొప్పదుకదా. 'వాచకాభరణుఁడు' అనుచో మంచి అర్థము గలదు. జైనమత బోధకులను, అనగా ప్రజలలో ప్రచా రము చేయువారిని 'వాచకు'లని ప్రత్యేకముగా పేర్కొందురు. అట్టివారిలో శ్రేష్ఠుడని దాని కర్థము. ఆ మతములో సామాన్య శిష్యులను శ్రావకులనియు ప్రచారకులను వాచకులనియు విశేష నామములతో పేర్కొందురు. బౌద్ధులలో సామాన్య శిష్యులను శ్రమణులనియు, ప్రచారకులను ఆచార్యులనియు, ఉపాధ్యా యులనియు చెప్పుదురు. ఈ పద్యములో చెప్పబడిన వాచకాభరణుడెవడో ముందు చెప్పబడును.

5. కం. అనవద్య కావ్య లక్షణ
   మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియ రే
   చన సుకవి కవిజనాశ్రయ
   మను ఛందము తెనుఁగు బాస నరుదుగఁజెప్పెన్

ఈ పద్యము పరిషత్ర్పతిలో గూడ కలదు. 'మల్లియ'కు బదులు 'మల్లయ' అను పాఠాంతరము తప్ప వేఱు మార్పు లిందులేవు. అర్థము కూడ స్పష్టముగ నున్నది. కవిజనాశ్రయుడను బిరుదునామముగల మల్లియ కుమారుడు రేచన యను సుకవి 'కవిజనాశ్రయ' మను ఛందమును తెలుఁగులో అరుదుగ జెప్పుచుండెనని గ్రంథకర్త పేరు అర్హత, గ్రంథము పేరు, వక్తవ్యాంశము (గ్రంథోద్దేశ్యము) ఇత్యాది విశేషము లిందు చెప్పబడెను. గ్రంథాదియందుండవలసిన ఇష్ట దేవతా ప్రార్థన, కురుప్రార్థన, ప్రతిజ్ఞ అను అంశము లన్నియు ఈ యవతారిక యందు 1, 2, 5 వ పద్యములలో జెప్పబడెను. కాగా 3వ పద్యములోని భీమనాగసుతు డెవడో, అతని పాత్ర యిందెట్టిదో తెలియుటలేదు. రేచన తండ్రి 'మల్లియ' అని సూచితమగు చుండగా భీమనాగసుతుడే రేచనయని చెప్పట సరికాదు. కనుక మధ్యనొకటిగాని మఱియొక్కటిగాని పద్యములు లోపించెనని తోచుచున్నది. మొదటి సంజ్ఞాధికారములోనే అంత్యప్రాసకు ఉదాహరణముగా 'భీమతనూజా' అను సంబోధన కనిపించుచున్నది. అందున్న యితర సంబోధన పదములు, ఇవి అన్నియు రేచనకే అన్వయించుచో, రేచనభీమన యనువాని పుత్రుడను కొనవలెను. అపుడు 'మల్లియ' పదమునకు సార్థకత అంతగా కనుపించదు. ఇది విచారించ తగ్గది. ఈ యవతారికనుబట్టి మల్లియరేచనయే కవిజనాశ్రయ మనెడి ఈ ఛందోగ్రంథమును రచించెనని తెలియుచున్నది.

ఈ గ్రంథములో 1. సంజ్ఞాధికారము, 2. వియతిచ్ఛందోధికారము 3. యతిచ్ఛందోధికారము, 4. ఉద్ధరమాలావృత్తాధికారము, 5. అర్ధసమవృత్తాధి కారము. 6. విషమవృత్తాధికారము, 7. జాత్యాధికారము, 8.షట్ప్రత్యయాధికారము, 9. దోషాధికారము అను తొమ్మిది అధికారములు గలవు. ప్రతి అధికారము చివర 'గద్యము ఇది వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాణ కవిజనా శ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయంబను ఛందంబునందు సంజ్ఞా ధికారము' అను విధముగా నుండును. కనుక పైన చెప్పిన అవతారికలోని 5వ పద్యములో వలెనే గద్యము కూడ గ్రంథకర్తను తెలుపుచున్నది: కాని యిందు 'మల్లియ రేచన' అనుపేరు లేదు. 'కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితం బైన' అని కలదు. అంతే కాక 'వాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుక రాయమాణ' అను విశేషణమున ఇతని గురువు వాదీంద్ర చూడామణియను ప్రసిద్ధ బిరుదమును వహించిన వాడని చెప్పబడుచున్నది.

ఈ విధంగా వేములవాడ భీమకవి రచించి మల్లియ రేచన పేరున కర్తృత్వము ప్రకటించెనని ఒక వాదము. మల్లియ రేచనయే రచించెను గాని భీమకవికి ఈ గ్రంథముతో ఎట్టి సంబంధము లేదని రెండవ వాదము ఏర్పడినవి, ఈ వాదములలో మొదటిది ఒక ప్రతిలో గనవచ్చుచున్న అధికమగు అవతారిక పద్యములపై ఆధారపడి యున్నది. గ్రంథాంతర్గతమైనని నిశ్చయముగా చెప్పగల వేఱొండు గ్రంథాంతర్గత సాక్ష్యము లేదు. ఉన్న అవతారిక కూడా ఒకే ఒక్క ప్రతిలో గనుపించుచున్నది. ఆ పద్యములు కూడ అతి పేలవముగా కృత్రిమములుగా తోచుచున్నది. శ్రీనాథుడు వర్ణించినట్లు 'ఉద్దండలీల' అనే లక్షణం ఆ పద్యాంలలో నలుసంతయైన కనరాదు. పైగా భీమకవి వంటివాడు మల్లియ రేచన యిచ్చెడి బహుమానములకులోనై యిట్టి చౌకబారు వ్రాత వ్రాయునా అనే అనుమానానికి తావొసగుచున్నవి. ఆ పద్యాలు కనుక వాటిని గ్రంథాతర్గత సాక్ష్యంగా గ్రహించ వీలు గాకున్నది. ఇంక మిగతా సాక్ష్యం అంతా అప్పకవి వంటి లాక్షణికులు చెప్పుచున్న దానిపై ఆధారపడి యున్నది. ఈ వ్రాతలు వ్రాసినవారు 16 వ శతాబ్దం తరువాతి వారే భీమకవి వారికి కనీసం కొన్ని వందలేండ్లు ముందు వాడనవలెను. కనుక అప్పకవి వంటి వారి వ్రాతలు జనశ్రుతి ననుసరించి వ్రాసినవి. పైగా ఆ గ్రంథం (కవిజనాశ్రయం)లో వికటకవులు కొందరు వింతలు కొన్ని చేర్చిరని కూడ అప్పకవి చెప్పెను. ఈ విధంగా బహిరంగ సాక్ష్యం కూడ బలహీనంగా కనపించుచున్నది. వేములవాడ భీమకవి కర్తృత్వమును నిరూపించగల సాక్ష్యములు అంతర్గతముగాను, బహిర్గతముగాను బలహీనములై కృత్రిమము లనుపించుచున్నవి.

ఇంక రేచన కర్తృత్వమును చెప్పుచున్న సాక్ష్యములు పరిశీలితము దీనికి సంబంధించిన సాక్ష్యం గ్రంథాంతర్గతమే యెక్కువ. అంతరంగ బహిరంగములలో అంతరంగమైన దానికే యెక్కువ ప్రాధాన్యం వుంటుంది. ఈ వాదానికి బహిరంగ సాక్ష్యం తెలుగు రచనల్లో కవిజనాశ్రయం అనే పేరుతోనే కనుపించును. కనుక అది కర్తృత్వ సమస్యను పరిష్కరించ తోడ్పడదు, కాగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'యాప్పిరంగలమ్ కారికై' అను ప్రసిద్ధ అరవభాషా ఛందోగ్రంథము నుండి ఒక ఆధారమును వెలికి దెచ్చిరి. దాని కాలము 12 వ శతాబ్దికి పూర్వమని చెప్పబడుచున్నది. ఆ ఛందోగ్రంథములో అప్పుడున్న కర్ణాట ఆంధ్ర ఛందోగ్రంథములు గూడ బేర్కొనబడెనట (రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక) వాటిలో 'గుణహాంకి' యనెడి కర్ణాటక ఛందము, రేచియాడశెయిద వడుగచ్ఛందము చెప్పబడెను. వీటిలో రెండవది రేచన రచించిన కవిజనాశ్రయము వడుగచ్ఛందము అనగా తెలుగుచ్ఛందము యాప్పిరంగలమ్ కారికలు రచించినవాడు జైనుడట. కనుక జైన విద్వాంసుల రచించిన ఛందముల నతడు చెప్పెను. కనుక ఈ బహిరంగ సాక్ష్యాన్ని, పక్షపాతబుద్ధితో వ్రాశాడనిఅనుకోకపోతే, స్వీకరించవచ్చును అందులో 'వాంచియార్ శెయిద వడఘు చందవుం' అని యున్నదని శాస్త్రిగారు వ్రాసిరి (వేంగి సంచికపుట 219) అనగా వాంచియ రచించిన తెలుగు ఛందమును కూడ జూచి తానా గ్రంథమ్ము రచించెనని యర్థమగుచున్నది. వాంచియను తెలుగు ఛందోగ్రంథకర్త తెలియ రాకున్నాడని శాస్త్రిగారు దానిని మొదట బయటపెట్టిన ద్రావిడ నిఘంటు కార్యాలయములో పనిచేయుచున్న శ్రీ రాఘవయ్యంగారిని విచారించితిమనియు, ప్రాచీన అరవ లిపిరీతి బాగుగ పరిశీలించ గలిగిన రాఘవయ్యంగారు అది 'వాంచియార్' కాదు 'రేచియార్' కాదగునని చెప్పిరనియు వ్రాసిరి, కొన్ని సంస్కృత శబ్దములలో కూడ ఇట్టి లిపి మార్పులు గలవని చెప్పిరట. అందుమీద శాస్త్రిగారు రేచియార్ రచించిన తెలుగు ఛందము 'యాప్పిరంగలం' కంటె పూర్వము, అనగా 11వ శతాబ్దికి పూర్వము రచింపబడినదని చెప్పిరి. ఈ యభిప్రాయముతో నేకీభవించుచూ నిడుదవోలు వేంకటరావుగారుకూడ వావిళ్ళవారి ప్రతికి పీఠిక వ్రాయుచు కవిజనాశ్రయము 11 వ శతాబ్దమునకు పూర్వపుదని వ్రాసిరి. ఈ యిరువురు పరిశోధకుల యభిప్రాయము దృష్టి యందుంచుకొని గ్రంథస్థమైయున్న అంతరంగ సాక్ష్యములు పరిశీలించ దగియున్నవి.

అందు మొదటిది 'కవిజనాశ్రయ' బిరుదు వహించిన మల్లియ రేచన ప్రతి అధికారంతమున ప్రస్తుతించిన 'వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాణ' అనునది. ఇది కవిజనాశ్రయునియొక్క గురువును గూర్చిన ప్రణుతి వాదీంద్రచూడామణి యనునది ఆ గురువుగారి బిరుదమేకాని పేరుకాదు. కనుక ఆ గురువును గుర్తించుట కష్టసాధ్యము, 8, 9, 10, 21 శతాబ్దాలలో తెలుగు-కన్నడ ప్రాంతాలలో జైన, శైవ విద్వాంసులలో విశేషించి కొందరు 'వాది' పదముతో కూడిన బిరుదులు వహించువారు. వాదములో ప్రతివాదుల నోడించు మహాతార్కిక విద్వాంసులని ఆ బిరుదులకు అర్థము. వాదీభ పంచానన, వాదీభసింహ, వాదికోలాహల, వాదిఘరట్ట (ప్రతివాదులను తిరుగలి రాళ్ళ మధ్య గింజలవలె నలుపువాడని అర్థము) వాదిరాజ, వాదిఘంఘళ, పరవాదిమల్ల, ఇత్యాది బిరుదులట్టివి, పరమత ఖండన, స్వమతస్థాపన అనేదే ఆనాటి విద్వత్తుకు సార్థకత. ఈ బిరుదులు వారివాద పటిమను ప్రకటించునవిగా నుండెడివి. వేములవాడలో రెండవ అరికేసరికాలమున క్రీ. శ. 930 – 50 ఆ తరువాత అతని కొడుకులు మనుమడు మూడవ అరికేసరి కాలమున కూడ వర్ధిల్లిన గౌడ విద్వాంసుడు సోమదేవుడు వాదములలో గొప్పవాడట. అతనికి 'వాదీభ పంచానన' (అనగా ప్రతివాదులనెడి గజములకు సింహము వంటివాడు) అను బిరుదుండెను. అతడు 93 మహావాదులను జయించినట్లు తన యశస్తిలకములో (2వ పుట 418) చెప్పుకొనెను. అతని శిష్యులలో వాదిరాజ, వాదీభసింహ అను బిరుదులున్న వారుండిరట ఆనాడు వేములవాడ అనేక జైన విద్వాంసులకు నెలవై యుండెడిది. ఆ కాలమున తెలుగుదేశములో అంతటి జైన కేంద్రము మఱియొకటి లేదన వచ్చును. మత విషయముననే గాక అది జైన విద్యా కేంద్రముగా కూడ నుండెను. ఆది కన్నడ మహాకవిగా ప్రసిద్ధిగాంచిన పంపకవి, అతని తమ్ముడు జినవల్లభుడు రెండవ అరికేసరి యాస్థానము నలంకరించిని వారిలో ప్రముఖులు కనుక తెలుగుదేశములో వాదీంద్రచూడామణి యను బిరుదుగల మహావిద్వాంసుడు కూడ ఆ కాలమున వేములవాడలో నుండి యుండునని యూహించవచ్చును. ఆ విద్యాకేంద్రములోనే మొదటి తెలుగు ఛందము వెలువడెనని చెప్పుట సాహసము కానేరదు. చరిత్రకు తెలిసినంతలో వేఱొండు జైన విద్యాకేంద్రము తెలుగుదేశమున లేదంటిమి. కవిజనాశ్రయకర్తయగు మల్లియరేచన జైనుడనునది నిశ్చయము. అతడు శ్రావకాభరణుడు ఆ రోజులలో జైన విద్వాంసులు, కవులు పలువురు కన్నడమున ఉద్గ్రంథములు రచించినట్లు తెలియును. కనుక అట్టి వారి సాంగత్యముచేసి రేచన యీ తెలుగు ఛందోగ్రంథము రచించెననుటలో సంశయము లేదు. వేములవాడ భీమకవి కర్తృత్వమును వాదించువారు 'కవిజనాశ్రయ' రచన ఒకవిధంగా వేములవాడలో జరిగెనని అంగీకరించినట్లే కదా!

అవతారికలోని నాలుగవ పద్యమున వాచకాభరణుడను బిరుదు వహించిన ప్రాణ సమానమిత్రుడు తనకీ కృతియందు సహాయుడుగా నుండెనని చెప్పుకొనెను కనుక తనకు సహాయ మొనర్చినవాడు జైన మత బోధకులలో శ్రేష్ఠుడొకడు గలడు. నారాయణ భట్టు అను కన్నడ విద్వాంసుని సహాయముతో తెనుగు



భారత రచనకు నన్నయ్యభట్టు పూనుకొన్న విషయము తెలిసినదే కదా. అట్టి యీ ప్రథమ ఛందోగ్రంథ రచన కూడ ఒక కన్నడ విద్వాంసుడో, తెలుగు విద్వాంసుడో, లేక నారాయణభట్టువలె అనేక భాషా పాండిత్యము గలిగినవాడో యైయుండును. అతడు వాచకాభరణుడు కూడ. అంటే జైన మత ప్రబోధచేయు మహావిద్వాంసులలో శ్రేష్ఠుడు. కవిజనాశ్రయకర్త మల్లియరేచనయేనని అంగీకరించుటో వాచకాభరణుడెవరో గుర్తించుట సులభమగును. కాలము నన్నయకు కొలదిముందో, లేక వెనుకయోనని ప్రసిద్ధ పరిశోధకులు శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు, నిడుదవోలు వేంకటరావుగారు, మఱికొందరు అంగీకరించిరి. పదవ శతాబ్దాంతము వరకూ జైన విద్యాకేంద్రముగా తెలుగుదేశము విలసిల్లినది. వేములవాడ తప్ప వేఱొండు నగరము లేదంటిమి. 11, 12 శతాబ్దములలో గూడ అట్టి కేంద్రమున్నట్టు స్పష్టముగా తెలియదు. పదకొండవ శతాబ్దాదిలో కళింగ ప్రాంతమున ఒక జైన కేంద్రముండెడిదని తెలియును కాని దానిని గూర్చిన విశేషములు తెలియవు. జైన కేంద్రములుండ వచ్చును కాని అచట విద్యావిషయకముగా ప్రాముఖ్యమున్నట్టు తెలియవలెగదా మల్లియ రేచనకు సహాయపడిన, వాచకాభరణుడెక్కడివాడో కనుగొనవలెను.

ఈ సందర్భమున కుర్క్యాల శిలాశాసనము కొంత సాక్ష్యము పలుకుచున్నది. కరీంనగరు నుండి జగిత్యాల పోవురోడ్డు ప్రక్కన సుమారు 20 కి.మీ దూరమున కుర్క్యాల గ్రామమున్నది రోడ్డునకు మఱొకవైపున ఒక గుట్టపైన కొన్ని జైన ప్రతిమలు, చక్రేశ్వరిదేవియు మలచబడి వాటి క్రిందిభాగమున ఒక పెద్ద శాసనము చెక్కబడెను. దానిని మొదట కనుగొని ప్రకటించిన వారు వేలటూరు వేంకట రమణయ్యగారు (భారతి, మార్చి 1967) దానిలో తేదీ చెప్పబడలేదు. కాని అందు చెప్పబడిన పంపకవి యొక్క వృత్తాంతమునుబట్టి అది సుమారు క్రీ. శ. 940 – 950 మధ్యకాలము నాటిదై యుండునని చెప్పవచ్చును. కన్నడ వాఙ్మయ చరిత్ర పరిశోధకులకు ఈ శాసనము అతి ముఖ్యమైనది. కనుక కన్నడ విద్వాంసులనేకులు వచ్చి శాసన ప్రతిబింబములు తీసుకొని వెళ్ళిరి. అందలి విశేషమేమన : అది సంస్కృతము, కన్నడము, తెలుగు భాషలలో రచింపబడెను. మొట్టమొదటి తెలుగు కందపద్యము లిందు గలవని విద్వాంసులంగీకరించిరి. పంపమహాకవియొక్క తాతముత్తాతలు వేంగి దేశమునకు చెందిన కమ్మనాటిలోని గుండినదీ ప్రాంతము నుండి రాజాదరణము కొరకై కన్నడ రాజుల యొద్దకు చేరిరి. భీమనయను పేరుగల విద్వాంసునకు పంపన, జినవల్లభుడు అను సోదరులు జనించిరి. పెద్దవాడైన పంపకవి ఇమ్మడి అరికేసరి రాజుయొక్క కథ కొంత వ్యంగ్యముగా నుండునట్లు సంస్కృత మహాభారతకథను విక్రమార్జున విజయ మనుపేర అతి రమ్యముగ రచించి ఆ రాజున కంకిత మొసర్చెను. అరికేసరికి 'గుణార్ణవ' యను ప్రసిద్ధ బిరుదు నాముండెను. దాని ననుసరించి పంపకవికి 'కవితాగుణార్ణవ' యను బిరుదును, ధర్మపురమనెడి అగ్రహారమును బహూకరించి సన్మానించెనని అందు కలదు. పంపని తమ్ముడైన జినవల్లభుడు కూడ గొప్ప విద్వాంసుడు, జైన మత ధర్మబోధ చేయు ప్రవక్త అతడి కొండవద్ద గొప్ప ఉత్సవములు చేయుచు పలువురు భవ్యులను, శ్రావకులను రావించి వారికి గొప్ప మర్యాద చేయుచుండుట అతని ఘనత మూడు భాషలలోను పద్యములందు ప్రశంసించబడెను. పరిశోధకులు పంపకవిని గూర్చిన సమాచారమును వివరించుట యందే నిమగ్నులై జినవల్లభుని గొప్పతనమును గూర్చి అంతగా పరిశోధన జరుపలేదు. అతని ఘనతను ప్రశంసించుచున్న కొన్ని పద్యభాగముల నిచట ఉదహరించెదను.

శ్లో. గీతం గాతు మనేకభేద సుభగం కావ్యాని సోద్భావనం
వాదాన్వాదయితుం ప్రియాణి వదితుం సాధ్వ్యాపకర్తుం సతాం
భోగా న్సేవితు మంగనా రమయితుం పూజాం విధాతుం జినే
జానీతే జినవల్లభః పరమిదం పంపాభిధానానుజః

జినవల్లభుడు చక్కని కవిత్వము చెప్పగల నేర్పరి. గీతములు పాడగలడు, జినపూజలు చేయుటలో దక్షుడు. దీనినిబట్టి జినవల్లభుడు చక్కని శ్రావ్యధ్వనితో జినధర్మపదములను, హరికథగానో, పురాణముగానో స్వయముగా రచించి శ్రావకులకు వినిపించి వారి మన్ననలకు పాత్రుడగు చుండెను. మతప్రబోధములో ఉత్సవములు చేయుట కూడ భవ్యుల నాకర్షించుటలో నొక విధానము

శ్లో. యాత్రాయాత సమస్త భవ్యజనతా సన్మాన దానోద్యతం
పంపార్యానుజమత్ర భీమతనుజం సమ్యక్త్వ రత్నాకరం

యాత్రార్థము వచ్చిన వారిని సన్మానించి దానాదులొసగుటయందు ఆసక్తి గలవాడు సమ్యక్త్వ రత్నాకరుడను విశేషణము జైన రత్నత్రయమును సమ్యక్ ప్రవర్తన, సమ్యగ్బుద్ధి, సమ్యక్సిద్ధి అను మూడింటి విశేషము లను పాటించువాడని అర్థము.

శ్లో. అజస్ర జినవర్ధనాగత మునీశ్వర శ్రావక ప్రజా స్తవ
రవ ప్రతిధ్వనిత శబ్దకోలాహలైః!
అధిష్ఠిత దిగంబరో వృషభశైల ఏష స్వయం
వరాం వదతి వాచకాభరణ కీర్తిమ్ అశక్రతః

ఈ కొండపేరు వృషభశైలము నిరంతరము వచ్చెడి మునీశ్వరులు శ్రావకులు ప్రజలు చేయుస్తవములతో ఆ కొండ ప్రతిధ్వనించెడిది. దిగంబర జైన మునులు అధిష్ఠించిన ఆ వృషభశైలమే స్వయముగా ఆ వాచకాభరణుని కీర్తిని చాటు చుండును. దీనిని బట్టి జినవల్లభునికి 'వాచకాభరణు' డనే బిరుదు ప్రసిద్ధముగా నున్నట్టు తెలియుచున్నది. బిరుదులను మాత్రమే వాడుకొనుట అనాడు అనేక సందర్భములలో గనవచ్చును. 'వాదీంద్రచూడామణి' శిష్యుడు గదా కవిజనాశ్రయుడు కర్తృ పేరు, రేచన పేరు లేకుండనే బిరుదులు మాత్రము అధికారాంత గద్యలో వాడబడుట చూచితిమి గదా పంపకవి కూడ 'కవితాగుణార్ణవ' బిరుదునే వాడుకొని తన 'ఆది పురాణము' కవితాగుణార్ణవ ప్రణీత మహాదిపురాణదోళ్' అని ప్రకరణములు ముగించెను. రాజులు కూడ తమ బిరుదనామములతోనే అధికారిక ముద్రలను, నాణెములను వాడుట తెలిసినదే. ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి 'త్రిభువనమల్లు'డనే బిరుదముతోనే శాసనములందు పేర్కొనబడుట గనవచ్చును. ఇట్టి ఉదాహరణలు అనేకము చూపవచ్చును. కనుక అనాడు వేములవాడ ప్రాంతములో 'వాచకాభరణు'డంటే జినవల్లభుడేకాని అన్యుడు కాడు. అతడు గొప్ప దాతయని కూడ ఇందు కీర్తింపబడెను. 'భవ్య జనతా సన్మాన దానోద్యతం' అని కవిజనాశ్రయ మిందైన అవతారిక పద్యంలో కూడ 'అసమదాన రవితనయ' అని విశేషించి కీర్తింపబడెను. కవిత్వ రచనలో అతనికి గల విశేష ప్రతిభ యీ కన్నడ పద్యములో చెప్పబడుచున్నది.

'చతుర మయ్యోయ పక్కవిత్వద సద్ద పంపన తమ్మనా
ర్వదె పొగత్తెయె కాణ ల్బరెయ ల్కవిత్వద తత్వదా
శృదిదు నేర్వదె పేళలిర్వి గపూర్వ మాగిరె బల్లాన
ప్పదరి నోర్వనె వాగ్వధూపర వల్లభం జినవల్లభం ॥

జినవల్లభుడు చతుర కవిత్వ రచనయందు నేర్పుగలవాడట. పెక్కువిధములగు కావ్యములు రచించుట యందును, కవిత్వతత్త్వ మెఱిగి అట్టు రచించుటలోను, వివరించుటలోను అతని శక్తి సామర్థ్యములు ఇలలో సాటిలేనివి. కావున అతడే వాగ్దేవికి శ్రేష్ఠమైన వల్లభుడు. వాగ్వధూ వర వల్లభం జిన వల్లభం అని కీర్తింపబడెను. అది యొక విశేష బిరుదము ఈ బిరుదు కూడ కవిజనాశ్రయకర్త ఒక సందర్భమున, యతిచ్ఛందోధికారములో స్రగ్విణీవృత్తమును గూర్చి చెప్పుచు

"వాగ్వధూ వల్లభా ! వార్థి రేఫావళిన్
స్రగ్విణీవృత్త విశ్రామముల్ ధాత్రిపై" అని వాడుకొనెను.

జినవల్లభునికి గల బిరుదును తనకుగా వాడు కొనుచున్నాడు గనుక 'వర' పదమును తొలగించి 'వాగ్వధూ వల్లభా!', అని మాత్రమే ప్రయోగించెను. కవిత్వ

తత్త్వ మెరిగిన ఇంతటి గొప్ప విద్వత్కవియు 'వాచకాభరణ' బిరుద నామధారి యునైన జినవల్లభుడు తనకు ప్రాణ సమాన మిత్రుడైయుండ మల్లియ రేచనకు తెలుగులో ఛందోగ్రంథ రచనకు అతడు తోడ్పడెననుట సహేతుకముగా నిరూపించ వీలగుచున్నది.

ఇట్టి విద్వత్సాంగత్యము తనకు వేములవాడలో సమకూరుచుండగా మల్లియ రేచన పంపమహాకవిని స్మరించకుండ ఉండగలడా? ఈ సందర్భమున నిజమగు అవతారికలోనున్న ఈ కంద పద్యము స్మరింపదగియున్నది,

కం. పరగిన విమల యశోభా
సురచరితుఁడు భీమనాగసుతుఁడ ఖిల కళా
పరిణతుడయ్యును భూసుర
వర ప్రసాదోదిత ధ్రువ శ్రీయుతుఁడై.

ఈ పద్య మెవరిని కూర్చి చెప్పబడెనో తెలియుట లేదు. గ్రంథకర్త 'గురుయతి గణముల పాదాంబురుహంబుల కెఱఁగి' అని రెండవ పద్యములో సామాన్యముగా గురువులకు, జైనమునులకు నమస్కరించినట్లు శ్లేషగా చెప్పిన దానిని అన్వయించుకొనవచ్చును. కాని విశేషించి తనకు గురువెవ్వరో చెప్పబడ లేదు. అధికారాంత (ప్రకరణాంత) గద్యములలో మాత్రము ఒక వాదీంద్ర చూడామణి గురువుగా స్మరింపబడుచున్నాడు. పై పద్యములోని భీమనాగసుతు డెవ్వడో తెలియదు. మధ్య సందర్భము కొంత విచ్ఛిన్నమైనట్లు స్పష్టమగు చున్నది. ఆ లుప్త భాగములో తన గురువైన వాదీంద్ర చూడామణియే వర్ణించ బడి యుండునని ఊహించుటకు వీలగుచున్నది. ఈ యూహ సహేతుకమైనదని తలంచితిమేని, ఆ వాదీంద్ర చూడామణి భీమనాగసుతుడు కావలెను. అట్టివాడు పంపమహాకవి కాదగునా ? కాని పంపన భీమనాగసుతుడైనను, అతనికి వాదీంద్ర చూడామణియను బిరుదమున్నట్లు మనకెందును తెలియవచ్చుట లేదు. కొందరు ప్రసిద్ధ కన్నడ పరిశోధకులను గూడ సంప్రదించితిని ఈ యూహకు సరియైన ఆధారము లభించు వరకు భీమనాగసుతుని, వాదీంద్రచూడామణిని పంపకవిగా గుర్తించుట ప్రస్తుతానికి వీలుకాదని చెప్పవలెను. భీమనాగసుతుని వర్ణించు పద్యమొకటి అవతారికనుండి తొలగించబడినట్లు మాత్రము దానికి సందర్భము కుదరక పోవుటను బట్టి చెప్పవచ్చును. గురుస్తుతి విశేషించి చెప్పబడకుండుట రెండవ లోపము. వేములవాడలో వర్ధిల్లిన రేచన వాచకాభరణుని ప్రశంసించుచు పంపకవిని విస్మరించడు గదా! అయినను 'వాదీంద్రచూడామణి' యని గురువుగా కీర్తించబడిన వ్యక్తి గుర్తించబడు వరకు పై యూహ సరికాదనిపించుచున్నది. వేములవాడలో అప్పుడు 'వాదీంద్ర' పదముతో నేర్పడిన బిరుదులు గలవారు. సోమదేవుని వంటి విద్వాంసులుండిరి.




ఈ చర్చ ముగించుటకు ముందు చెప్పవలసిన విషయములు కొన్ని కలవు కన్నడ కవుల యొద్ద ఆంధ్ర కవులు కొన్ని విషయములు మొదట నేర్చుకొని రనుటలో తప్పులేదు. దేశీయ పదములను సరియగు కారకములలో నియమబద్ధ మొనర్చివాడుట, సంస్కృతము నుండి, ప్రాకృతము నుండి గ్రహించిన పదములను పద్యపాదములలో ఛందోబద్ధముగా ఇముడ్చుట, వాటిలో ముఖ్యమైనవి. లక్షణ గ్రంథములున్నట్లు మనకు తెలియక పోయినను, కొన్ని శాసనములలోను, నశించి పోయిన రచనలలోను పదవ శతాబ్దము నాటికి తెలుగులో కొన్ని రచనలు ఉండి యుండును. పద్మకవి రచించిన జినేంద్రపురాణము, గజాంకుశుడను కవి కృష్ణ రాజు (రాష్ట్రకూట) కాలమున కొన్ని రచనలు తెలుగులో చేసియున్నట్లు నిడుదవోలు వారు 'ఆంధ్ర కర్నాట సారస్వతములు పరస్పర ప్రభావము' అను పుస్తకములో (పుటలు 64 – 74) తెలిపిరి. వాటి నాధారముగాగాని మల్లియ రేచన మొదటి ఛందోగ్రంథము రచించెను! తెలంగాణములో నున్న వేములవాడలో ఆ కాలమున పంపమహాకవి, జినవల్లభుడు మున్నగు మహా విద్వత్కవుల సహాయముతో అతడీ రచన చేసెను. దాని కాలము క్రీ. శ. 940 - 950 మధ్య భాగము కావచ్చును, అప్పుడు 'వాచకాభరణు'డను బిరుదము గలవాడు వేములవాడలో పంపకవి తమ్ముడైన జినవల్లభుడుండెను. అతడే రేచనచేత ఈ ఛందో గ్రంథమును రచింపజేసెను. రేచన గురువైన వాదీంద్రచూడామణి యొక్క గుర్తు ప్రస్తుతము తెలియుట లేదు. అతడు, అవతారికలో చెప్పబడిన భీమనాగసుతుడు ఒకరేనా లేక భిన్న వ్యక్తులా అను విషయము గూడ నిశ్చయించి చెప్పగల ఆధారములు లేవు. ఆ భీమనాగసుతుని చెప్పుచున్న పద్యము తరువాత ఒకటి రెండు పద్యములు లోపించియుండునని చెప్పుటకు దానికి అన్వయము సరిగా కుదుర కుండుటయే కారణము.

ఆంధ్రదేశమున జైనమతము క్రీ. శ. 1000 తరువాత క్షీణదశ నొంద మొదలిడెను. జైన కవుల కృతుల నొల్లనివారు కొందరు ఈ కవిజనాశ్రయ మును వేములవాడ భీమకవి కృతముగా జెప్ప సాహసించి అవతారికలోని కొన్ని పద్యములు తొలగించి, కొన్నిటికి పాఠాంతరములుగా కనుపించుచున్న మార్పులు చేసి క్రొత్త అవతారికను కూడ జేర్చియుందురు. అప్పకవి చెప్పిన 'వికట కవులు కొందరు వింతలు కల్పించి కవిజనాశ్రయమున జేర్చి' రను ఆ నాటి అభి ప్రాయాన్ని స్వీకరించక తప్పదు. ఆ వింతలలో గ్రంథకర్తృత్వమునే తారు మారు చేయుట ముఖ్యమైనది. ఆ మార్పులు 17వ శతాబ్దంవాడైన అప్పకవి కాలం నాటికే జరిగెను. కనుక ఆయనకు కూడ కర్తృత్వాన్ని గూర్చిన నిజ విషయం తెలిసియుండక పోవచ్చును. జనశ్రుతిని బురస్కరించుకొని అతడట్లు చెప్పియుండును. ఇట్లుండ క్రీ. శ. 1050 ప్రాంతంలో రాజరాజనరేంద్రుడి ప్రోత్సాహముతో రచింపబడిన నన్నయ భారతము మఱికొన్ని పౌరాణిక రచనలు మాత్రమే తెలుగు వాఙ్మయమున మొదటిదిగా పరిగణింపబడవలెననెడి అభిలాషతో గాని, లేక జిన కవుల రచనలు గ్రాహ్యములు కాకూడదను భావముతోగాని యిట్టి మార్పులు జేసియుందురు. శైవ గ్రంథము లనేకము కొంతకాలమట్లే మఱుగున పడియున్నవి కదా! కవిస్తుతులలో శివకవులను పౌరాణిక కవులు, స్మార్త పౌరాణిక కవులను శివకవులు గాని స్మరించకుండుట తెలిసినదే కదా. ఆ తరగతిలో జేరినదే. యీ శ్రావకుడు మల్లియ రేచన రచించిన కవిజనాశ్రయము కాకపోతే గ్రంథాన్ని వుంచారు. కాని అనేక వింతలు మార్పులు చేర్చి గ్రంథకర్తృత్వాన్ని కూడ తారుమారు చేశారను కోవటంలో సందేహము లేదు.

కవిజనాశ్రయ గ్రంథానికి వేములవాడతో సంబంధం కలదను విషయాన్ని ఆధారంగా గొని వేములవాడకు చెందిన భీమకవికి దాని కర్తృత్వాన్ని ఆపాదిస్తే లోకం సులభంగా నమ్ముతుందనే ధైర్యంతో కొందరు చేసిన పని యిది అని పిస్తుంది. అప్పటికి భీమకవి జీవించియున్నట్లయినచో ఇట్టి అపవాదుకు అంగీక రించువాడు కాదేమో. అతడు చనిపోయిన కొలది కాలంలో ఈ మార్పు జరిగి యుండును. □

# భారతి

సాహిత్యాభిమానులకు ★

చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకోవచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడుతుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




- - - - - - - - - - - - - - - - - - - - ✂ - - - - - - - - - - - - - - - - - - - -

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________________

చిరునామా : ______________________________

______________________________

చందాదారుని సంతకం

# ఋణం

## బులుసు వేంకటేశ్వర్లు

రామశాస్త్రి బస్సుకోసం ఎదురుచూస్తూ బల్లమీద కూలబడ్డాడు.

మనస్సంతా అస్థిమితంగా ఉంది!

రోహిణీకార్తె ఎండవల్ల ఉడికిపోతున్న శరీరంకన్నా–అనంత్ అన్న మాటల వల్ల రామశాస్త్రి మనస్సు అంతకు రెండు రెట్లు అధికంగా ఉడికిపోతోంది!

ఈ సమాధానం కోసమేనా తాను శ్రమపడి ఇంత దూరం వచ్చింది? ఈ మాత్రం సలహా ఇచ్చేవాళ్ళు ఊళ్ళో లేరనా ఇక్కడికి వచ్చింది? తన కొడుకు రత్నాలరాశి అనీ, తనంటే వాడికి ప్రాణం కన్నా ఎక్కువన్న అపోహలో బ్రతుకుతున్న...తన భార్య లక్ష్మీదేవికి... లోకంపోకడ తెలియని వెర్రిదానికి.... "అబ్బాయి ఏమన్నాడండీ?" అని అడిగితే ఏమని చెప్పాలి?

కొడుకు డాక్టరై-ఇంకో లేడీడాక్టర్‌ని పెళ్ళి చేసుకొని పట్నంలో రెండు చేతులా సంపాదించుకుంటూ....,"నీ చదువు కోసం చేసిన అప్పు మాటేమిట్రా అబ్బాయ్?" అని నోరు తెరిచి అడిగితే-వాడిచ్చిన జవాబు రామశాస్త్రి పాలిట కాలకూటం అయింది!

ఆ మాటల్ని రామశాస్త్రి గుండెల్లో ఇముడ్చుకోలేక-కక్కలేక బాధపడుతున్నాడు.

"ఎందుకు నాన్నా! ఆ ఎకరం చేనుమీద మీకు అంత మమకారం? మీ తర్వాత నేను ఆ పల్లెలో ఉంటానా? వ్యవసాయం చేస్తానా? ఆ భూమి అమ్మేసి షావుకారి బాకీ తీర్చేయండి! బాకీ పోను మిగిలిన డబ్బులో నాకేమీ ఇయ్యొద్దు! ఏదో బ్యాంక్‌లో వేసుకుని మీరిద్దరూ తినండి!

అయినా మేమిద్దరం స్టేట్స్‌కి వెళ్ళాలని ప్రయత్నిస్తున్నాం! డబ్బు చాలా అవసరం ఇప్పుడు! కదూ సునందా?"

కోడలు తలూపింది.

రామశాస్త్రి ఇంక అక్కడ ఓ క్షణం కూడా ఉండలేకపోయాడు. లేచి చక్కా వచ్చాడు.

ఇంకా బస్ వచ్చే సూచనలు లేవ్!

రామశాస్త్రి మనస్సు గతంలోకి పరుగులు పెట్టింది!

"...రామశాస్త్రికి లక్ష్మీదేవికీ ఏకైక సంతానం అనంత్!

రామశాస్త్రికి తండ్రి ఆర్జితంగా మిగిలింది ఒక్క చిన్న ఇల్లూ–ఓ ఎకరం భూమీనూ!

స్వంత ఊళ్ళోనే చేస్తున్న బడిపంతులు ఉద్యోగం వల్ల వచ్చే కొద్దిపాటి జీతాన్ని ఆసరాగా చేసుకొని – పంటమీద తిండికి లోటు లేకుండా కాపురం సాగించాడు రామశాస్త్రి!



ఓ రోజు సాయంత్రం .. పాతికేళ్ళ క్రితం....

లక్ష్మీదేవికి నొప్పులొస్తున్నాయని....కబురు మోసుకొచ్చాడు ఆచారి!

ఆ సమయంలో...రామశాస్త్రి చేలో ఉన్నాడు! కంగారుగా ఇంటికి బయల్దేరాడు చేనుగట్టునే!

ఎదురుగా రెండుబారల దూరంలో...మిలమిల్లాడుతూ మెరిసిపోతోంది! నల్లత్రాచు!

బుస కొడుతూ...పడగవిప్పి ...గట్టుకి అడ్డంగా ఉండిపోయింది! రామశాస్త్రి అప్రతిభుడయ్యాడు.

మనస్సులో లక్ష్మీదేవి ఎట్లా ఉందోనన్న ఆరాటం!

గట్టుమీద త్రోవకడ్డంగా బుసకొట్టే నల్లత్రాచు!

రామశాస్త్రికి తన తండ్రి చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయ్!

"మన దిబ్బమీద పాము తిరుగుతోంది! దానికెప్పుడూ అపకారం చెయ్యద్దు!"

రామశాస్త్రి తండ్రి వేదపండితుడు! మంత్రశాస్త్రంలో దిట్ట!

ఎవ్వరిముందూ ఎన్నడూ చెయ్యి చాపకుండా–తను నేర్చుకున్న విద్యను కావాలని దగ్గరికొచ్చిన నలుగురికీ నేర్పి–కాలం చేసిన మహానుభావుడాయన!

ఆయన వృద్ధుడయ్యేసరికి—అగ్రహారంలో ఇంగ్లీషు చదువుల మీద వ్యామోహం పెరిగిపోయింది.

అందరితోపాటు రామశాస్త్రి కూడా హైస్కూల్ చదువు పూర్తి చేసాడు ఆ రోజుల్లో తండ్రి కిష్టం లేకపోయినా..."

ఎదురుగా పాము అలాగే వుంది కదలకుండా!

అప్రయత్నంగా రామశాస్త్రి చేతులు జోడించాడు "లక్ష్మికి సుఖప్రసవం ఐతే పుట్టిన సంతానానికి నీ పేరు పెట్టుకుంటాం"

మనస్సులోనే మొక్కుకున్నాడు!

పాము మెల్లగా తలవాల్చి పక్కకు తొలగిపోయింది!

రామశాస్త్రి పరుగులాంటి నడకతో ఇంటికి చేరుకున్నాడు!

లక్ష్మీదేవి మొగబిడ్డని ప్రసవించింది! తల్లీ పిల్లవాడూ క్షేమంగా ఉన్నారు!

నాగేంద్రునికి మనస్సులోనే దండం పెట్టుకున్నాడు రామశాస్త్రి.

కుర్రాడికి "అనంత్" అని నామకరణం చేసాడు!

అనంత్ చదువులో అనంతప్రతిభనే చూపించాడు!

స్కూల్ చదువునుండి డాక్టర్ చదువు పూర్తి చేసేదాకా – ప్రతి పరీక్ష ఫస్ట్ రేంక్‌లోనే పాసయ్యాడు.

ఊరంతా రామశాస్త్రి అదృష్టాన్ని నోరారా పొగిడింది!

"అనంత్‌లాంటి కొడుకు ఒక్కడుంటే చాలదా? ఏమైనా అదృష్టవంతుడవయ్యా!–" సహోపాధ్యాయుల ప్రశంస!

"కష్టాలు ఇంకెంతకాలంలే లక్ష్మమ్మా! అబ్బాయ్ రేపు డాక్టరయ్యాడంటే ఇల్లంతా డబ్బుతో కప్పేస్తాడు–" లక్ష్మమ్మ దగ్గర ఇరుగు పొరుగు అమ్మలక్కల పొగడ్తలు!

ఆ ప్రశంసలన్నింటికీ-రామశాస్త్రి చిరునవ్వే సమాధానం!

అనంత్—డా. అనంత్ అయ్యేసరికి రామశాస్త్రి ఊళ్ళో షావుకారు చలమయ్య దగ్గర చేసిన అప్పు ఇరవై వేలుదాకా అయ్యింది!

ఆ అప్పు చూసి రామశాస్త్రి ఏనాడూ భయపళ్ళేదు!

"రేపు అనంత్ ప్రాక్టీస్ పెడితే-ఈ అప్పు రెండేళ్ళలో తీరిపోదూ? వాడి తెలివితేటలూ - ఉత్సాహం-చూసి కాదనలేక, స్తోమత లేకపోయినా. వాణ్ణి ఎమ్.బి.బి.యస్‌లో జేర్పించాడు తాను..."

ఉన్నవాడు ఒక్కడు...వాడికిష్టమైన చదువే చెప్పించటం మంచిది.

"శాస్త్రీ! కొడుకుని డాక్టర్ చెయ్యాలనుకొంటున్నావ్! మంచిదే! చాలా ఖర్చైపోతుంది చూసుకో" అని సలహా ఇచ్చినవాళ్ళు లేకపోలేదు!




అయినా భయపడకుండా అనంత్‌ని కాలేజీలో జేర్పించి వచ్చాడు రామశాస్త్రి!

చదువు పూర్తి అవుతుందనగా అనంత్ ఇంటికి వచ్చాడు!

కొడుకు తనకేదో చెప్పాలని చెప్పలేక తనలో తాను గుడుసుళ్ళు పడుతున్నట్లు గ్రహించాడు రామశాస్త్రి.

"రారా! చేసుగట్టు కెళ్ళొద్దాం!" అన్నాడు ఆ సాయంత్రం కొడుకుతో!

అనంత్ చొక్కా తొడుక్కొని తండ్రి వెనకే బైల్దేరాడు!

త్రోవలో అన్నాడు రామశాస్త్రి కొడుకుని ఉద్దేశించి! "అబ్బాయ్! ఈ ఏడాదితో నీ చదువు పూర్తి అవుతుంది. ఈ చుట్టుపక్కల పది ఊళ్ళ జనం సరైన డాక్టర్ లేక బాధలు పడుతున్నారు! ఉన్న వూరూ కన్నతల్లీ-అన్నారు! నువ్విక్కడే ప్రాక్టీస్ పెట్టరాదూ?"

"ఇక్కడా? ఇక్కడ ప్రాక్టీస్ పెడితే ఏం లాభం నాన్నగారూ? రూపాయి రెండుకీ కూడా బేరమాడతారు ఇక్కడి ప్రజలు! కాకినాడలోనే ప్రాక్టీస్ పెడదామనుకొంటున్నాను" అన్నాడు అనంత్ ఫెడీల్న!

తన కొడుకు ముందు తన మొహం వెలవెలబోకుండా ఉండేందుకు రామశాస్త్రి చాలా కష్టపడవలసి వచ్చింది.

"నాన్నగారూ!"

"ఊఁ!"

"మీతో ఓ విషయం చెప్పాలనుకుంటున్నాను! ఆ సంగతి...మీకు కష్టం కలిగిస్తే...క్షమించండి...."

"చెప్పు! పర్వాలేదు!"

అనంత్ సందేహిస్తూ మొదలుపెట్టాడు—"సునంద అని నా క్లాస్‌మేట్! చాలా గుణవంతురాలు! వాళ్ళ తండ్రి కాకినాడలోనే పెద్ద బిజినెస్ మేగ్నెట్! సునందా నేనూ ప్రేమించుకున్నాం...పెళ్ళి చేసుకోదల్చినాం...."

అనంత్ మాటల్లో దృఢ నిర్ణయం కన్పిస్తున్నది!

రామశాస్త్రి ఏం తొందర పళ్ళేదు!

"ప్రాప్తేతు షోడశేవర్షే పుత్రం మిత్రవదాచరేత్—"

"ఇంతకీ వీడు ఆ అమ్మాయిని కలవారి అమ్మాయని ఆశపడుతున్నాడా? ఆమె గుణగణాలు చూసి వలచాడా?—" రామశాస్త్రికి అనంత్ ఆంతర్యం ఏమీ బోధపళ్ళేదు!

"పెళ్ళి చేసుకొని ఇద్దరం టౌన్లోనే ప్రాక్టీస్ పెడదామనుకుంటున్నాం!"

దాహం! ధనదాహం!!

తన కడుపున పుట్టిన బిడ్డ ఇల్లా తయారయ్యేడేవిటి?

జన్మభూమి మీదా-తల్లిదండ్రుల మీద-ఇక్కడి పొలం మీద—ఇంటిమీదా-ఇక్కడి మనుషుల మీదా—ఏమాత్రం అపేక్ష వున్నట్లు కనబడదేం?

ఇది తన పెంపకంలోని లోపమా?

సమాధానం కోసం చూస్తున్న అనంత్‌కి రామశాస్త్రి తలపంకింపే సమాధానం అయ్యింది!

తండ్రీ కొడుకులిద్దరూ ఇంటిదారి పట్టారు.

తిరిగివస్తుంటే గట్టుమీద నీరెండలో నల్లత్రాచు పడగ విప్పుకుని బుసలు కొడుతూ కన్పించింది!

అది ఎందుకో కోపంగా ఉన్నట్లు కన్పించింది!

"నాన్నగారూ! పాము!" కంగారుగా అరిచాడు అనంత్!

రామశాస్త్రి నిదానంగా అన్నాడు: "అవున్రా! పామే! ఇది మీ తాత కాలంనుంచీ మన దిబ్బనే అంటిపెట్టుకుని బతుకుతోంది! ఏ పూర్వజన్మల్లోని ఋణవో ఈనాడిలా తీర్చుకుంటోంది!"

అనంత్‌కి తండ్రి మాటలు చాదస్తంగా తోచాయ్.

అయినా వాదించే ధైర్యం లేక ఊరుకున్నాడు.

పాము పక్కకి తొలగిపోయింది!

మౌనంగా ఇంటికి తిరిగి వచ్చేసారిద్దరూ!

నెల తిరక్కుండా అనంత్-సునందల పెళ్ళి ఆడంబరంగా జరిగిపోయింది!

మొదట్లో కొడుకు నిర్ణయం విని గొడవ పెట్టినా రామశాస్త్రి సాంత్వన వచనాలకి తలవొంచక తప్పలేదు లక్ష్మీదేవమ్మకి.

పెళ్ళిలో వేషాల్నిబట్టి చూస్తే తాను తన భార్యే దిష్టిబొమ్మల్లా ఉన్నామనిపించింది రామశాస్త్రికి.

లక్ష్మీదేవమ్మకి-రామశాస్త్రికి అక్కడ ప్రత్యేక మర్యాదలు ఏం జరగలేదు! పెళ్ళికి వచ్చిన బంధువుల్ని చూసినట్టుగానే చూసారు వీళ్ళిద్దర్నీ కూడా!

మర్నాడే....లక్ష్మీదేవమ్మని తీసుకుని రామశాస్త్రి పల్లెకి వచ్చేసాడు!

"ఏవండీ! కోడల్ని చూపించరా?" అని పల్లెలో అడిగిన వారందరికీ ఓ వెఱ్ఱి నవ్వొకటి సమాధానంగా నవ్వేరు ఆ దంపతులిద్దరూ!

తరువాతి నెల్లోనే 'ఇన్విటేషన్' వచ్చింది రామశాస్త్రికి "సునందా నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవం!"

శాస్త్రి నిర్లిప్తంగా ఆహ్వాన పత్రాన్ని పక్కన పడేసాడు!

మరో సంవత్సరం గిర్రున తిరిగింది.

'తనకి కొడుకు పుట్టాడంటూ' అనంత్ వ్రాసిన ఉత్తరం అందుకొన్నాడు రామశాస్త్రి.

రామశాస్త్రి ఎదురు చూస్తున్న ఉత్తరం మాత్రం కాదు అది!

"...చలమయ్య దగ్గర భూమిని తాకట్టు పెట్టిన విషయం...ఇరవై వేలు దాకా కట్టి భూమిని విడిపించుకు పోవాల్సిన సంగతి... తను ఇదివరకే చెప్పాడు! అదీ పూర్తిగా ..."నీ చదువు కోసం అయినదేరా!...పంటమీద సగం అప్పు నేనే తీరుస్తాను! మిగిలిన సగం....నువ్వు..." అంటూ విషయం అంతా చెప్పాడు తాను కొడుక్కి!

"ఆ ఎకరం ముక్కైనా మిగిల్తే తన తర్వాత లక్ష్మి గుట్టుగా ఇంట్లో కూర్చుని రోజులు గడిపేస్తుంది—" అని తన ఊహ!

అనంత్ మౌనంగా ఉండిపోయాడు!

తాను రెండు పూటలా...కళ్ళకద్దుకుని నోట్లో పెట్టుకునే నాలుగు మెతుకులూ తన చేలోవి!...రామశాస్త్రి కదో తృప్తి.

ఆ నేలతల్లే ఇన్నాళ్ళూ ప్రాణాలు నిలబెట్టింది.

ఆ నేలతల్లే ఎన్నో కష్టాల్లో రామశాస్త్రిని ఆదుకుంది.

ఆ నేలతల్లే ...అనంత్‌ని డాక్టర్ చదివించింది.

కానీ—తాను మాత్రం షావుకారు చేతుల్లో తాత్కాలికంగా చిక్కుకుపోయింది!

లేదు...భూమిని విడిపించాలి! ఋణం తొలగించుకోవాలి!

"వాడికి మాత్రం పిత్రార్జితం మీద మమకారం ఉండదూ?" అనుకొన్నాడు రామశాస్త్రి.

అనుకున్నదే తడవుగా పట్నం బైల్దేరాడు.

అనంత్ హాస్పిటల్‌కు బయలుదేరేముందు విషయం కదిపాడు తాను.

వాడు చెప్పిన సమాధానం మళ్ళీ జ్ఞాపకం చేసుకోడానికి మనస్కరించలేదు రామశాస్త్రి! అయినా మరిచిపోవడం ఆయన వల్ల కావడం లేదు!

"భూమి అమ్మి అప్పు తీర్చేయమని అమెరికా ప్రయాణం కోసం తమకే ఇంకా డబ్బు అవసరంగా ఉందనీ..."

బస్ వచ్చి పెద్దగా హారన్ మ్రోగించింది!

ఆలోచన్లోంచి బైటపడి బస్సులోకి జొరబడ్డాడు రామశాస్త్రి!

మనస్సు మనస్సులో లేదు.

భూమిని అమ్మక తప్పదా? అప్పు తీరే మార్గం లేదా?

భూమిని నాల్గయిదేళ్ళు షావుకారికి వదిలేస్తే ...బాకీ వడ్డీతోసహా తీర్చుకొని.... తన భూమిని తనకి అప్పగిస్తాడేమో! అడిగి చూడాలి!

ఆc! అంతే చెయ్యాలి!

నాల్గయిదేళ్ల పెంషన్ డబ్బుల్తో కాలక్షేపం చేసేస్తే...ఆ తర్వాత భూమి సొంతమై పోతుంది!

షావుకారుకి తన ఎకరంమీద పెద్ద ఆశ లేదు! స్వతహాగా ఉన్నవాడు! చిన్నతనంలో తనముందు ఓనమాలు దిద్దినవాడే! కాస్తో కూస్తో గురుభక్తి ఉన్న మనిషే!

తనమీద గౌరవంకొద్దీ పంటలమీద అప్పు తీర్చుకోడానికి షావుకారు ఒప్పుకుంటాడని రామశాస్త్రికి అన్పించింది.

బస్ ఊరి పొలిమేరల్లో దింపి వెళ్ళిపోయింది.

రామశాస్త్రి కెందుకో ఓసారి చేను చూసివద్దామన్పించింది.

కాళ్లు అప్రయత్నంగానే చేనువైపు తిరిగాయ్.

నీరెండలో రామశాస్త్రి నీడ-పిత్రార్జితం మీద అయనకున్న మమకారంలాగే దీర్ఘతరంగా చేనుమీద పడుతోంది!

బోదెగట్టుమీద అడుగుపెట్టిన రామశాస్త్రి అప్రతిభుడయ్యాడు.

గట్టుమీద...నల్లత్రాచు ....ఎందుకో.... మెలికలు తిరిగిపోతోంది!

చిన్నగా....బుసలు కొడుతూ...బాధ పడుతోంది!

రామశాస్త్రికేం పాలుపోలేదు.

పాము బాగా ముసలితనంలో ఉన్నట్టు కన్పించింది.

పాము మెలికలు తిరుగుతుంటే తెల్లని మెత్తని పొట్ట కన్పిస్తోంది.

రామశాస్త్రి గుండెలు బరువెక్కాయ్! కనుకొలకుల్లో నీళ్ళు నిండాయ్!

పంచె పైకి దోపుకుని మోకాళ్ళలోతు వున్న బోదెలో నిలబడ్డాడు రామశాస్త్రి!

రామశాస్త్రికి ఆ సమయంలో అది విషప్పురుగు అన్పించలేదు!

మరణశయ్యమీద వేదన పడుతున్న తన తండ్రే గుర్తుకు వచ్చాడు.

బోదెలో నీళ్ళు దోసిల్తో తీసి పాము తలపై పోసాడు!

అది రామశాస్త్రిని గుర్తించినట్టు ఓసారి తలఎత్తి మళ్ళీ పక్కకు వాల్చేసింది!

అంతే!

మళ్ళీ చలనం లేదు!

ఏ మహామౌనియో తన శాంతమయ జీవితంలో ఒకే ఒక్కసారి నిరప






# ఊపిరి నీ ఉషస్సు

## డా॥ సి. నారాయణరెడ్డి

బొద్దింకలు పాకే బుర్రల్లో
బోధి వృక్షాలు మొలుస్తాయా?
అజ్ఞానం కమ్మిన చేతుల్లో
అజంతాలు మెరుస్తాయా?
జ్ఞానం ఓ గానతరంగం
కదలి దాని పురిటిల్లు
గగనం దాని పొదరిల్లు
ఆకాశానికి అనుక్షణం తపన
సముద్రంలో ఆత్మహత్య చేసుకుని
సహస్ర బాహువులతో ఈదాలని.
సముద్రానికి చచ్చేటంత ఆరాటం-
ఆవిరై పోయి ఆకాశంలో
రెక్కల మబ్బులతో ఎగరాలని,
మరుగుతున్న చైతన్యమా! నీకు
మరోసారి నమస్కారం.
ఆవిరి నీ తపస్సు
ఊపిరి నీ ఉషస్సు.



రాధిని కోపావేశంతో శపించి-తత్ఫలితంగా పామై పుట్టి తన చేలో ఆ జన్మని అనుభవించి తిరిగి తన పునర్దివ్య లోకాన్ని పొందినట్లు అన్పించింది రామశాస్త్రికి!

రామశాస్త్రిని ఆ సమయంలో మహా వైరాగ్యం ఆవరించింది!

పామే! నోరులేని ప్రాణి!

కృతజ్ఞత లేని విషపురుగుల జాతిలో పుట్టిందే—అయినా ఏనాడూ ఎవరికి హాని తలపెట్టలేదు!

కూలీల పంటల కోతల్లో....గట్టుమీద పచ్చగడ్డి కోతల్లో...కాళ్ళతో తొక్కినా మెత్తగా జారిపోయిందే కానీ...బుస్సుమన్నా అన్లేదు! పగబట్టలేదు! తన చేనుకు రక్షణగా....రెండు తరాలు...తనతో ఏ పూర్వజన్మల ఋణాను బంధమో చెల్లించుకొంది!

తనను చూసినప్పుడల్లా ఆనందపడింది! ఆశీర్వదించింది! చివరికి...తన చేతుల్లోనే...చివరి శ్వాస విడిచింది!

"తండ్రికి తులసి తీర్థం పోసిన చేత్తోనే—దీనికి గుక్కెడు నీళ్ళు పోశాడు తాను..."

మళ్ళీ ఆ చేను గట్టుకు రావాలని అన్పించలేదు రామశాస్త్రికి!

పాప ! ఎందుకు చచ్చిపోయి ఉంటుంది?

తాత్కాలికంగానైనా...షావుకారి చేతుల్లో తన పొలం పెట్టడం దానికి ఇష్టం లేదా?

ఏ ఎండ్రిన్ కొట్టిన చేలల్లో తిరిగిందా?

చుట్టుపక్కల చేలల్లో క్రిమి సంహారక మందులు కొట్టిన జాడలేదు!

పైగా కోతలకైము ఇది! ఈ సమయంలో చేలకి మందులు కొట్టర ఎవ్వరూ!

తుదిసారిగా ...నిశ్చలంగా పడివున్న పాముకి నమస్కరించి కాలువగట్ట ఎక్కాడు రామశాస్త్రి!

ఊళ్ళో కొచ్చేముందు రేవులో దిగి నీళ్ళల్లో మునిగాడు కట్టుబట్టల్తోటే!

సంధ్యవాలింది!

తడిబట్టల్తో ఇంటికి వస్తుంటే....చలమయ్య ఎదురయ్యాడు నాల్గు వీధు మొగలో రామశాస్త్రికి!

"చలమయ్యా! రేపోసారి ఇంటికి రా! నా చేను నీకు రాసేస్తాను! హెచ్చు తగ్గులుంటే తర్వాత చూసుకుందాం! వచ్చేటప్పుడు ఆ ఏర్పాట్లతో రా!"

వెళ్ళిపోతున్న రామశాస్త్రిని తెల్లబోయి చూస్తూ ఉండిపోయాడు చలమయ్య

రామశాస్త్రి ఇంటివైపు నడుస్తున్నాడు నిశ్చింతగా-శాంతంగా-సుఖదుఃఖా సకల ద్వంద్వాతీత శాంతమయ మనస్కుడై ! □

# ఈ మాసం - మీ నక్షత్ర ఫలం
# మే నెల 1986.

**1. మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

**అశ్విని** వారికి ఆదాయం బాగుండును. ఉద్యోగావకాశాలు మెరుగవులాయి-విద్యార్థులకూ, వర్తకులకూ, వ్యవసాయదార్లకూ మంచి అనుకూల కాలం. అయినా శుభకార్య ప్రయత్నాలు ఫలించినట్లే అనిపించి, వాయిదా పడును. ఆరోగ్యం బాగున్నా, ప్రతి చిన్నపనికీ విశేషశ్రమ కల్గును. కృత్తిక 1వ పా. వారికి శారీరకంగా, మానసికంగా, శ్రమ, ధనవ్యయం, ఆందోళనా, కలిగినా, అన్ని పనులూ ఆలస్యంగానైనను నెరవేరును. ఉద్యోగులకూ, విద్యార్థులకూ, వర్తకులకూ బాగుండును. భరణి వారికి మాత్రం కార్యవిఘ్నం, మానసికంగా ఆందోళనమూ, శారీరకంగా విశేషశ్రమా, నెల 20 తేదీనుండి మరింతగా చిక్కులూ కల్గును. ఆరోగ్యం కూడ అంతంత మాత్రంగా వుండును. ఎన్నోవిధాల శ్రమ పడినా, ఫలితం మాత్రం అతి తక్కువగా వుండును.

**2. వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి, మృగశిర 1, 2, పా)

కృత్తిక 2, 3, 4 పా. రోహిణి వారలకు ఈ నెలంతా శుభాశుభ మిశ్ర ఫలం కల్గును. అతి వ్యయప్రయాసలతో పనులు నెరవేరుతాయి, అనుకోని విధంగా ధనవ్యయం జరుగుతుంది. 17వ తేదీనుండి కొంత అనుకూలఫలం కలుగుతుంది. మూడవ వారంనుండి వర్తకులు, వ్యవసాయదార్లు, విద్యార్థులూ, ఉద్యోగులూ, మొ॥ అన్ని వర్గాలవారికీ వారి వారి ప్రయత్నాలు అనుకూల ఫలితాన్ని ఇయ్యగలవు. సుఖసంతోషాలు వృద్ధి పొందుతాయి. మృగశిర 1, 2, పా. వారికి మాత్రం 16వ తేదీవరకు కుజుడు, ఆపైని వక్రశనీ చాలా చిక్కులు తెచ్చిపెడతారు. ఆరోగ్యభంగం, ధనానికి తొట్రుపాటూ, ఆత్మీయులతో విరోధం, సాటివారితో మాట పట్టింపులూ, తాత్కాలికంగా ఏర్పడిన శత్రువులవల్ల ఇబ్బందులూ, హెచ్చు అగును. పనికిమాలిన ఆలోచనలతో మానసికంగా ఆందోళన కూడా హెచ్చును. పడుట, దెబ్బలు, గాయములు తగులుట, అతివేడిమి మొదలగునవి కల్గును. శని కుజులకు శాంతి చేయించుట మంచిది.

**3. మిధునం** (మృగశిర 3, 4, పా. ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3,పా)

మృగశిర 3, 4, పా. వారికి కొంతవరకు గురుబలం బాగుండును. కాని శరీరంలో తీవ్రమైన వేడిమీ, శ్రమా కల్గును. ప్రతి వ్యవహారంలోనూ త్రిప్పట, ధనవ్యయం, ప్రయాస, తప్పదు. 18వ తేదీ వరకు భార్యకు నలత, ధనమునకు తొట్రుపాటూ కల్గును. ఆరుద్ర వారికి 18వ తేదీవరకు అన్నివిధాలా బాగుండును. ఆ పిమ్మట శ్రమ, ధనవ్యయం, వ్యాకులపాటు, అనుకొన్న పనులు సకాలంలో నెరవేరక వాయిదా పడుట, కుటుంబంలో కలతలూ, నలతలూ మొదలయిన చిక్కు ఫలితం కలుగును. 18వ తేదీవరకూ అనుకూల శుభఫలం కలుగును. పునర్వసు 1, 2, 3, పా. వారికి ధనలాభం, రెండవవారంలో భాగ్యవృద్ధి, స్థిరాస్తి సంపాదన, ఆరోగ్యవృద్ధి కలుగును. శుభకార్యాలు నెరవేరును, హెచ్చుగా శుభకార్యాలలో పాల్గొనుట జరుగును. మృగశిర, ఆరుద్ర విద్యార్థులకు సామాన్య శ్రేణి, పునర్వసు వారికి ఉత్తమశ్రేణి కలుగును. ఉద్యోగులకు, వర్తకులకు అధిక ప్రయోజనం కలుగును. కర్షకులకు బాగా అనుకూల ఫలం కలుగును.

**4. కర్కాటకం** (పునర్వసు 4వ పా. పుష్యమి, ఆశ్లేష)

**పునర్వసు** 4 పా. వారికి 14 వరకు మనశ్చాంచల్యం వుండును. అన్ని విషయములలో బాగున్నను, అసంతృప్తి, హెచ్చుగా నుండును. శుభకార్యములకై ధనవ్యయం హెచ్చుగా ఉండును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకూ శ్రమతో కూడిన అభివృద్ధి, లాభమూ కల్గును. శుభకార్యములందు హెచ్చుగా పాల్గొనుట జరుగును. పుష్యమివారికి శరీరశ్రమ, నలత 18వ తేదీ తర్వాత మరింత హెచ్చుగా వుండును. తరచు ప్రయాణాలు, అధికశ్రమ కలిగినా పుణ్య కార్యములు నెరవేరును. విద్యార్థులకు సామాన్యఫలం, కర్షకులకు, ఉద్యోగులకూ బాగుగా కలసివచ్చును. ఆశ్లేష వారికి అన్నివిధములా సుఖసంతోషములు కలిగి వివాహాది శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. సంఘంలో పలుకుబడి బాగుండును. ఆశ్లేష విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు, వ్యవసాయదారులకు, రాజకీయవాదులకూ, మంచి యోగదాయకమైన కాలము.

**5. సింహం** (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

14 వరకు ఈ రాశివారందరికీ మనస్సునకు ఆందోళనముండును. మఘ వారికి శుభాశుభమిశ్ర ఫలం కల్గును, ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు, కర్షకులకూ అనుకూలంగా ఉండును. శుభకార్యముల మూలకంగా ధనవ్యయం కలిగి సువర్ణ వస్త్రాభరణప్రాప్తి, ధనసంపదల అభివృద్ధి కలుగును. పుబ్బ వారికి శరీరశ్రమ, పనికిమాలిన ధనవ్యయం, పనికిమాలిన ఆలోచనలు, తొందరపాటుతో వ్యర్థప్రయత్నాలు చేయుట, మానసికంగా ఎక్కువ బాధపడుట, ఆరోగ్యం కూడ సామాన్యంగా ఉండుట జరుగును. వర్తకులకు బాగుండును. విద్యార్థులు మిక్కిలి శ్రమపడినగాని విజయం కలుగదు. గృహమందు కలత నలతలు కలిగి తొలగిపోవును. ఉత్తర 1 పా. వారికి మొదటి 15 రోజులు శ్రమ హెచ్చుగా ఉన్నను, తరువాత నెల అంతయు అన్ని రంగములలోని వారికి కార్య విజయం, ధనలాభం, ఉద్యోగాభివృద్ధి, వ్యవసాయ, వ్యాపారములలో మంచి లాభం కల్గును

**6. కన్య** (ఉత్తర 2, 3, 4 పా. హస్త. చిత్ర 1, 2 పా)

ఉత్తర 2, 3, 4 పా. వారికి నెలంతా ముఖ్యముగా నెల రెండవ భాగము నుండి బాగుగా ఉండును. ఆలస్యంగానైనను కార్యములు నెరవేరును. శుభకార్యములలో హెచ్చు పాల్గొనుట జరుగును. ధనం బాగుగా కలసి వచ్చును. హస్త వారికి నెల మొదటి రెండు వారములు శరీరశ్రమ, ధనవ్యయం జరుగును. మానసికంగా ఎల్లప్పుడు ఆందోళనా, భయమూ కలుగుచుండును. పిరికితనం హెచ్చుగా వుండును. గతంలోని శ్రమ క్రమక్రమంగా తగ్గి సుఖ సంతోషములు హెచ్చును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు, కర్షకులకూ హెచ్చు శుభ ఫలములు కల్గును. చిత్ర 1, 2 పా వారికి 18 వ తేదీవరకు చిక్కులూ, మానసిక శ్రమ, అధిక వ్యయమూ, కుటుంబంలో కలత నలతలూ హెచ్చుగా వుండును. చిన్న చిన్న ఏక్సిడెంట్లు కూడ జరుగవచ్చును. నెల 3, 4 వారాలు అన్ని విధాలా అనుకూలంగా ఉండును.

**7. తుల** (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

చిత్ర 3, 4 పా. వారికి 18 వ తేదీ వరకు కుటుంబంలో చిక్కులూ, సోదరీ సోదర వర్గంతో విరోధం, భార్యకు శరీరంలో నలత, ధనమునకు తొట్రుపాటు కల్గును. 20వ తేదీనుండి క్రమంగా చిక్కులు తగ్గును. స్వాతి వారికి చివరి వారంలో స్వల్పంగా నలత చేయును. ధన వ్యయమగును. మానసిక వ్యధ కల్గును, మొదటి మూడు వారములు అనుకొన్న పనులు త్వరగా నెరవేరుతాయి.

అవసరమునకు ధనం సమకూడి గృహ నిర్మాణం, వివాహాది శుభకార్యములూ నెరవేరును, వర్తకులకు, విద్యార్థులకు, ఉద్యోగులకూ అనుకూలమైన కాలము. కాని కుటుంబంలో అప్పుడప్పుడు అశాంతి కల్గును. విశాఖ 1, 2, 3 పా వారికి 21వ తేదీవరకు బాగుగా వుంటారు. అనుకొన్న పనులు సకాలంలోనే నెరవేరుతాయి. మానసికంగా ఆందోళన కలిగినా వ్యవహారములు సక్రమంగా జరిగిపోవును.

8. వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4 పా వారికి మాత్రం 10వ తేదీవరకు కుటుంబంలో నలత కల్గును కొంత ధనవ్యయం కూడ జరుగును. అయినను విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, రాజకీయవాదులకూ పూర్తిగా కాకపోయినను, కొంత అసంతృప్తికరంగానే ఫలము వుండును. అనూరాధ వారికి శరీరశ్రమ హెచ్చు. 20వ తేదీ తర్వాత శరీరంలో నలత కూడా చేయును. 10-21 తేదీల మధ్య భార్యకు నలత చేయును శనికి శాంతి చేయుట మంచిది. జ్యేష్ఠవారికి గతంకన్న శుభఫలం హెచ్చుగా ఉండును. అనుకొన్న పనులన్నీ సక్రమంగా నెరవేరుతాయి. డాక్టర్లూ, లాయర్లూ, ఉపాధ్యాయులూ, వర్తకులూ మొ॥ వారందరికి వారి వారి రంగములలో రాణింపు బాగుగా ఉండి, విజయం, ధనలాభం, సంఘంలో మంచి గౌరవం హెచ్చును.

9. ధనుస్సు (మూల, పూర్వాషాఢ. ఉత్తరాషాఢ 1పా)

మూల వారికి శుభకార్య ప్రయత్నాలకు ఆటంకం కల్గును. ధనవ్యయం హెచ్చుగా వుండును. బంధువర్గంతో అభిప్రాయ భేదాలు కల్గును. ఉద్యోగులకు, వర్తకులకు సామాన్యయోగం. వ్యవసాయదారులకు, వృత్తి ఉద్యోగులకూ బాగుగా లాభించును. పూర్వాషాఢ వారికి శరీరశ్రమ 20వ తేదీ దాటిన తర్వాతనుండి మరింత హెచ్చగును. సంబంధం లేని బాధ్యతలు నెత్తిపై వేసికొని బాధపడుట, ఎన్నో పనులలో తలదూర్చి దేనిని పూర్తిగా సాధింపలేక ధనవ్యయం మాత్రం చేయుచు. అనవసరంగా బాధపడుట జరుగును. ఉత్తరాషాఢ 1పా. వారికి మాత్రం అన్ని విషయములు అనుకూలంగా ఉండును. ఉద్యోగులూ, వర్తకులూ మొ॥ అన్ని రంగముల వారికి అనుకూలమైన శుభఫలం కలుగును

10. మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4, పా. వారికి అన్ని రంగములవారికి ఆరోగ్యం, సంతోషం, ఉత్సాహం కల్గును. బంధుమూలకంగా ధనవ్యయం కల్గును. శ్రవణం వారికి బంధుసమాగమం. శుభకార్యసిద్ధి, ధనలాభం, భూగృహాది స్థిరాస్తి సంపాదించుట జరుగును. ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు విశేష ధనలాభం కల్గును. విద్యార్థులకు ఉన్నతశ్రేణిలో విజయం కల్గును. ధనిష్ఠ 1, 2 పా. వారికి శుభఫలాలు కలిగినను, మానసిక, శారీరక శ్రమ హెచ్చు. ఆందోళనము, చిన్న చిన్న దెబ్బలు తగులుట, బంధుమూలకంగా ధనవ్యయం, పనికిమాలిన ఖర్చులు హెచ్చుగా వుండును 16వ తేదీనుండి అధిక శుభఫలములు కల్గును.

11 కుంభం (ధనిష్ఠ 3, 4 పా. శతతార. పూర్వాభాద్ర 1,2,3, పా)

ధనిష్ఠ 3,4 పా. వారికి ధనలాభం, ఉద్యోగాభివృద్ధి, శుభములు, సంతానమునకు అభివృద్ధి, విద్యార్థులకు విద్యాభివృద్ధి జరుగును. వర్తకులకు 18వ తేదీ వరకు సామాన్యంగాను, ఆ పిమ్మట లాభం విశేషంగాను కలుగును. కర్షకులకు కూడా 3 4 వారములలో మేలు కల్గును. శతభిషం వారికి 18వ తేదీవరకు శుభం, ఆరోగ్యం, ధన భాగ్యాదిలాభం, సువర్ణాభరణ ప్రాప్తి కల్గును. అన్ని రంగముల వారికి అభివృద్ధి కల్గును, 18వ తేదీ తర్వాత శరీరశ్రమ, నలత కల్గును.

పూర్వాభాద్ర 1,2,3 పా. వారికి శరీరశ్రమ హెచ్చు. త్రిప్పట, అలసట, ఉండును. కాని అన్ని రంగములలోను, అన్ని వర్గములవారికి లాభదాయకంగా, శుభప్రదంగా ఉండును. ధనం బాగా కలిసి వచ్చును.

12. మీనం (పూర్వాభాద్ర 4 పా ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4వ పా వారికి శరీరశ్రమ హెచ్చుగా ఉన్నను లాభం, విజయం, ఆభరణప్రాప్తి, సంఘంలో గౌరవం బాగుగా ఉండును. ఉత్తరాభాద్ర వారికి శరీరంలో శ్రమ, నలత, బలహీనత కల్గును. మిగిలిన విషయములన్నియు బాగుగా వుండును. కుటుంబంలో స్వల్పంగా కలతలూ, వాగ్వాదములూ, ఇతరులతో స్వల్పంగా ఘర్షణలూ జరుగును. రేవతి వారికి ఉత్సాహం, ధైర్యం, ధనలాభం, కుటుంబంలో సుఖశాంతులు, మాట పలుకుబడి, గౌరవం బాగుగా వుండును. శుభకార్యముల నిమిత్తం వ్యయం జరుగును. విద్యార్థులకు ఉన్నత శ్రేణి విజయం కల్గును. డాక్టర్లకు లాయర్లకు, రాజకీయవాదులకు హెచ్చుగా సుఖసంతోషాలు కల్గును శుభకార్యాలు నెరవేరి, స్థిరాస్తి సంపాదన చేయుట జరుగును. ఈ రాశివారందరికి ఈ నెల చాల అనుకూలంగా వుండును.

గమనిక :- (వృత్తి, వయస్సు, జీవన విధానం, అర్హత, స్త్రీ పురుష భేదమూ వగైరాల ననుసరించి ఫలములను అన్వయించుకొనవలెను)

సిద్ధాంతి

**శ్రీ నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

బొబ్బిలి





శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

# సంస్కృత నాటకములను ఎట్లు ఆడుచుండిరి

సంస్కృత నాటకములు చాల ఉన్నవి. పది విధములైన రూపకములు మొదలు పదునెనిమిది విధములైన ఉపరూపకములవరకు, పదునైదు నిమిషముల ఏకాంకిలు మొదలు పదియంకముల మహానాటకముల వఱకును, మనవారు వ్రాయుచుండిరి. బ్రహ్మాండమైన భరతనాట్య శాస్త్రమున్నది. రంగమంటపమెట్లు కట్టవలెను, పొడవు, వెడల్పు అందులో నేపథ్యగృహము, ప్రేక్షాగృహము. రంగశీర్షము, రంగపీఠము, దారుకర్మ, భిత్తికర్మ, చిత్రకర్మ. మర్త్యోచితము, దేవోచితము, నాట్యధర్మి, లోకధర్మి, పాత్రోచిత భాష, వేషములెట్లు వేసికొనవలెను అంతయు నున్నది. కాని తెరలనుగుఱించి ఒక యక్షరమైనను లేదు. నేపథమున్నది కాబట్టి వేషము వేసికొనుట, నాటకమాడునప్పుడు ప్రేక్షకులకు కనబడకాదు, పూర్తి వేషధారణమై అభినయమునకు ముందు రంగప్రవేశసమయముననే పాత్ర కనబడవలెను, కాబట్టి (నేత్రయోః పథ్యం, నేపథ్యం, పృషోదరాదిత్వాత్ లోపః) ఒక తెర తప్పదు.

మఱి నాటకములలో, కొన్ని పాత్రలు అపటీక్షేపమున ప్రవేశించునదనదు. అది సంభ్రాంత ప్రవేశసూచకమట, తటాలున తెరను త్రోసికొని వచ్చుటయట. మఱి ఏ తెరను? నేపథ్యపు, వేషము వేసికొనుచోటికి ముందుదైన యెడల, లోపలిదంతయు కనబడునుగదా. వికారముగా నుండునే. బాగుండదే కాబట్టి ఇది మరియొక తెరయా? అట్లైనయెడల ప్రతి అంకమునకును ముందు వేయుచు తీయుచు ముందుతెర యగునా? అప్పుడు అంక ప్రారంభమున దీనిని వత్తుదురుగదా. ఎత్తిన తెర, పైన, చూరుకడగదా ఉండును. దానిని త్రోసికొని వచ్చుట యెట్లు. వేసియున్న తెరను త్రోసికొనిరావచ్చునుగాని వేయని తెరను తొలగించుట అసాధ్యము కాబట్టి రంగమందు నాటకాభినయము జరుగుచుండగా తెరను త్రోసికొని యొక పాత్ర వచ్చునేని తప్పక నేపథ్యపు తెరగానే యుండవలెను కాని, అది బాగుండదే, వికారమే. కాబట్టి అది కాదు.

"అంతట ఆసనస్థుడు రాజు ప్రవేశించును." "అంతట నిద్రితుడు రాజు ప్రవేశించును" — ఇట్లు కూర్చున్నవారుగా, నిద్రించుచున్నవారుగా కనబడుట యన్నది తెరే లేకపోయిన ఎట్లు కుదురును. కాబట్టి నేపథ్యపు తెరయొకటి, రంగము ముందు ఒకటి, రెండుతెరలు తప్పవుగాని ఈ రెండునుగాక, మూడవ తెర, ఈ రెంటికి నడుమ ఉండవలెనుగదా. అట్టిది యుండెనా?

ఒక ఆశ్చర్యము, తెరనుగుఱించి భరతనాట్య శాస్త్రమందుగాని, దశరూపకాదులలోగాని, ప్రతాపరుద్రీయ సాహిత్యదర్పణాదులలోగాని ఎచ్చటను లేకపోవుట, ఏ నాటకలక్షణకారుడును చెప్పకపోవుట; నాటకములలోనే లేకపోవుట మఱి యవనికయని యున్నదే, తెరగదా, ఆ పదమును మన శాస్త్రకారులు చెప్పలేదే! ప్రాకృత నాటకములలో అంకములకు జవనికలని పేరటగదా. సంస్కృత నాటికలలో కొన్నిట అంకములకు యవనికలనియేకలదు. అన్నిటికిని సూక్ష్మ, సూక్ష్మతర భేదములను ప్రయోగరచనాది విధానములను చెప్పిన ఆలంకారికులు తెరనుగుఱించి మనము ఊహించుకొని బాధపడవలసినట్లు చేసినారే!

అమరకోశము మొదటి నిఘంటువుగదా, అందులో నాట్యవర్గ యున్నదిగదా, నాటక లక్షణము, దశరూపకాదులులేవే! అంకమను మాట నాటక విభాగముగా గాక వేరే అర్థమున నున్నదే! "కళంకాంకౌ లాంఛనం చ, చిహ్నం లక్ష్మ చ లక్షణమ్". "అంకో నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం యుధిభూషణే" అనునది తర్వాతి నిఘంటుకారులది. అమరుడు అంకమును నాటకవిభాగముగా నెఱుగడు అంతేకాదు బీజబిందుపతాకా ప్రకరీ కార్యములను, ఆరంభయత్న ప్రాప్త్యాశా నియతాప్తి సమాగమములను, విష్కంభక ప్రవేశక చూళికాంకావతార, అంకముఖములను చెప్పలేదు. ఇంతెందులకు అమరసింహుడు నాట్యమునేతప్ప నాటకము చెప్పనేలేదు. ఏ కాలమువాడు. నాటకములు అతనికాలమున లేవా, లేక విద్యార్థులకివి అక్కరలేదా? కాబట్టి ఒకటి తేలుచున్నది. అమరసింహుని కాలమున నుండినవి నాట్యములేగాని నాటకములుగావు. వానికింకను పరిణామ కాలము. నాట్యమునుండియే క్రమముగా నాటకములు పరిణమించియుండవలెను

జవనికాశబ్దమును అమరుడు చెప్పినాడు. 'ప్రతిసీరా జవనికా స్యాత్ తిరస్కరిణీ చసా'! కాని ఇది పట్టి పరదా. మఱుగు. నాటకరంగపు తెరకాదు. కాని తెర జవనికయను పేర ఎఱుపుగా నుండెడిది.

"సంధ్యా శోణాంబర జవనికా
కామినోః ప్రేమనాట్యం
నాందీభ్రామ్యద్భ్రమరవిరుతం,
మారిషః కోపికాలః
తారాః పుష్పాంజలి మివకిరన్
సూచయన్ పుష్పకేతోః
నృత్యారంభం, ప్రవిశతి
సుధాదీధితి సూత్రధారః"
(రసతరంగిణి)

నాట్యములకు 'తోపు' రంగు (ఒకవిధమైన ఎఱ్ఱమట్టి రంగు) ఉండెడిదని తెలుగు కవులును వర్ణించియున్నారు. కవిత్రయములో నొకడైన ఎఱ్ఱన నృసింహ పురాణమున సూర్యాస్తమయము నిట్లు వర్ణించియున్నాడు. (ఆశ్వా.౪. పద్య78)

"సురుచిర తారకాకిరణ
శోభి నభోంగణభూమి, కాలమన్
గరువపు సూత్రధారి జత
నంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపగని
కాసరి కెత్తిన పెద్ద తోపు పెం
దెరయననొప్పె సాంధ్యనవ
దీధితి పశ్చిమదిక్తటంబునన్"

పడమటిదిక్కున సూర్యాస్తమయము అప్పుడే ఐనది. సంధ్యాకాలపు క్రొత్త ఎఱ్ఱనికాంతులు కనబడుచున్నవి: రాత్రి రానున్నది. చీకటిపడబోవుచున్నది. ఆకాశమున నక్షత్రములు కనబడుట కారంభించినవి. అది సందర్భము ఆకాశము నాట్యశాల, నక్షత్రములు, అలంకారములు, కాలము సూత్రధారుడు ఎఱ్ఱని కాంతులు తెర. రాత్రి రాబోవు నటి. ఇంకను రాలేదు. ఉత్ప్రేక్షాలంకారము

ఇది ఏతెర? దీనిని తొలగించి నటి ప్రవేశించునా? లేక దీనికి ముందువచ్చి నటించునా? ఇది నేపథ్యపు తెరగా గ్రహింపవచ్చును. సంగీతాదు లక్కరలేదా యన్న కావలసినదే, ఆముక్తమాల్యదలోని ఈ పద్యము తెలుపుచున్నది.

(ఆ 4-115)

క.	నటిన పరశేరి ప్రాత్ర
స్ఫుటయపని కలని మొగిళ్ళ పొదలిన్ తూర్పు
త్తటుల. నవియాకుడిను చిటి
పొటరపము సెలింగెదాళముల చప్పడునాన్.

కొండలనెడు రాజుల తెరియలనెడి ప్రేక్షాగృహములందు ఆడుచున్న నెమళ్ళనెడి ప్రాత్రముల తెరలోయనునట్లు మేఘములొప్పుచుండెను. అవి చెట్ల యాకులను మేసెడి చిటిపొటి శబ్దము తాళముపేయు చప్పుడో యనునట్లు ఒప్పు చుండెను. (రూపకాను ప్రాణితోత్ప్రేక్షాలంకారము) ౧.. తటులన్—ఈశబ్దము చేత, ఏకదేశ విపర్తి రూపకమర్యాదచే రంగప్రవేశములు సూచితములు. (సంజీవనీ వ్యాఖ్య)

నటించు ప్రాత్రలకు వెనుకనుండు తెరయిది. అనగా నేపథ్యమునకు ముందుండు తెరయే. ప్రాత్ర ప్రవేశమునకు ముందు ఒక తెరయుండెడిదని వసు చరిత్రలోని ఈ పద్యము తెలుపుచున్నది.

"హరిదంబోరుహ లోచనల్ గగనరం
గాభోగ రంగ త్తమో
తరనేపథ్యము నొయ్యనొయ్య సదలిం
పన్ రాత్రి శైలూషికిన్
పరుసన్ మౌక్తిక పట్టమున్ నిటలమున్
వక్త్రింబునై దోచెనా
హరిణాంకాకృతి వొల్చె రేకయి, సగం
బై, బింబమై తూర్పునన్"

ఇది వెనుకనుండు తెరగాదు. ప్రాత్రమునకు ముందుండెడి తెర. దీనిని రంగమున, ఇప్పటి తెరలవలె పైనకట్టి ఎత్తుట డించుటయుండదు. మామూలు తెర క్రిందనుండి పైకిపోవును. ఈ తెర పైనుండి క్రిందికి దింపబడినది. దిక్కు లనెడి సుందరీమణులు తాము పట్టిన తెరను క్రిందికి దింపుచుండిరి. అందువలన రాత్రియను నటి కనబడసాగెను. మొదట అలంకరింపబడిన మౌక్తికపట్టము కన బడినది. తర్వాత లలాటము (నెత్తి) తర్వాత పూర్తి మొగమును కనబడినవి. మొగమెప్పుడును స్త్రీలకు చంద్రబింబమువంటిదేగదా. పూర్తి మొగము కన బడినది. అదే చంద్రోదయము తూర్పున ఈవిధముగా చంద్రోదయమును ప్రాత్ర ప్రవేశముతో పోల్చినాడు కవి.

అనగా ఆ కాలములో రంగముమీద ప్రాత్ర ప్రవేశించుటకు ముందు స్త్రీలు తెరపట్టుచు నాట్యముతోడగా, ఆ తెరవెనుక నటి యుండగా, సంగీతము ప్రవ ర్తిల్లుచుండగా, తెరపట్టుచుండిన వనితలు మెల్లమెల్లగా తెరను పైకెత్తక, క్రిందికి దించుచుండగా నటి కొద్దికొద్దిగా కనబడి, పూర్తిగా మొగము కనబడగానే తెర తొలగింపబడి నాట్యము ప్రారంభింపబడును. ఆవిధముగా రాత్రియను నటియొక్క మొగమువలె చంద్రుడుదయించినాడు, ఇందులో తెరదించుట కలదు. అట్లే తెర యెత్తుట అనగా కనబడకుండజేయుట, తెరవుచ్చుట అనగా తీయుటయునుండినవి.

వీనినిబట్టి చూడగా రంగమంతటిని క్రమ్మునట్టి తెరలేదనియు ఏ ప్రాత్ర ప్రవేశించునో అప్పుడు దానికి తెరపట్టుట నాట్యసంప్రదాయమనియు తెలియు చున్నది. ఇది ఆచారమేగాని దీనికి లక్షణకారులు లక్షణము వ్రాయలేదనియు తెలియుచున్నది. ఇది దాక్షిణాత్యాచారమని నీలకంఠ పండితుడు వ్రాసినాడు. "రూపోపజీవనం జాలమందపికేతి దాక్షిణాత్యేషు ప్రసిద్ధం, యత్ర సూక్ష్మవస్త్రం వ్యవధాయ చర్మమయై రాకారైః రాజామాత్యాదీనాం చర్యా ప్రదర్శ్యతే."

మహమ్మదీయులకును జైనులకును నాటకములు లేవు. క్రైస్తవులకు క్రీ. శ. 15వ శతాబ్దమున గ్రీకు విజ్ఞానమువలన వచ్చినది. గ్రీకులకును వైదిక భారతీయులకును చైనా జపాను వారికినే నాటకములు కలవు.

కాని బౌద్ధులకు ఆదిలోనుండినవి. "మౌర్యవంశజుడైన చంద్రగుప్తుడు... ఆంధ్రదేశం మౌర్యసామ్రాజ్యాంతర్గతమైనది. దక్షిణాపథపు నటకులు శోభావతి మహారాజు సమక్షాన బుద్ధనాటకాన్ని ప్రదర్శించారని, సూత్రధారుడే బుద్ధవేషాన్ని, ఇతరులు భిక్షుకపాత్రలను ధరించారని తెలుస్తున్నది. ఇంతేకాదు దక్షిణాపథవాసి యైన యొక నటుడు, సమ్యక్సంబోధిపరకుగల బుద్ధచరితమును నాటకముగా రచించి బింబిసార మహారాజు సమక్షాన ప్రదర్శించాడట..." (మల్లంపల్లి సోమ శేఖరశర్మగారు ఆంధ్రసంస్కృతి, తరంగిణి పురి.)

"అశోకుని కాలములో గిర్నారు శాసనములో జాత్రలు (తిరునాళ్ళు) జరుగు చోట ధర్మబోధకై ప్రదర్శనములు (కొయ్య, తోలుబొమ్మలాటలు, వాసితో పాటలు) జరిగెడివి. మూకనాట్యము, తరువాత నాటకము" (నేలటూరి వెంకట రమణయ్యగారు—యక్షగానములు, తంజావూరు)

రాయలవారి కాలములో 'రంజకం శ్రీరంగరాజు' వంటివారు నాటకము లాడుచుండిరి. శ్రీకృష్ణదేవరాయలవారి జాంబవతీ పరిణయము ఇచ్చటనే మొదట ప్రదర్శింపబడియుండును.

ఈ నాటకములను ఆరుబయటనేగాక రాజగృహములలో, అంతఃపురము లలో కూడ ఆడుచుండిరి. ప్రియదర్శికా నాటికలో వాసవదత్తాపహరణము మాళవికలో మాళవికనాట్యము అంతర్నాటికలు- అంతఃపురమందే ప్రదర్శింప బడినవి. ఇటీవలి విజయనగర తంజాపుర రాజులకాలములలోకూడ నుండినవి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శృంగారశాకుంతలములో ఈ పద్యము వ్రాసినాడు.

"ప్రాసాదోపరి నాట్యశాలికలపైఁ
బద్మాసన ల్నర్తనా
భ్యాసక్రీడలొనర్పఁ దద్భ్రమిరయ
వ్యాయామలంబైనని
శ్వాసామోదముఁ బ్రోదిసేయునికట
స్వర్వాహినీ, కూల కు
ల్యా సంవర్థిత కేసర ప్రసవమ
ధ్వాసార సౌరభ్యముల్"

రామాయణకాలమెప్పుడో తెలియదు. దానియందు నాటక ప్రస్తావమున్నది. స్త్రీ ప్రాత్రలను స్త్రీలే వేయుచుండిరి. 'వధూనాటక సంఘైశ్చ' అని యున్నది. పురుషులును స్త్రీ పాత్రలను ధరించుచుండిరి. అమరకోశమునందు "భ్రుకుంసశ్చ భ్రకుంసశ్చ భ్రూకుంసశ్చేతి నర్తకః, స్త్రీ వేషధారీ పురుషో" అని యున్నది. రాయలవారి ఆముక్తమాల్యదలో 'వివిధలాస్యస్ఫూర్తి సుభ్రూభ్రుకుంసులవాద ల్సరి దేల్చి' అని నాటి వాడుక తెలుపబడినది. ఇది అనాది సంప్రదాయమే,

పాణినికూడ నాటకముల నెరుంగును. కాని సంస్కృతముతో విషా దాంత నాటకములు కూడవుగదా. ఉత్సృష్టికాంకమని యొకటి ఉండిపోయినదట.

రామాయణము విషాదాంతము, కాళిదాసు రఘువంశములోను రామకథ విషాదాంతము. జైమిని భారతమందలి రామకథ సుఖాంతము. మొట్టమొదటి రామనాటకమెవరిదో? భాసుడు కాళిదాసునికంటె ముందువాడు భారత భాగవత రామాయణములనుండి ఇతివృత్తములను గ్రహించినాడు.

శూద్రకుని మృచ్ఛకటి, విశాఖదత్తుని ముద్రారాక్షసములు కాళిదాసునికి ముందువిగానేయుండును. మృచ్ఛకటిలో విచిత్రమేమనగా అంకములు దీర్ఘములుగాను, పదిగాను ఉండుటయేగాక అర్థోపక్షేకములు ప్రవేశకాదులు కానరావు. అంకము తర్వాత అంకము తొడంగుచు నడచినది. పైగా దాని రచయిత రాజు శూద్రకుడట. కాలము తెలియదు. అతని మహిమను తెలుపు కథయున్నది. అన్ని నాటకములలోను సూత్రధారుడు కవికి సమకాలికుడుగానుండును ప్రతి నాటకమందును ప్రస్తావననుబట్టి అది క్రొత్తరచన, ప్రదర్శనము క్రొత్తది. మృచ్ఛకటికమందు మాత్రము కవి ప్రాచీనుడు. ప్రదర్శనము విషయము అస్పష్టము. భాసుని చారుదత్తము దీనికి సంగ్రహము. పైగా సగము నాటకమే ఈ రెండింట ఏది ముందు, ఏది వెనుక. భాసుడు రచించి రాజుపేర ప్రకటించి ధనము గ్రహించినట్లు కింవదంతులు కలవు. 'కావ్యం యశసే అర్థకృతే'కు ఉదాహరణముగా భాసుడు శూద్రకునివలనను, బాణుడు శ్రీహర్షుని వలనను ధనము గడించినట్లు ఆలంకారికులు వ్రాసినారుగదా

పైగా ఈ మృచ్ఛకటికము యొక్క కాలనిర్ణయము చేయుట అవశ్యకము. చారుదత్తము తర్వాతిదిగా తోచుచున్నది ఒకటి కథ పూర్తిగాలేదు. రెండవది సూత్రధారుడు ప్రాకృతభాషి సూత్రధారుడు పండితుడుగదా ప్రాకృతములోనా మాటలాడుట. నాకు చూడమృచ్ఛకటికము, అసలు మూలమునకు కొంత చేర్చబడి ఏడెనిమిది శతాబ్దములకు అడబడిన రంగప్రతిగానుండును కవి ప్రాచీనుడు. ఇది ప్రథమ ప్రయోగముకాదు కర్ణాటక కలహమను కృత్రిమ కలహము కనబడుచున్నది. (మనము నేడు కుంభకోణమన్నట్లు మోసమునకు) చారిత్రికముగా ఈ శతాబ్దము రాష్ట్రకూటరాజుల కాలమునుండి క్రీ. శ. 755-800 తర్వాత నుండియే కనబడుచున్నవి. తత్పూర్వము లేదు.

అట్లే భాసనాటకములును సందేహింపదగినవే. అవి దక్షిణదేశములో దొరకుట, వానిలో భాసునిపేరు లేకపోవుట, కొన్నిట పల్లవ రాజసింహుని పేరుండుట-వీనివలన నివి భాసనాటకముల యొక్క రంగప్రతులుగా భావింపబడినవి. ఈ శూద్రకుని కథను కాళిదాసునకు పూర్వులైన రామిలసోమిలులు వ్రాసిరట (తౌ శూద్రక కథాకారా—రామిలసోమిలౌ) కాళిదాసే మాళవికాగ్నిమిత్రములో భాససౌమిల్ల కవిపుత్రులు తనకు ముందు నాటకములు వ్రాసినారని యన్నాడు. అందులోను ప్రసిద్ధులట.

మృచ్ఛకటి ప్రాచీనమనుటకు మఱియొక గుర్తు. ఇందులో శాకుంతలములో వలె యవనిలేదు. ఉదయనునిని యవనిలేదు. భాసునిలోను కానరాదు. (యవని శస్త్రధారిణి)

అమరకోశములో నాటకము అంకము ఇత్యాదులు లేనందువలన నాట్య పరిభాషయే చెప్పబడినందువలన తొలుతటి ప్రదర్శనములు దశరూపకములలో చేరిన నాటకములు కావనియు నృత్యవిశేషములనియు, క్రమముగా నాట్యముల నుండి నాటకములుగా పరిణమించినవనియు తోచుచున్నవి. నాంది, నటీసూత్రధారులు, పారిపార్శ్వకులు లేకపోయిన ఒక్కొక్కప్పుడు విదూషకుడో నాటకమును ప్రారంభించువారు ఉండియుందురు. చివరి పరిణామము

"సూత్రధార కృతారంభైః
నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే
భాసో దేవకులైరివ"

ఈవిధముగా సంస్కృతనాటకము మొదట నాట్యముగా నుండి క్రమముగా పాత్ర సంభాషణములతోడి నాటకమైనది. అమరసింహుని కాలములో నాట్యమే. అమరుడు నాట్యపరిభాష యెరుగునేగాని నాటకపరిభాష యెరుగడు. లేదా చెప్పలేదు. ప్రాచుర్యములేదో, విద్యార్థుల కక్కరలేదో, ఏదో కారణమువడవలెను. తర్వాత చక్కగా సంస్కృతము దేశమందు వ్యాపించిన వెనుక నాటకములు బయలు దేరినవి. వట్టి ప్రాకృతనాటకములు ప్రాచీనములు లేవు. సూత్రధారుడు సర్వత్ర సంస్కృతభాషి. చక్కని పండితుడు. సకల కళాప్రపూర్ణుడు. వేశ్యలును విదుషీమణులు, ఇతరులలోనే భాషాభేదము కనబడుచున్నది. విదూషకుడు బ్రాహ్మణుడేయైనను ప్రాకృతభాషి. ఇట్లే భాషాభేదములు భరతనాట్య శాస్త్రములో చాలగలవు.

అసలు ఈ నాట్యశాస్త్ర గ్రంథము చాల తర్వాతిది. పరమశివుడు ప్రసాదించినాడట. వ్యాకరణముకూడ ఆయనదే. బృహత్కథకూడ. ఇంతెందులకు కథావాఙ్మయమంతయు ఆయన చెప్పినదే. ఈ కలియుగములో ఎవరు నమ్మనుఁ ఎంతో పరిణామమైన తర్వాతనే ఈ గ్రంథము రచితము. నాట్యమండపములు ఆదినుండియు నుండినవా? ఉండియుండవు. నాటకములు పండితులు పామరులు. అందరు చూడదగినవిగాన ఆరుబయలే నాటకరంగములు. వెనుక వేషము వేసికొనుటకు తగిన యిల్లో, గుడియో, కొండగుహయో చూచుకొని దానిని తాత్కాలికముగా నొక తెరనుకట్టి నేపథ్యమును నిర్మించుకొని ఆ తెరను తీయక నాట్యమో నాటకమో ముగియువరకు అట్లే ఉంచి; దానిముందు నాట్యవస్తువును ప్రయోగించుచుండిరి. నాందిని ఈ తెరలోపలనే చేసెడివారు.

నాంది ముగియగానే సూత్రధారుడు ప్రవేశించి నాటకమును ప్రారంభించెడివాడు. 'నాంద్యంతే సూత్రధారః ప్రవిశ్య' లోపల ఒక సూత్రధారుడు నాందిని ప్రయోగింపగా స్థాపకుడును మరియొక సూత్రధారుడువచ్చి నాటకమును ప్రయోగించెడివాడని కొందరి యభిప్రాయము.

కాని తెరలనుగురించి ఏమియులేదు. నేటి తెరలవంటివి కానరావు. సాధ్యము కాదేమో. రంగముమీద బండ్లు రథములు పోవుట లేళ్ళు పరుగెత్తుట; ఆకాశయానాదులు ఇత్యాదులకు తగినంత స్థలము కావలెను. రంగమంతయు క్రమ్ము తెరలో ఇవి అగునా? లేక అంతదూరము వారు పోయినట్లు మనము భావింపవలెనా? పరిక్రమణమని యొక యభినయము ఇందుకే ఏర్పడినదా?

తెరలనుగురించి పరిశ్రమచేసి తాతగారి శిష్యులు శ్రీమాన్ నేలటూరు రామదాసయ్యంగారు తాతగారి యభిప్రాయమును చక్కగా నొక ఆంగ్ల వ్యాసమున అన్నల్స్ ఆఫ్ ది భండార్కర్ ఓరియెంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారి పత్రికలో 1974 సం॥ విశదీకరించినారు. దాని సారాంశమిది— భరత నాట్యశాస్త్రమున ద్వితీయ పరిచ్ఛేదము రంగమునుగూర్చి తెల్పును అందులో తెర ప్రస్తావము లేదు. కాని ఐదవ రంగప్రకరణములో పూర్వరంగమును గురించి చెప్పునప్పుడు యవనికను చెప్పినాడు. (V. 11)

"ఏతానితు బహిర్గీతా న్యంతర్యవనికాగతైః
ప్రయోక్తృభిః ప్రయోజ్యాని తంత్రీభాండకృతాని చ
తతః సర్వైస్తుకుతపైః సంయుక్తానీహకారయేత్
విఘాత్యవై యవనికాం నృత్తపాఠ్యకృతానితు."

దీనిమీద వ్యాఖ్యానించుచు అభినవగుప్తుడు, యవనిక రంగపీఠ రంగశీరములనడుమ నుండునదని వ్రాసినాడు. పూర్వరంగముయొక్క కొన్ని యంగములు దీనికి వెనుక చేయవలసినవియు, కొన్ని దీనిని త్రోసికొనిపోయి రంగమున చేయవలసినవనియు తెలిపినాడు. ఆ శ్రావణ నాందీకార్యములు సూత్రధారుని చేత ఈ తెరలోపల చేయబడవలసినవట. తర్వాత స్థాపకుడు ప్రవేశించి నాటకమును ప్రస్తావించి నిష్క్రమించును. స్పష్టముగా తెరనుగూర్చి ఎట్టిసూత్రము గాని భరతుడు చెప్పలేదు. ఊహకు వదలినాడు. లెక్కలేని పాత్రలు వచ్చుచు పోవుచున్నవి. ప్రవేశ నిష్క్రమణములున్నవిగదా. ఈ సందర్భములలో ఏపాత్ర ఎవరో ముందుగా సూచింపవలయునట. కొన్ని గొప్ప పాత్రలకు ప్రావేశిక

ఆక్షిప్తికలు పాడుటయున్నది. రంగశీర్ష రంగపీఠములనడుమ తెరయొక్క అవశ్యకతను చెప్పుచు అభినవగుప్తుడు పాత్రముల రాకపోకలకు చాటుండవలె నన్నాడు. "తత్పాత్రాణాం విశ్రాంత్యై అగచ్ఛతాంచగుప్త్యై, రంగస్యశోభాయై రంగశిరః కార్యతామ్" అన్నాడు. ఈ 'శోభ' కేమర్థమో. కాబట్టి ఏదో ఉండి తీరవలెనుగదా.

హరివంశమునుండి ఈ యుద్ధారము పెక్కు యవనికలను చెప్పుచున్నది. " .. ప్రేక్షాగారాణి.... రేజుర్యవనికాక్షేపైః సమక్షా ఇవ ఖేచరాః॥ అట్లే ఆర్యాసప్తశతి (538)

పీఠాపసరః ప్రథమం తదను చరసభావపుష్టచేష్టేయం
జవనీ వినిర్గమాదనునటీవదయితా మనోహరతి"॥

రజనీవర్ణనము సుభాషిత రత్నభాండాగారమున-4

"శశాంకేసన్నద్ధే భరత ఇవ సంధ్యాజవనికా
తిరోభూత్వా పుష్పాంజలిమివ వికీర్యోడుని కరం
కలం గాయన్తీభిః కుముదవన భృంగీభిరథునా
నభో రంగం ప్రాప్తా విహరతినిశాలాసిక వధూః"

కాబట్టి పెద్ద చివరితెరగాక, ముందు పెక్కుతెరలు ఏకకాలమున నుండినట్లు స్పష్టము. వీనిని ఎత్తుటయా, దించుటయా, పట్టుటయా, లేక పైన కట్టియుంచి లాగుటయా, చెరిసగముగా రెండు పక్కలకు లాగుటయా యను ప్రశ్నలకు సమాధానము తెలుగు కావ్యములలోనుండి ఉదహరించిన పద్యములనుండి స్పష్టము. ఒక్కొక్క పాత్రము కనబడుటకు ముందు కొందరు స్త్రీలు తెరపట్టుచురాగా. ఆయా పాత్రలు ప్రవేశించి నటించుచుండినవి. ఎఱ్ఱాప్రెగ్గడ చెప్పిన 'తోపు పెందెర' రంగశీర్ష రంగపీఠముల నడిమిదిగా గ్రహింపదగును. ఏసుచరిత్రలోనిది పాత్ర ప్రవేశమునకు ముందుది, పైగా ఆ తోపుతెరను కదలింపకయే తీయబడినది. ఇది రంగమంతటిని మూయదు. ప్రవేశించు పాత్రకు మాత్రమే మరుగు.

కొన్ని పాత్రలు అపటీక్షేపమున ప్రవేశించును. దీనికి తెరను త్రోసికొని వచ్చుటయని కొందరు వ్యాఖ్యానించిరి. ఏ తెరనూ నేపథ్యపు తెరనుకాదే. మరి దానిని వదలిన ఏ తెరనూ తెర లేదే. కాబట్టి అ + పటీక్షేపము (పటీ = తెర, క్షేపము = వేయుట) అ-తెరను వేయకయే పాత్ర ప్రవేశించుట సంభ్రాంత ప్రవేశక సూచకము. ఇది తాతగారి యభిప్రాయము. ఇది నాట్యములో సర్వసామాన్యము ఇది మన వీధినాటకములలో నున్నది. భామకలాపములో విశదము.

ఈ పాత్ర ప్రవేశక నిష్క్రమణ యవనికలకు నాటకములలో సూచనలు కానరావు. అవి సూత్రధారులకు పరంపరగా తెలిసియేయుండునుకాబోలు. 'నాట్యేన' యని సూచనలు కలవు వీనిని ప్రదర్శించుట నటులకు నేర్పుట కవి పనిగాదు. సూత్రధారుల పని. వారెరుగుదురు. వాల్మీకి రచనను ప్రయోగించుటకు అతడు భరతమహర్షికి పంపినాడని గదా భవభూతి యుత్తరరామ చరిత్రములో కలదు, భారతదేశమందంతటను ఈ సంప్రదాయము ఉండియుండును. తెలుగు కవుల ప్రబంధవర్ణనలలో కొన్ని వచ్చినవి

మఱి రంగమున పార్శ్వములలో అద్దములు, లేదా మరుగుగా సైడ్‌వింగ్స్ ఉండినవా, నేపథ్యమునుండి పాత్రలెట్లు ప్రవేశించును అని సందేహముకలుగుట సహజము. మా తాతగారి 'భారతాభారత రూపకమర్యాదలు' అను వ్యాసమున ఇట్లు వ్రాసియున్నారు. (పుట 7-8) 'అరువదినాలుగు కరముల నిడుపులో వెనుకటి యెనిమిదికరములు నేపథ్యగృహము. దాని ముందరి యెనిమిదికరములు రంగశీర్షముగా నుండవలయునని విస్తరము. రంగశీర్షమున ఆరుదారువు లుండవలయును. రంగపీఠము అద్దమువలె చదునుగానుండవలయును. నేపథ్యమునకు రంగములోనికి రెండుద్వారములుండవలయును."

ఇప్పుడు ఒకటి తెలియుచున్నది. ఈ రెండు ద్వారముల నుండియేగదా నటులు ప్రవేశింపవలయును. కాబట్టి ఒక్కొక్క పాత్ర ప్రవేశమునకును పటీక్షేపముండవలయును. అది లేకపోయిన అపటీక్షేపము. అరుబయలు నాటకములోను ఇట్లే చదును నేలమీద జరుగవలెను.

ముందు తెర, పెద్దది, లేదనుటకు ప్రబలనిదర్శనము అంకాంతమందు సర్వపాత్ర నిష్క్రమణ నియమము. ఒక యంకము ఐపోయినదని తెలుపుటకు నేడు ముందరి తెరవేయుదురు. అట్టిది ఆకాలమున లేదు కాబట్టి అంకము ముగియగానే రంగస్థలము కొంతసేపు ఖాళీగానుండవలెను. జపాను చైనావారి ప్రాచీన రంగమర్యాదకూడ ఇట్లే. ఒక యంకము ముగియగానే అన్నిపాత్రలును పోగా రంగము కొంతసేపు నటులు లేకయుండును.

ఈ విధముగా నాటకమునాడి చివర నాటకము మంగళాంతముగా ముగియవలెనుగాన నటుడు, వట్టి నటుడై లోకమునకు మేలుకలుగునుగాక యని భరత వాక్యమును పలుకును. ఆధునిక రంగప్రదర్శన విధానము పార్సీనాటకములవలన మనకు వచ్చువరకు ప్రాచీనసంప్రదాయమిట్లే యుండెను. □



# ప్రార్థన

శ్రీ వర్మాపేట ఒత్పల

దేవుడా!

నిర్దయతో నన్ను పంచభూతాలకి బానిసగా అమ్మేశావు. పంచభూతాలూ నన్ను పంచేంద్రియాల్తో కట్టేశావు! అతివృష్టి, అనావృష్టి యిత్యాది వాటికీ గల రాగద్వేషాలే నాలో వృద్ధి - నన్ను వాటిష్టమొచ్చినట్టు అవి ఆడిస్తున్నాయి. అందుకే పంచభూతాలని నేను ఓడించ లేక పోతున్నాను.

పంచభూతాల్ని జయిస్తే-జరామరణాల్ని అధిగమించిన అమరుణ్ణేకదా!

అట్లా అవటం యిష్టంలేకనే-పంచభూతాలకినన్ను అమ్మి వేశావు! నీప్రాంగణంనించి నన్ను నిర్దయగా నెట్టివేశావు!

అదిపోనీ!

దేవుడా!

నేనేం చెయ్యాలని నిర్దేశించి నన్నిక్కడికి పంపేవో అదిచెప్పు! నీ ఆదేశం పాటించి, నెరవేర్చివచ్చేస్తాను! దుష్టకష్టనికృష్టాత్మకమైన ఈ భూమ్మీద నేను మనలేక పోతున్నాను! భగవాన్!

నానించి ఏం జరగాలని ఆశిస్తున్నావో నాతో ఏం చేయించాలని కోరుతున్నావో చెప్పు ప్రభూ! నీ ఆదేశం నెరవేర్చి నీ పాదాల చెంత గడ్డి పువ్వుగా వొచ్చి వాల్తాను!

దేవుడా! నాకు తెలుసు: ఈ ప్రకృతిలో అందాలూ - హరివిల్లులో రంగులూ, మేఘగర్జలూ, మెరుపులూ, వురికేజలపాతాలూ,బడబానలాలూ అన్నీ నీ చిద్విలాస్యాలేనని!

ప్రతిరోజూ ప్రాభాతాన మౌనంగా తట్టిలేపే సూర్యకిరణ కాంతిలో, వన్నెల హొయలుపోయే వసంత ఋతురాజ్ఞి చిరునవ్వుల్లో, సుమాల సువాసన నిట్టూర్పుల్లో, సేదతీర్చే పిల్లతెమ్మెరల పలకరింపుల్లో నీ నిరంతర సంకేత సంభాషణలే ఆలకిస్తున్నాను; అవి నాహృదయ భాషలోకి అనువదించి అర్థం చేసుకోవాలని పలవిస్తున్నాను! మృత్యువుకి వుపోద్ఘాతంలాటి ఈ జీవితం - సజీవమైన స్వప్నంలాటి ఈ బ్రతుకు నీ మౌన సాంకేతిక సైగల్ని అర్థం చేసుకుందికే నియోగిస్తున్నాను.

ప్రభూ! తాడుమీద గాలిలో పడిపోకుండా నడుస్తున్న ఈ జీవికలో కలలో కయినా ఒక్కసారి వొచ్చి - నీ ధ్యేయం ఇక మధుర గేయంగా వినిపించిపోరాదా? నా తిమిరనేత్రాలు తాకి నాలో డోల పరిహరింపరారాదా?

## ప్రార్థన

దేవుడా! ఎన్నో పేర్లూ, రూపాలూ వున్న దయామూర్తీ!

సూర్యుడి వెచ్చటి కిరణాలహస్తాల్తో, వర్షపు హర్షపు చినుకుల్లో, పిల్లతెమ్మెరల పరిమళాల నిట్టూర్పుల్లో నీ నిరంతర దయామృత సందేశమూ, ప్రేమానురాగాల సంకేతమూ వింటూ కంటున్నాను.

కాని- నీ దయార్ద్ర హృదయనిశ్శబ్ద మధుర సంగీత హేల నా భాషలోకి అనువధించుకుని అర్థం చేసుకోలేక, పోతున్నాను. అందుకే ఈ జన్మ నైవేద్యంగా అర్పించి అర్పించి తెలుసుకుందామని ఆర్తితో వున్నాను.

దేవుడా! నాజాతిజనులకన్నుల్లో నీ హంశలైన ఆర్ద్రతా, మానవతా సమతా మమతలూ,సహృదయక్షమా గుణమూ,సమస్త చైతన్య తేజములోనూ నీకాంతి పుంజమూకని తరించేభాగ్యం, ప్రసాదించు తండ్రీ!

మాయలూ, మంత్రాలూ, చిట్కాలూ, ఛీత్కారాలకి దూరంగా నా జాతిని నాలుగు కాలాల పాటు మననీ తండ్రీ!

ప్రజాసేవ గురించి అభినయాత్మకంగా ఓండ్రపెట్టే గోమాయువుల నించీ,

వేదికలపై రంకెలువేసేకులాల ఆబోతుల్ని అమాయకంగా కామధేనువులని భ్రమసే నా సహజన్ముల్ని కాపాడు తండ్రీ!

దోమలూ, నల్లుల బాధ కన్నా ఈనాడు దేశసేవకుల దుర్మార్గమూ, విజృంభణా అధికమైనవి నాయనా!

మాచెవుల్లో మొలిచిన స్వార్థాల చిల్లకంప తొలగించి-చైతన్య జ్యోతి వెలిగించు ప్రభూ!

నీవు వినా మాకు దిక్కెవ్వరు?

నీ సృష్టిని నీవే వికృతం చేసుకోడం వేడుకా - వాడుకా నీకు ప్రభూ?






# ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం
## నవ వనితా సచిత్ర పక్షపత్రిక

★ అభ్యుదయానికి మనోవికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు, చర్చలు.
★ కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు.
★ బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీర్చైన బొమ్మలు.
★ ఒక పూర్తి నవల + 2 సీరియల్స్.
★ పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు; వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, రాశిఫలం కూడా ... బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన హరివిల్లు!
★ ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల : 2-50

వివరాలకు :

'కలువబాల', కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3.

విడిప్రతి వెల : రు. 2.50

### చందా వివరాలు

| | ఏజెంట్ ద్వారా | | పోస్ట్ ద్వారా |
|---|---|---|---|
| 3 నెలలకు | రు. 15-00 | - | 15-90 |
| 6 నెలలకు | రు. 30-00 | - | 31-80 |
| సంవత్సర చందా | రు. 50-00 | - | 50-00 |

సంవత్సర చందా ఒకేసారి ఆఫీసుకు చెల్లించండి.



శ్రీ వాసు

# సంప్రదాయ సంసిద్ధులు

సంప్రదాయ సంసిద్ధులు అంటే సంప్రదాయంపై అధికారమున్నవారూ, నిపుణులూ: వారెవరు? ఎక్కడున్నారు? వారి లక్షణమేమిటి అనే ప్రశ్నలకు ఏటు వంటి సమాధానం అనేది దొరకదు.

సంగీతంలో సంప్రదాయం అనేది కనిపించేదికాదు. 'ఇదీ' అని స్పష్టంగా అనుకోలేనిది.

అయితే ఒక గొప్ప కళాకారుడి గానాన్ని విన్నప్పుడు సంప్రదాయం అంటే ఏమిటో, దానికి ఇయ్యవలసిన గౌరవం ఏమిటో అర్థం అవుతుంది అది ఒక అనిర్వచనీయమైన అనుభూతిని ఇస్తుంది దానినే మన పూర్వులు 'ఆనందం' అన్నారు. అట్టికళాకారుడే "సౌక్యమేయు తీరుడు" [త్యాగరాజు]. అప్పుడే "నాద విద్యా మర్మములు" [త్యాగరాజు] మనకు అవగతమయేది. నాద విద్యతో లీనమైపోయే అట్టి మహాగాయకులు నిరంతరం నాదోపాసకులుగా సంప్రదాయ సంసిద్ధులవుతారు.

అయితే దేవగాంధారి రాగంలో ధైవతాన్ని ఉపయోగించడంలో గల "మర్మము" తెలుసుకోవడానికి టెలిఫోన్ డైరక్టరీలో వారి పేర్లు దొరకవు. ఒక రాగంలో గనుక స్వరం కానిదాని స్థానంలో గనుక స్వరాన్ని ఉపయోగిస్తే తేడా ఏమిటి వస్తుందని అడిగినా సమాధానంరాదు,

తంబూరా ఉన్నది. కాని గాంధారానికి ప్రత్యేకం ఒక తంత్రి ఉండాలేదు. అయినా తంబూరాను చక్కగా మేళవించి వాయిస్తుంటే గాలిలోకి వచ్చే శబ్ద తరంగాలలో గాంధారం కూడా వినబడుతుంది. సంప్రదాయం అనేది అందుకే అనిర్వచనీయంగాఉంటూ గానాలాపనలోనే ప్రతిఫలించ వలసినదవుతున్నది.

కొన్నినియమాలకు, పద్ధతులకూ కట్టుబడకుండా "చక్కని రాజమార్గము" లో నడవడముంటే ఏ కళాకారుడూ తన శ్రోతలకు హృదయాహ్లాదాన్ని సంగీత సుఖానుభూతిని కలిగించలేడు. అవి పాటించినప్పుడు మాత్రమే తన శ్రోతలకు పిపాసువులుగామార్చి "గాన సుధారసపానము"ను చేయించగలడు.

ఒక సంగీత ప్రియుడైన రసికుడు ఎందరో కళాకారుల గానమాధురిలో మునకలువేస్తాడు, ఎవరో ఒక గాన కళా కోవిదుని సంగీతామృతాన్ని సేవించి యింటికి పోతూ దారిలోకూడా దానినే స్మరిస్తుంటాడు. ఆరోజు నడుంవాల్చి నిద్రాదేవి ఒడిలోనికి వెళ్ళేముందు కూడా ఒక అసాధారణమైన సంతృప్తి హృద యాన్ని తేలిక చేస్తుంది.

మోహన, కాంభోజి, బిలహరి రాగాలు చాలామంది పాడేవే. కాని మహా రాజపురం గొంతులో వెలువరించిన 'మోహన' కూ, జి. యస్. టి. కంఠంలో పులకరించిన కాంభోజి కూ, అరియకుడి గళం నుండి ప్రవహించిన బిలహరిరాగానికి ఎందుకు రసికులు అంతగా పిచ్చెక్కి వినాలనుకుంటారు? అదే సంప్రదాయంలో ఉన్న రహస్యం.

టెన్నిస్ క్రీడాకారుడు బంతిమీదే తన లక్ష్యంవుంచి సరియైన స్ట్రోక్ లు ఇవ్వడంలోనే ఆటనైపుణ్యతఉంటుంది దేనిలోనైనా ఉత్తమ స్థాయి ప్రదర్శించడానికి సంప్రదాయానికి పూర్తిగా కట్టుబడి ఉండాలి.

నియమ విధేయమైన సంప్రదాయానుసరణం ఉత్తమగుణం, ఒక నియమం ఎందుకు ఏర్పడిందో మనకు తెలియకపోవచ్చు, కాని ప్రమాద భయంతో కపం దానిని ఎవరూ ఉల్లంఘించడానికి వీలులేదు. నీ ముందున్న కంచెను తొలగించే ముందు దానిని అక్కడ ఎందుకు ఉంచారో తెలుసుకోమని జాన్ కెన్నెడి అన్నారు. కొంత చరిత్ర రూపుదాల్చడానికి శతాబ్దాలు పడగాలి. అని డాక్టర్ రాధాకృష్ణ అన్నారు. కాని దురదృష్టవశాత్తు సంప్రదాయం అనేది అనాదరణీయం అయింది. ఒక విగ్రహాన్ని ధ్వంసం చేయడం సులభమే. అట్టి విగ్రహాన్ని సుస్థాపితం చేయడం కష్టం.

ఇప్పుడు దేశంలో సుప్రతిష్ఠితుడైన ఒక గాయకుడు ఒకప్పుడు ప్రతి మధ్యమ స్వరం వేసి మధ్యమావతిరాగాన్ని ఆలాపించాడు. ఎవరను ఎవరో అదేమిటని అడిగారు. దీన్ని ప్రతిమధ్యమావతి అంటారని తడుముకోకుండా అతడు సమాధానం ఇచ్చాడు. అయితే త్యాగరాజ కృతిని ఇంతకు ముందు ఎవరూ ఆ విధంగా పాడలేదు. సంప్రదాయ సంసిద్ధులెవరైనా దీనిని హర్షిస్తారని ఎలా అనుకోగలము, సంప్రదాయాన్ని, అనూచాన మార్గాన్ని ఉల్లంఘించడం, గురు ధిక్కారం నేడు కొందరి పద్ధతులవుతున్నాయి. కళామాత మనసు సన్మార్గంలో నడిపించాలి.

కొన్ని దశాబ్దాలుగా సంప్రదాయజ్ఞులు ఎలా పాడుతున్నారో ఎలా గాయకుడు పాడలేడని రసజ్ఞులు ఆశిస్తారో, కళాకారుడు ఆ విధంగానే ఆ కృతిని పాడాలి. అది సాంప్రదాయం అనిపించుకుంటుంది. ఎవరి ఇష్టం వచ్చిన బాణీలో వారు నగుమోము గనలేని అనో ఎందరో మహానుభావులు అనో కీర్తనలను పాడుతుంటే సంప్రదాయ విచ్ఛిత్తి అవుతుంది. ఇంతకంటే సంగీత కళకు చేయగల ఘోర అప చారం వేరేలేదు. అలా పాడేవారు ఎంతధనాన్ని ఆర్జించినా మహాకళావేత్తలతో వారికి స్థానం లభించదు, ఈ తరం మన్నించినా రాబోయే తరాలు ఇట్టి వారిని గౌరవించవు.

ఇప్పుడు కర్నాటక సంగీత కచేరి సంగతి ఆలోచిద్దాము కొన్ని దశాబ్దాలు పరిణత సాధనతో అనుభవంతో ఎందరో మహా విద్వాంసులు కర్నాటక సంగీత కచేరి ఒక పద్ధతిని సంతరించి పెట్టారు. ఈ రాగం ఈ మేళకర్తకు చెందినదా కాదా అనో ఈ రాగంలో ఈ స్వరం ఉపయోగించవచ్చునా లేదా అనో శాస్త్రీయ విజ్ఞానాన్ని, చర్చలనూ అలాఉంచి సంగీత రసపిపాసువుల రసజ్ఞతకూ, స్థాయికి తగు విధంగా కచేరి ఉన్నదా అనేదే గీటురాయి. సంగీతం జనరంజకం అనే సూక్తి ఆదర్శ సూత్రంగా ఉండాలి ఇందుకోసమే సంప్రదాయికంగా శ్రోతలను సంగీత రసోన్ముఖులను చేయడానికి ఒక బిగువు. అందం, జిలుగులతో ఉన్న వర్ణాన్ని పాడటంతో కచేరిని ఆరంభించడం ఏర్పడింది.

శ్రోతలలో ఇట్టి ఉన్ముఖత్వాన్ని సాధించడానికి ఇదే స్వభావంకల దేనినైనా పాడవచ్చును. జి యస్. టి. కోకిల్ల సప్తస్వరలోనూ, మహారాజపురం దర్బార్ లోనూ ప్రారంభించేవారు వీటి వెనుకనే రాగాలాపన లేకుండా ఒకటిరెండు కీర్తనలను పాడటం సంప్రదాయం. కొద్దిగా ఆలాపన చేయడం కూడా ఉన్నది. అయితే ఈ తగు మాత్రంగానూ, మధురంగానూ, రసజ్ఞులకు పరిచితంగానూ ఉండాలి. అప్పుడే వారు రసానుభవంలోకి రాగలరు. గంభీర నాట తో ప్రారంభించినా, చలం నాటతో ప్రారంభించినా కచేరీలో మొదటి అంశమే చిక్కుప్రశ్న కాకూడదు. దానిని గుర్తించినప్పటికే అది పూర్తి అయిపోయినందువల్ల శ్రోతలలో అసంతృప్తి మాత్రమే మిగులుతుంది. సాధారణంగా శ్రోతలలో చాలామంది సామాన్యులనేది ఎప్పుడూ గుర్తుపెట్టుకోవాలి గాయకుడు తనతోబాటే శ్రోతలను ఒక్కొక్క మెట్టు

పైకి తీసుకుపోతూనే వారు హర్షించగలుగుతున్నారా లేదా అనేది దృష్టిలో ఉంచు కోవాలి. అరియకుడి సంగీత అకాడమీలోనో, మైలాపూర్ సంగీత సభలోనో అయితే ఒక విధంగా కచ్చేరిచేసి ఏ పాత మిత్రుడి మొగమాటం వల్లనో దూర ప్రాంతంలో వినాయకుని గుడిముందు పాడవలసి వచ్చినప్పుడు ఇంకొక పద్ధతిని అనుసరించేవాడు. ఆయన తన శ్రోతల సంగీత రసజ్ఞత ఏ స్థాయిలో ఉందోవెంటనే తెలుసుకునేవాడు. అందుకే ఆయన చేసిన వేలాది కచేరీలన్నీ విజయవంతంగా సాగినవే. సామాన్యుడూ రసజ్ఞుడూ విమర్శకుడూగా అంతా మెచ్చుకొన్నవే.

తరువాతపాడే రెండు మూడు కీర్తనలూ పూర్తి రాగాలాపనతోనే సాగాలి ఒకటి రెండు కీర్తనలకు స్వర ప్రస్తావం కూడా చేయాలి. నిక్షిప్తమైన సౌందర్యం అంతా అందించడానికి నెరవలు సాగించాలి. ఒక అంశాన్ని మరొక అంశం ఆయో మయం చేసే విధంగా కచ్చేరి ఉండ కూడదు. అదే రహస్యం. ఏ కృతికైనా రాగాలాపన గాని, నెరవలుగాని, స్వరప్రస్తావంగాని మితంగా ఉండాలి. అది బరువై శ్రోతలను విసిగించరాదు, రాగం, తానం, పల్లవి, కచ్చేరిలో ఉండి తీరాలి. గాయకుడు తనను అనుసరిస్తున్న మృదంగ విద్వాంసుని సామర్థ్యాన్ని, బట్టి ఏదో ఒక తాళాన్ని గతి భేదంలో చేపట్టాలి. గాయకుడు తన రథాన్ని పరుగెత్తించా లంటే గుఱ్ఱాల శక్తియుక్తులను దృష్టిలో ఉంచుకోవాలి. వాటికి అతీతంగా భారం లేకుండా అవి అతీత శక్తిలో రౌతును పడదోసినా జరిగేది ఒకటే రసాభావం.

రాగమాలికతో పల్లవిని ముగించాలి. ఈ దశలో స్వర్గీయ మధురై మణి అయ్యరు ప్రదర్శించే అద్భుతమైనబాణీ తరువాత కళాకారులంతా అనుసరించ దగిన విధంగా ప్రామాణిక స్థాయిలో ఉండేది.

తరువాత కొన్ని దేశీయమైనవీ, ప్రాంతీయమైనవీ పాటలు పాడవచ్చును. అవి ప్రాంతీయ భాషలోనివీ పురాతనమైనవీ కూడా గావచ్చును గాయకుడు ప్రత్యే కతను సంతరించుకున్న కొన్నిపాటలు ఉండాలి. లేకపోతే మంగళానికి ముందో తరువాతో శ్రోతలనుంచి చీటీలు రావటం ప్రారంభిస్తాయి. కచ్చేరి ముగించేలోగా ఒక జావళి, ఒక తిల్లానా, రాగమాలికలో ఒక శ్లోకం ఎప్పుడూ ఉండవలసినదే

నేనేదో కఠినమైన సూత్రాలను బిగిస్తున్నానని పాఠకులు అపార్థం చేసు కోకూడదు. శ్రోతల సంపూర్ణతృప్తికి, కచేరీ విజయవంతం కావడానికి అత్యవసర మైన సంప్రదాయ పద్ధతిని ఆలోచనా ప్రేరకంగా పాఠకుల ముందుంచడమే నా ఉద్దేశం.

ఒక విద్వాంసునికి సమయానికి సంప్రదాయం అనేది ఏ విధంగా ఉప కరించిందో ఆ వాస్తవిక సంఘటనలో దీనిని ముగిస్తాను. కొన్ని దశాబ్దాలు కిందట ఒక రాత్రి ఆలస్యంగా ఇంటికి చేరుతున్న మహారాజపురం ఒక పెళ్ళివారింట్లో నుంచి శ్రావ్యమైన సంగీతాన్ని వినడం తటస్థించింది. అటువైపు మళ్ళి ముందుకు సాగుతూనే ఆగొంతును గుర్తుపట్టి లోపలకు వెళ్ళారు. ఆ గాయనీ మణితో సహ అక్కడున్న పెద్దలు ఆయనకు నమస్కరించి ముందు వరుసలో కూచో పెట్టారు. అప్పటికి బాలిక మాత్రమే గాని కీర్తి ప్రతిష్టలార్జించినది. ఇప్పుడు ప్రపంచ ఖ్యాతి నార్జించినది తాను గత అయిదు గంటలుగా పాడుతూనే ఉన్నానని, అది పాడమనీ ఇది పాడమనీ ఎవరో ఒకరు ఎదో ఒకటి అడుగుతూండడం చేతగాని లేకపోతే అంతకు ముందే కచ్చేరీ ముగించేదాన్నని మెల్లగా కుమారి ఇప్పుడు శ్రీమతి ఎం. ఎస్. సుబ్బలక్ష్మి మహరాజపురంతో చెప్పినది. ఇంతలోనే కన్యా దాత వచ్చి మహరాజపురంగారికి నమస్కరించి ఆయనకు ఇష్టమైన పాట ఏదో

పేర్కొని గాయని మణిచేత పాడించవలసిందిగా కోరారు. మహరాజపురం ఒక్క క్షణం ఆగి తనకిష్టమైన. పాటనుచెప్పి పాడించాక ఎవరూ కోపగించుకోవద్దని అన్నారు. అందుకు కన్యాదాత కూడా అంగీకరించాక ఆయన తనకు ఇష్టమైన కృతి ఏదో చెప్పారు. పెళ్ళి పెద్ద గాయనీమణితో మహరాజపురం ఈ ప్రాంతాలలో మహానుభావుడు. ఆయన కోరిన పవమానసుతుడు పట్టు మీరు పాడాలి. అన్నాడు ఆమె వెంటనే ఉత్సాహంతో పాడింది. పాట పూర్తికావడంలో కచ్చేరి ముగిసిన దని అంతాలేచారు. అర్థరాత్రి కాకుండానే కచ్చేరి పూర్తిచేయించినందుకు మగపెళ్ళి వారు గొడవ పెట్టడం ఆరంభించారు. వాగ్వాదాలు పెరుగుతున్నాయి సంప్రదాయం ప్రకారం మంగళం పాడిన తర్వాత ఇంకేమి పాడరాదని మహారాజపురం అందరి కి నచ్చచెప్పారు. ఎవరైనా పాడక తప్పదని నిర్బంధిస్తే పెళ్ళియింట్లో అమంగళం జరుగుతుందని కూడా ఆయన అన్నారు.

కనుక మనం సంప్రదాయాన్ని పాటించాలి. అన్ని రకాల వారినుండి ఇందుకు తోడ్పాటు లభించాలని కోరదాము...

## భ్రమల్లో మనిషి

దేవుడేదో చేస్తాడని
తన పనితాను మానేస్తాడు
మాట్లాడితే నేనంటాడు
నాదంటాడు
మహాత్ముల్ని నిందిస్తాడు
ఓడి పోతూ
గెలిచాననుకుంటాడు
మనసులో సూర్యోదయమయే దాకా
మనిషిలో నవాలక్ష భ్రమలు

## కవనం-కదనం

కదనానికైనా
కవనానికైనా
ఎంత పదునుకావాలి ? ఎంత మనసు మండాలి??
నోళ్ళెత్తి పిలుస్తున్న
అభాగ్యులు .... అనాథలు
వాళ్ళే నా కవనం
వాళ్ళ కోసం నా కదనం

శ్రీ అడవాల వి. వి. సత్యనారాయణ

## కవిత్వం

భాషలో
స్థంభించి పోయిన
ఒక
అను కంపన –
భావనలో
అభివ్యక్తిలో
ప్రదర్శితమైన
ఒక
హృదయ పరిచ్ఛేదన –

– కొప్పర్తి

— సీరియల్

# సృష్టి

## ఇచ్ఛాపురపు రామచంద్రం

(గతసంచిక తరువాయి)

### 3

ఈసారి తను ఒక్కడే ఆలిస్‌ను కలుసుకున్నాడు.

పద్మ గురించి....ఆమె నిర్ణయం గురించి వివరంగా చెప్పాడు.

"ఆమె ఆత్మహత్య చేసుకోకుండా రక్షించటం మీ చేతులలోనే వుంది. ఎంత డబ్బయినా బాధ లేదు. నాకు తెలుసు మీరు సర్వసమర్థులయిన డాక్టరని. పద్మ జీవితాన్ని నీటముంచినా పాలముంచినా మీదే భారం. ఆమె అమ్మ అయితే తప్ప ఆత్మహత్యా ప్రయత్నం విరమించదు" ఒక్కసారాగి...."గడువు పూర్తిగా సంవత్సరం కూడా లేదు" అని ఆమెవేపు చూశాడు.

"సంవత్సరమా!"

"ఔను"

"ఐతే ఆమె ఆత్మహత్య చేసుకోదు-" అంది తనమాటకి తిరుగులేదన్నట్లు.

"మీరు ఆమెని తల్లిని చేస్తున్నారా?" ఆశగా చూశాడు.

"కాదు. జయదేవ్! మీకు లైఫ్ ఇన్సూరెన్స్ గురించి తెలుసా?"

"ఏమిటి?"

"ఆ పట్టాలో — పట్టా తీసుకున్న సంవత్సరం అనంతరం ఆత్మహత్య చేసుకున్నా క్లయిము చెల్లించబడుతుందని వ్రాస్తారు"

ఆశ్చర్యంగా చూశాడు. అతని జీవితం మీద చాలా ఇన్సూరెన్సు పాలసీలు వున్నాయి. కాని అతనెన్నడూ పట్టాని-దాని షరతులని చదివిన పాపాన పోలేదు. ఏజంట్ల బారినుంచి తప్పించుకుందుకే తప్ప అతను కోరి భీమా చేయించుకోలేదు తన జీవితాన్ని. "ఐతే-కంపెనీకి చాలా నష్టాలు రావాలే! చాలామంది డబ్బుకోసం-ఏడాది పోయాక ఆత్మహత్యలు చేసుకుని ..."

ఆమె నవ్వింది. "ఇన్సూరెన్స్ కార్పోరేషన్‌కి నష్టాలు రావడం లేదు సరి కదా అత్యధిక లాభాలు వస్తున్నాయి. వాళ్ళకి మనుషుల మనస్తత్వం తెలుసు-"

"ఏమిటి?" కుతూహలంగా చూశాడు.

"ఇవాళ ఆత్మహత్య చేసుకుందామనుకుని ఎంత గాఢంగా నిశ్చయించుకున్నా-సంవత్సరం తిరిగేసరికి ఆ నిశ్చయం సడలిపోయి వివేకం కలిగి-జీవితపు విలువ గుర్తిస్తారు మనుషులు. క్షణికోద్రేకంలో తీసుకొనే నిర్ణయాలు అతి తొందరగానే మారిపోతాయి.

అదీకాక-నిజంగా చచ్చిపోదామనుకున్నవారు ముందుగా చెప్పరు. ఆత్మహత్య అప్పటికప్పుడు కలిగే మానసిక బలహీనత. కెరటంలాగే దాని ఆయుస్సూ అల్పమే"

"మీరు చెప్పేది నూటికి తొంభై తొమ్మిదిమంది విషయంలో నిజమే. కాని-పద్మ నూరో మనిషి. ఆమె విషయం మీకు తెలియదు"

"మీరెవరినయినా దత్తత చేసుకోండి-నిజంగా మీ మిసెస్ అమ్మా అని పిలిపించుకుందుకు అంత ఆత్రత చెందుతూంటే"

జయదేవ్ నిర్లిప్తంగా నవ్వాడు. "ప్రేమించి పెళ్ళి చేసుకున్న మేము— మొదట బంధువులచేత వెలివేయబడ్డాం. అయితే-నేను చాలా ధనం సంపాదించడంతో, వాళ్ళంతటవాళ్ళే మా చుట్టూ తిరగడం మొదలుపెట్టారు, బంధువులకి-బోలెడంతమంది పిల్లలూ వున్నారు. తమ బిడ్డని దత్తత తీసుకోమంటే తమ బిడ్డని దత్తత తీసుకోమని వొత్తిడి చేస్తున్నారు. ఏ వొక్కరిని తీసుకున్నా-మిగిలిన వాళ్ళు శత్రువులౌతారు. అదీకాక—పద్మకి దత్తత కానీ పెంచుకోడం కానీ ఇష్టం లేదు. తన రక్తం పంచుకు పుట్టిన బిడ్డే కావాలామెకు!

"అసంభవం. అసాధ్యం"

"మనసుంటే మార్గం ఉండకపోదు" అంటూ వంద రూపాయల నోట్ల కట్టలు రెండు తీశాడు. ఇరవై వేలు కొత్త రూపాయినోట్లకట్టలు చాలా అందంగా వున్నాయి. మంచి వాసన వేస్తున్నాయి-మత్తుమందులా!

ఒక్కసారి ఆలిస్ తృళ్ళిపడింది. ఆశ్చర్యపోయింది. అయితే—అంతలోనే కొంచెం అవమానించబడినట్లు-"నేను డబ్బు మనిషినే. కాని వంచకురాలిని కాను. నేను చేయలేని పనికి డబ్బు తీసుకునే నీచురాలిని కాను"

"సారీ డాక్టర్! క్షమించండి. మిమ్మల్నవమానించాలనీ కాదు. అల్పంగా అంచనా వేసీ కాదు. డబ్బు ఎంత పాపిష్టిదో అంత శక్తివంతమైనది కూడా. నోట్ల కట్టలని చూసేసరికి-మనిషికి ఉత్సాహం వస్తుంది. మెదడు మరింత చురుకుగా ఆలోచించగలుగుతుంది. కొత్త ఉపాయాలూ మార్గాలూ మెదడుకి స్ఫురింపజేసే-ఇన్‌స్పెస్పేనియస్ (తక్షణ) ఇంజక్షన్—కరెన్సీ నోట్లకట్టలు. కొత్త శక్తిసామర్థ్యాల నివ్వగలదు కరెన్సీ! ఆలిస్! ఇది ప్రారంభం మాత్రమే. మీరు నా కార్యం సాధించి పెడితే లక్ష! మీరు కోరినంత... " నోట్లకట్టలు ఆమె ముందుకు తోశాడు.

ఆశతో ఆమె కళ్ళు మెరిశాయి! లక్ష రూపాయలు! ఒక్క కేసుకి లక్ష! ఎంత కోరితే అంత! కాని. ..కాని....

"క్షమించండి. నేనేమీ చేయలేను. నేనేకాదు....మీ సమస్యని ఏ డాక్టరూ కూడా పరిష్కరించగలరనుకోను-మీరు కోట్లు గుమ్మరించినా. ఎందుకంటే ఏ డాక్టరయినా మానవమాత్రులే! సంతానం భగవత్ప్రసాదం" అందామె. లక్షలు చేజారిపోతున్నందుకు కాబోలు ఆమె కంఠంలో అదొక విధమయిన బాధ!

"డాక్టరుగా మీరు సిగ్గుపడడంలేదూ సంతానం భగవత్ప్రసాదం" అన డానికి? మీ మెడికల్ సైన్సు సాధించిన అభివృద్ధి . చెప్పుకునే గొప్పలు ..."

ఆలిస్ నవ్వింది. "మీరు సాహిత్యం చదువుతారా?"

"దేనికి?"

"బాగా జ్ఞాపకం లేదు కానీ ఒక కవి-మనిషిని సవాలు చేస్తాడు, చెట్టుని నరికిన ఓ మనిషీ! ఏదీ చూస్తాను ఒక పువ్వుని సృష్టించమని. మీ బాధ నేనర్థం చేసుకోగలను. పిల్లలు పుట్టకుండా నిరోధించగలుగుతున్న వైద్యవిజ్ఞానం గొడ్రాలినెందుకు సంతానవంతురాలిని చేయలేకపోతూంది? దీనికి జవాబు ఆ కవితా చరణమే. తరువాత-శాస్త్రం ఆగినచోట భగవంతుడు ప్రారంభమౌతాడు. తప్పదు. అంతేకాదు. ఇది....ఇదే మానవాళికి నిజంగా మంచిదేమో! శాస్త్రానికి హద్దు, భగవంతుడనేవాడు లేకపోతే మనిషి అన్నీ సాధించెయ్యగలిగితే—అక్కడితో అభివృద్ధి ఆగిపోయి-జీవితం పగిలిన గ్లాసు అయిపోతుంది. పీటర్స్ ప్రిన్సిపల్ .... నిజంగా మనిషినీ ప్రపంచాన్నీ ముందుకు నడిపించేవి అసమర్థతా, అప్రయోజకత్వమూ-ఇవేనేమో! అన్నీ సాధించేస్తే ఇక మానవుడు దేనికోసం రేపటి కెదురు చూస్తాడు? రేపు అనే సస్పెన్సే లేకపోతే మనిషి జీవితాని కింకేముంది?"

తెల్లబోయాడు జయదేవ్.

ఈ పురుళ్ళ డాక్టరు.. స్త్రీ రోగ నిపుణురాలు... భారీశరీర హిడింబి— ఇంత విజ్ఞానవతా? ఇంత సునిశిత...తాత్విక ...విమర్శకురాలా?

"మీరు డాక్టరే కాదు! భావుకులూ, కుశాగ్రబుద్ధులూ....అద్భుత ఆలోచనాపరులూ కూడా! ఆలిస్ ...ఈ ప్రపంచంలో నా సమస్యంటూ పరిష్కరించబడితే పద్మ తల్లి కావడమంటూ జరిగితే-అది మీ ఒక్కరివల్లే సాధ్యం ఆలిస్!"

"మీ విశ్వాసానికి చాలా కృతజ్ఞురాలిని. కాని...నేను మీకేం చేయలేనని-నా అసమర్థతనూ, అశక్తినీ చెప్పుకుందుకు చాలా సిగ్గు పడుతున్నాను. మీ ఆత్రత అర్థమై-మీకేమీ సహాయపడలేక పోతున్నందుకు చాలా సిగ్గు పడుతున్నాను. జయదేవ్! ఇంతవరకూ మనిషి-లయాన్నే సాధించాడు; సృష్టిని చేతిలోకి తీసుకోలేకపోతున్నాడు. కాలాన్ని జయించడానికి వేగాన్నయితే కనిపెట్టాడు! కాని...యింకా....నిజంగా....కాలం అజేయమే! కాలగమనాన్ని ఒక్క-క్షణం పాటయినా ఆపలేదు మానవుడు. అలాగే, ప్రకృతి! వర్షం...ఎండ....గాలి ... తుఫాను ...గ్రహణం....అన్నీ మానవాతీతాలుగానే వున్నాయి. అందుకే యీ ప్రపంచం యింకా కొన్ని కోట్ల సంవత్సరాలు ముందుకి పోగలదు. సృష్టి సంగతి యిందాకే చెప్పానుగా? అనంత విశ్వంలోనే కాదు, ఆరడుగుల మనిషిలోనే విజ్ఞానాని కందనివెన్నో ఉన్నాయి. ఉదాహరణకి...కిడ్నీస్...లివర్ మొదలయిన భాగాలను రిప్లేస్ చేయగలుగుతున్నారే తప్ప-ఎంతో సునిశితమయిన కంప్యూటర్లనీ, రోబోట్స్‌నీ కనిపెట్టామనీ విర్రవీగుతున్న సైంటిస్టులు మనిషిలోని మెదడుని రిప్లేస్ చేయలేకపోతున్నారు. మీరొకటి చదివారా?"

"ఏమిటి?" అద్భుతంలోంచిలాగ అడిగాడు.

"పది అంతస్తుల మేడంత కంప్యూటర్‌ని సృష్టించినా-అది పది ఔన్సుల బరువే తూగని మనిషి మెదడుతో సరితూగదు"

"మీకెన్ని విషయాలు తెలుసు!"

ఆమె నవ్వింది. "నేను చాలా అజ్ఞానిని. ఏ కొంచెమయినా తెలుసుకుంటే అది-పుస్తకాల ధర్మమే"

"మీరు-తెగ చదువుతారా? '

"చదువుతాను-అంతే"

"అంత చదివీ-నా సమస్యకి మార్గం...."

"ఆ ఏసుప్రభువే చూపాలి. నా చేతిలో ఏమీ లేదు..."

"ఆలిస్!" అతను ఆశగా చూశాడు. "మీరు చాలా భక్తులా?"

"ఔను"

"అయితే మీరు నా సమస్యని ఛాలెంజ్‌గా తీసుకోండి. దీని పరిష్కార మార్గం కోసం ఏసుని ప్రార్థించండి. ఏసు మిమ్మల్ని తప్పక కరుణిస్తాడు. అంటే... మీకు సహాయం చేస్తాడు...."

"సరే. నాకేదయినా మార్గం స్ఫురిస్తే మీకు టెలిఫోన్ చేస్తాను. నంబరివ్వండి" అందామె.

"థాంక్స్" అని లేచాడతను.

"డబ్బు ..." తీసుకెళ్ళమన్నట్లు గుర్తు చేసింది.

"ఇరవై వేలేగా!" తేలిగ్గా అని-"ఉంచండి. నా అంతరాత్మ చెబుతోంది, మీరు మా కేసు పేరవ్ చేస్తారని" నవ్వి-ఆ డబ్బునలాగే వదిలేసి బయటకు నడిచాడు.

ఆలిస్ ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది.

ఇరవై వేలు!....ఎంత తేలికగా వదిలేశాడు!

ఆమె ఆశ్చర్యంనుంచి తేరుకుని-బయటకు. పరుగెత్తింది.

అప్పటికి-జయదేవ్ కారు స్టార్టు చేయబోతున్నాడు.

"ప్లీజ్... జయదేవ్!"

అతనామెవేపు చూశాడు.

"ఈ డబ్బు నా దగ్గర వద్దు"

"అందుకని పరిగెత్తుకొచ్చారా! ఇంత స్వల్ప విషయానికెంత శ్రమ తీసుకున్నారనవసరంగా!"

"స్వల్ప విషయం కాదు. నాకెందుకో గిల్టీగా ఉంది"

"గిల్టీగానా! దేనికి?"

"అదికాదు...మీకు తెలియదు. ఈ కేసు....చాలా జటిలం...."

నవ్వాడతను. "మీరు చెప్పారు"

"అలాగ కాదు—" మాటలకోసం తడుముకుంటూందామె.

"ఏమిటి?"

"ఏసుప్రభువు కూడా....అంటే... ఆయన కసాధ్యమని కాదు...కాని ... ఆయన కరుణిస్తాడో కరుణించడో అని...."

"మీకు ఏసుయందు పరిపూర్ణ విశ్వాసము లేదా?"

"ఉహుఁ. నాకు విశ్వాసం లేనిది-నాయందే"

"నోనో. ఆలిస్! మీ శక్తి మీకు తెలియదు. మా పురాణాలలోని ఆంజనేయుడికిలా, మీరు తలుచుకుంటే సాధించగలరు. అలాగ తీవ్రంగా తలుచుకుందుకే యీ డబ్బు."

"కాని....పద్మ కేసు నాకు బాగా తెలుసు. ఆమె వూంబ్-పిండం పెరిగేంత విశాలం కాదు. కనుక-ఆమె సంతానాన్ని కనడం అసాధ్యం....

"అసాధ్యాన్ని సాధించడంలోనే ఆనందముంటుంది-అసంభవాలని సంభవాలను చేయించడంలోనే తృప్తి వుంటుంది"

"కాని యిది-పద్మకు పిల్లలు పుట్టడం-సాధ్యం కాని అసాధ్యం. సంభవం కాని అసంభవం! '



ఆవేళ—అలాగ అసాధ్యమూ అసంభవమూ అన్నీ అలిసే—యిందాకే టెలిఫోన్ చేసింది! ఆ టెలిఫోన్‌కి అర్థం తనకి తెలుసు.

వారం క్రిందట ఆమె కలిసినప్పుడు

"ఇక మీరు రాకండి. నేనే పిలుస్తాను వారంలోగా. ఈసారి నేను పిలిచానంటే అర్థం-మన ప్రయత్నం సఫలమౌతూందనే. అలా అయితే తప్ప మిమ్మల్ని పిలవను. నేను టెలిఫోన్ చేసి రమ్మన్నానో—మీరొక గంటలో పద్మని తీసుకు రావాలి. ఏం?"

బుద్ధిమంతుడిలా తల ఊపాడు.

"ఎక్కడికో వెళ్ళాలన్నారుగా? అలా ఇలోచిస్తూ నిలుచున్నారేం? పదండి' అంది అప్పుడే వచ్చిన పద్మ.

అతనామె ముఖంలోకి చూశాడు

బాధ వేసింది.

ఆమె చాలా నిర్లిప్తంగా ఉంది. తనతో రావడం కేవలం డ్యూటీలో భావిస్తున్నట్లే ఉంది. ఏమీ ఉత్సాహంగా లేదు. విధి నిర్వర్తిస్తున్నట్లు....గంభీరమయిన ముఖంతో ...

ఎంత మారిపోయింది పద్మ!

ఆ రోజులలో ఎలా ఉండేదని! తనని చూస్తే చాలు ఆమె ముఖం అచ్చంగా పద్మంలాగే వికసించేది. ఎన్నో కబుర్లు చెప్పేది. తనచేత చెప్పించేది. పద్మ సన్నిధిలో కాలం పరుగులు తీసేది!

ఇప్పుడు? తప్పనిసరి అయి బతుకుని భారంగా యీడుస్తున్నట్లు... ఈ ప్రపంచం తనకేమీ కానట్లు...

విచారించవలసిన విషయమేమిటంటే—పద్మ తన ప్రేమని కూడా మరచిపోయి విరాగిని అయిపోయింది! కనీసం తనకోసమయినా బ్రతకాలన్న బాధ్యతను కూడా విస్మరించి-స్వసుఖం చూసుకునే స్వార్థపరురాలయిపోగలిగింది! ఒక్క సంతానం మినహా ఆమెకేం లోటని?

"ఏమిటాలస్యం?"

అతను గడియారంవేపు చూశాడు. పావు తక్కువ ఎనిమిది.

ఆమె చేయందుకుని నడిపించసాగాడు.

"రాత్రికి యిల్లు జాగ్రత్త. ఏ వేళకి వస్తామో... " నౌకరుకి జాగ్రత్త చెప్పాడు. కారు దగ్గరకి వచ్చేసరికి-డ్రయివర్ నిలుచుని వున్నాడు.

"నేను డ్రయివ్ చేసుకుంటానులే. నువ్వెళ్ళిపో"

అతను వెళ్ళిపోయాడు.

కారు తలుపు తెరిచి పట్టుకొన్నాడు పద్మ కోసం. ఆమె కూర్చున్నాక తను స్టీరింగ్ తీసుకున్నాడు.

సరిగ్గా-కారు స్టార్టు చేయబోతూంటే...

"మ్యాఁ... వ్"

ఉలిక్కిపడి చూశాడు

నల్లపిల్లి!

సరిగ్గా కారుకెదురుగా.. అడ్డంగా...

లైట్లలో దాని కళ్ళు పచ్చగా క్రూరంగా మెరుస్తున్నాయి.

దాని భంగిమ కూడా-చిత్రంగా వుంది.

వెనుక కాళ్ళమీద కూర్చుని—

ముందరికాలి పంజా ఎత్తి-

మీదపడి చీరేస్తానన్నట్లు-కోపంగా తనవేపే చూస్తూ-గుర్రుమంటూంది!

పిల్లి-దుశ్శకునము.

చిన్నప్పుడు చదివినది మెదడులో మెదిలింది... చేదుగా - భయంకరంగా కోపంతో-బలంగా హారన్ వేశాడు.

నల్లగా-దుక్కలా-పోతరించి వున్న పిల్లి-

ఎందుకో దానిని తొక్కించెయ్యాలన్నట్లు కసిగా ఆక్సిలేటర్ తొక్కాడు. కారు-ముందు కురికింది.

కాని....అది...చిత్రంగా...చివరి క్షణంలో...పక్కకు గెంతి—ప్రాణ రక్షణ చేసుకుని తనవేపు చూస్తూ గుర్రుమంది...పారిపోతూ.

కారు దాటిపోయింది.

అతను కారు నడుపుతున్నాడే కాని- మెదడులోంచి స్టిల్ ఫొటోగ్రాఫ్‌లాటి అరుదయిన ఆ భంగిమలోని పిల్లిని మరచిపోలేక పోతూనే ఉన్నాడు. దాని గురించి ఆలోచించకుండా ఉండలేకపోతున్నాడు. ఎక్కడినుంచి వొచ్చిందది? నిశ్చయంగా-దానిని ఇంతకు ముందెన్నడూ చూడలేదు. అది తమ ఆవరణలోది కాదు. పిల్లలు లేని యింట-పిల్లులు ఉండవేమో. ఆ నల్లపిల్లి ఎక్కడనుంచి వొచ్చింది? ఎందుకు వచ్చింది? తాను దాన్నేం చేశాడని అలాగ తన మీద యుద్ధం ప్రకటించింది శత్రువులా? పచ్చగా ప్రకాశిస్తున్న ఆ కళ్ళు ఎంత క్రూరంగా ఉన్నాయనీ! పచ్చటి నిప్పుల్లాటి ఆ రెండు కళ్ళూ-రెండు జీవితాలని దహించేసేటట్లు ఎంత భయంకరంగా మెరిశాయి!

సరిగ్గా బయలుదేరబోతూంటే-

ఈ దుశ్శకునమేమిటి? దీని సూచన ఏమిటి?

అతను-వణికిపోయాడు.

తను వెళ్తున్న పని కాదా?

పద్మకు ఆత్మహత్య తప్పదా?

అయ్యో! ఎంత పొరపాటు చేశాడు!...నల్లపిల్లి ఎదురు రావడం మంచిది కాదని తెలిసినా మూర్ఖంగా బయలుదేరిపోయాడు. ఒక్క నిముషం ఆగి ...కాళ్ళు కడుక్కుని బయలుదేరితే దుశ్శకున దుష్ఫలితం కనీసం తగ్గనయినా తగ్గేది కదా!

ఛీ . ఏమిటిది? ఎందుకిలా ఆలోచిస్తున్నాడు తను? చదువుకుని కూడా శకునాలని నమ్మడమా! వాటికోసం తెలివితక్కువగా-యిలా బుర్ర బద్దలు కొట్టుకోవడమా! ఫూలిష్ . ఆ నల్లపిల్లి రావడం కేవలం యాదృచ్ఛికమే అయి వుంటుంది. అంతే! దానికింత ప్రాధాన్యత యివ్వడం వొట్టి మూర్ఖత్వమే. తను .. తాము వెళ్ళేపని తప్పకుండా సఫలమౌతుంది. తిరుగు లేదు. తనకి సాయం చేసేవారు సామాన్యులు కారు. అటు ఆలిస్ ...ఇటు సుషమ.

"ఆలిస్! పద్మ-చాలా నిరుత్సాహంగానూ నిర్లిప్తంగానూ ఉంటూంది-" చెప్పాడావేళ.

"ఆమెకు-శారీరకంగా ఏ అనారోగ్యమూ లేదు"

"అంటే?"

"మామూలు మందు లామె మీద పని చెయ్యవని"

"మరేం చేస్తాయి?"

"మీరు సుషమని కలుసుకోండి. ఆమె ఏమయినా చేయగలదేమో"

"ఆమె గురించి కొంచెం చెప్పండి"

"సుషమ-సైకియాట్రిస్ట్ .. హోమియోపతీ కూడా చేస్తూంది. చాలా తెలివైనది. నా ఫ్రెండ్"

"ఇకనేం. టెలిఫోన్ చేసి చెప్పండి. నేనామెను కలుస్తాను"

"అలాగే. ఇదుగో ఆమె అడ్రస్" అంటూ వ్రాసియిచ్చింది ఆలిస్. అతను సుషమ దగ్గరకు బయలుదేరాడు.

పది నిముషాలలో .. అతనామె ఇల్లు చేరాడు. సుషమ తీరుబడిగానే వుంది.

"నేను-జయదేవ్‌ని. ఆలిస్ చెప్పి వుంటారు నా గురించి"

"ఇప్పుడే టెలిఫోన్‌లో మాట్లాడాను. రండి. కూర్చోండి" అంటూ ప్రత్యేకమయిన గదిలోకి తీసుకువెళ్ళిందామె అతనిని.

"ఆలిస్ మీకు చెప్పారనుకుంటాను—మా పరిస్థితేమిటో"

"ఔను. మీరు-మీ మిసెస్‌ని కూడా తీసుకువస్తే బాగుండేది"

"మీరే మా ఇంటికి రావడం బాగుంటుందేమో. ఎందుకంటే—పద్మకి హాస్పిటల్ కి రావడమన్నా అయిష్టమే. నిజానికి ఆమె రోజులు లెక్క-పెట్టుకుంటూంది.

"దేనికి?" ఆశ్చర్యంగా చూసిందామె.

ఆలిస్ పూర్తిగా చెప్పలేదన్నమాట తమ గురించి అనుకుని "నలభయ్యేళ్ళు నిండుతున్న పద్మ-తల్లి కాలేకపోవడంతో గుండె బండ చేసుకుని ఆత్మహత్యకు నిర్ణయించుకుంది. నేను ప్రార్థించడంతో ఒక ఏడాది చూడడానికి దయతో అంగీకరించింది. ఆ గడువు—ఇక పది మాసాలుంది సంతానం కలగకపోతే ఆమె నాత్మహత్య చేసుకోకుండా ఆపడం బ్రహ్మదేవుడి తరం కూడా కాదు"

ఆశ్చర్యంగా వింటూంది సుషమ.

"కనీసం బ్రతికే యీ పది పదకొండు నెలలయినా ఆమె ఆనందంగా సంతోషంగా గడపాలి. విచారంగానూ, విరాగినిలాగానూ కాదు" అదీ సమస్య అంటున్నట్లు.

జయదేవ్‌కొక ఆలోచన వుంది. ఆశ వుంది. అదేమిటంటే....

పద్మ నిరాశతోకాక ఆనందంగానూ ఆశగానూ ఉంటే—ఆమె యిప్పటికేనా గర్భం దాల్చవొచ్చు సహజసిద్ధంగానే. అందుకే తను ప్రతి రాత్రీ ఆమె గదిలోనే పడుకుంటున్నాడు కాని-ఏం లాభం? దగ్గరకు తీసుకున్నా ఆమెలో చలనమూ స్పందనా కలగడం లేదు. వొట్టి రాతిబొమ్మలాగే మిగిలిపోతూంది తన కౌగిలిలో కూడా! అందువల్ల ఏం ప్రయోజనం? ఆమె కూడా తనకు పిల్లలు పుట్టవచ్చునన్న ఆశాభావంతో తనతో సహకరిస్తేనే తన ప్రయత్నం నెరవేరే అవకాశముంటుంది. అంతే తప్ప-కీడే ఎంచితే ...నిరాశే మిగుల్చుకుంటే—ఏం మంచి జరుగుతుంది?

"ఆమె కెందుకు పిల్లలు కలగలేదు?"

"వూంబ్-పిండాన్ని పెంచి పిల్లను భరించగలిగేంత విశాలం కాదట. అయినా—ఆలిస్ ప్రయత్నిస్తూనే ఉన్నారు. పద్మ జీవించాలంటే—గడువు దాటాక కూడా జీవించాలంటే ఆమె తన రక్తం పంచుకు పుట్టిన బిడ్డకు తల్లి అయి తీరాలి"

"ఆలిస్ అది అసాధ్యమన్నట్లు చెప్పిందే!"

"ప్రస్తుతానికిలాగ అనిపించవొచ్చు. నాకు ఆలిస్‌మీద ఆశా నమ్మకమూ కూడా చాలా వున్నాయి"

"నేనేం చెయ్యాలి? ఏం చేయగలను?"

"మీరు హిప్నాటిస్ట్!" ఏదయినా చెయ్యగలరన్నట్లు చూశాడు.

ఆమె నవ్వింది ..."మనసులో—మనకు తెలియకుండా దాగిఉన్న అద్భుత శక్తులను వెలికిదీయగలిగినదే హిప్నాటిజం. అంతే తప్ప యిది మంత్రమూ, తంత్రమూ, దివ్యశక్తి ఏమీ కాదు . మాయో, మహేంద్రజాలమో అంతకంటే కాదు "

"మనిషికి శక్తినీ ఉత్సాహాన్నీ ఇచ్చేది ఆశ. ఆశలేని జీవితం ఒయాసిస్ లేని ఎడారే నేను కోరేదేమిటంటే-పద్మ మనసులో ఆశ రేకెత్తించండి. అది ఆమెను మనిషిని చేయగలిగితే-శాశ్వతంగా ఆమెను జీవితానికి పట్టి ఉంచగలిగితే మంచిదే. లేదూ ...కనీసం ఆమె బ్రతికే కొద్ది నెలలయినా ...చావుకోసం ఎదురు చూస్తూ క్షణాలు గడపడం ఎంత నరకం! పద్మ-ఒకప్పుడు చాలా ఉల్లాసంగా ఉండేది"

సుషమ ఆలోచనలో పడింది. జయదేవ్ మాటలు పూర్తిగా అర్థమైనట్లు. ఆమె మెదడులో-రెండు పదాలు మెదలసాగాయి. ఇల్యూషన్ (తీయని భ్రమ) డిస్‌ఇల్యూషన్ (చేదు భ్రమ?) భ్రమలోని యీ రెండు కోణాలూ పరస్పర




విరుద్ధాలే అయినా-మనిషి కపకారం చేయడంలో రెండూ ఒకటే. సర్వసాధారణంగా హిప్నాసిస్ మనుషుల భ్రమలను పోగొట్టడానికే వాడడం జరుగుతుంది. ఇప్పుడు పద్మ విషయంలో .. ఆమెకు హిప్నాటిజమ్ సాయంతో తీయని భ్రమలు కలిగించాలి. ఈ తీయని భ్రమలే ఆమెను జీవించే కొంచెం కాలమూ బ్రతుకుని నిరాశా నిట్టూర్పులమయం చేసుకోకుండా సుఖంగానూ సంతోషంగానూ ఉండాలి. ఇది అసాధ్యమూ కాదు, అసంభవమూ కాదు. ట్రాన్స్‌లోకి తీసుకువెళ్ళి ఆమెను ...ఆమె మనసును ప్రభావితం చేయవచ్చు. అందుకు హిప్నాసిస్‌తోపాటు హోమియోపతీ కూడా ఉపకరిస్తుంది.

"ఆమె తగిన సబ్జక్టయితే చాలా మంచి ఫలితాలిస్తుంది హిప్నాసిస్. ఆపైన హోమియోపతీ..."

"హోమియోపతీయా!"

"నిజంగా హోమియోపతీయే సరయిన వైద్యం చాలా రంగాలలో బాడీ, సోల్ ...అండ్ మైండ్ మూడింటిమీదా పని చేయగలదు. కేవలం వ్యాధి నిర్మూలనే కాక—మనిషి తత్వాన్ని కూడా మార్చగలదు. మీవంటివారిని వొదిలేస్తే-అధిక సంఖ్యాకులు పేదవారే వున్న యీ దేశానికి హోమియోపతీయే తగిన వైద్యం. ప్రజలు భ్రమపడేటట్లు పంచదార మాత్రలు కావు. పంచప్రాణాలనూ రక్షించగలిగే అమృత గుళికలు.

ఆశ్చర్యంగా చూశాడు జయదేవ్. చూడబోతే యీమెకు హోమియోపతీ మీద చాలా ఉన్నతమూ, నిర్దుష్టమూ అయిన అభిప్రాయం ఉన్నట్లుంది.

"ఎలాగ అన్నది నా ప్రశ్న కాదు సుషమా! ఫలితమే నాకు ముఖ్యం మీరు హిప్నాసిస్‌తో కానివ్వండి, హోమియోపతీతో కానివ్వండి, పద్మని శాశ్వతంగానో, తాత్కాలికంగానో మనిషిని చెయ్యండి చాలు" అంటూ వంద రూపాయల నోట్ల కట్ట ఒకటి టేబులుమీద ఉంచాడు.

"ఇంతెందుకూ?" అందమయిన సుషమ-ఆశ్చర్యంగా చూసింది.

"మీరు ఇంటికి వస్తారు. అంతేకాదు... ఆలిస్‌కి తగిన సహాయమూ. సలహాలూ అందిస్తారు. అందుకని సుషమా! డబ్బుకంటె జీవితాలు చాలా విలువయినవి. మీరు-ఆలిస్‌ని కలుసుకోండి. ఇద్దరూ కలిసే పద్మ కేసుని తీసుకోండి-"

"సరే. మీ యింటికి - నా స్టూడెంట్ వస్తూంది. చాలా బ్రిలియంట్ స్టూడెంట్. నాకంటె తెలివయినది. ఎటువంటి సబ్జక్టునయినా హిప్నటిక్ ట్రాన్స్‌లోకి తీసుకు వెళ్ళగలిగే సహనం ఆమె సొత్తు. అదీకాక ఆమె వయసు పద్మ వయసే కనుక-"

"మీ కెలా మంచిదనిపిస్తే అలాగ చెయ్యండి. ఒకటి మాత్రం మరచిపోకండి. ఈ కేసు మీకూ, ఆలిస్‌కి ఛాలెంజ్. గెలిస్తే ఆమెతోపాటు మీకూ ఒక లక్ష-" విజిటింగ్ కార్డు ఇచ్చి వచ్చేశాడు.

(ఇంకా వుంది)

కీ. శే. కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# మారేపల్లి రామచంద్రశాస్త్రి కవిగారు–నా పరిచయము

[ఈ వ్యాసం అముద్రితం. కీ.శే. పురిపండా అప్పలస్వామి గారింట్లో వెంకట మహాలక్ష్మిగారిద్వారా నాకు దొరికింది. డాక్టర్ గంటి శ్రీరామమూర్తిగారు దీనిని గురించి "ఈ వ్యాసం కవిగారి శతజయంత్యుత్సవ సందర్భంగా ప్రత్యేక సంచిక నిమిత్తం మేం అభ్యర్థించగానే పంపారు. అయితే మేం ఆ సంచికని వెయ్యలేకపోయాం" అన్నారు. 7-11-1974 నాటి ఈ వ్యాసం కవిగారి ప్రతిభనే కాదు-నిడుదవోలువారి విశిష్ట సాహితీ వ్యక్తిత్వాన్ని కూడా మన కళ్ళ ముందుంచుతుంది. —ద్వా. నా. శాస్త్రి]

నవ్యాంధ్ర సాహిత్యజగత్తులో 'కవిగారు' అని ప్రసిద్ధికెక్కిన కవి పండితులిరువురు. ఒకరు మానవల్లి రామకృష్ణ కవిగారు–రెండవవారు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు. విశాఖపట్టణములో కవిగారి అసలు పేరెట్లు మఱుగు పడినదో మద్రాసులో కవిగారి పేరు అట్లే మఱుగు పడినది. ఇరువురు కవిగారని పేరందుటయే కాదు. ఇంటి పేర్లలో ఆద్యంతాక్షరములు మానవల్లి–మారేపల్లి ఒకటిగా నుండుట చిత్రము. ఈ ఇరువురితో నాకు ప్రగాఢ పరిచయము కలుగుట మరీ విశేషము. అది నా యదృష్టము.

1972లో ఆంధ్ర సాహిత్య అకాడమీవారు డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావు (పూర్వము తెలుగు అకాడమీ సంచాలకులు, ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక శాఖా ప్రత్యేకోద్యోగులు) గారి ఆధ్వర్యమున మానవల్లి కవిగారి రచనలు ప్రకటితమైనపుడు నేను వానికి పీఠికలు వ్రాసి, వారితో నాకు గల పరిచయమును లోకమునకు వెల్లడించితిని. 1974లో నేడే మారేపల్లి కవిగారి శతజయంతి సందర్భమున వారితో నాకు గల పరిచయమును తెలుపు భాగ్యము లభించినందులకు నెంతో సంతోషించు చున్నాను.

మానవల్లివారి గ్రంథ పీఠికలో వారికి 'కవిగారు' అను పేరెట్లు వచ్చినది తెలిపినాను[1] ప్రస్తుత మీ కవిగారి కెట్లది లభ్యమైనది తెలుపుచున్నాను.

క్రీ.శ. 1898 వ సంవత్సరమున-రామచంద్రశాస్త్రిగారున్నత విద్యాభ్యాసమునకై విశాఖపట్టణము వచ్చినారు. అప్పుడచ్చటివారు శ్రీ విక్రమదేవవర్మగారి ఇంట సమావేశమై వారి ఇంటిలోనున్న రవివర్మ[2] మేనకా విశ్వామిత్రుల చిత్రపటమును చూపి దాని పై పద్యము చెప్పుమని కోరిరి.

వెంటనే కవిగారు 16 చరణములు గల ఉత్పలమాలిక చెప్పిరి. అచటనది విన్న అద్భుత మేధా సంపన్నులు పి. టి. శ్రీనివాసయ్యంగారు[3] వారికి "కవిగారు" అను బిరుదమిచ్చిరి. శ్రీనివాసయ్యంగారు తమ గురువులని కవిగారు తమ షష్ఠిపూర్తి సన్మానసభలో ప్రశంసించి వారియందు గల భక్తి ప్రపత్తులను వెల్లడించినారు—ఆనాటినుండియు వారు "కవిగారు" అయినారు—ఇది ఉపక్రుతి.

పరిచయోదంతము

ఇప్పటి కేటదేడేండ్ల క్రిందటి సంగతి - కా గుణింతము మొదలుకొని కాన్వొకేషను వరకు గల విద్యా విధానములో, నా విద్యార్థి జీవిత మించుగా నంతయు విశాఖపట్టణముననే గడిచినది. నేను కవిగా నా సాహిత్య జీవితమును, విశాఖపట్టణముననే ప్రారంభించినాను. కవిగారును విశాఖపట్టణ వాస్తవ్యులే కావున మా పరిచయము సంఘటిల్లినది.

నా జనకులు సుందరముపంతులుగారానాటి సాహిత్యలోకమున ప్రసిద్ధులు. తెలుగుదేశమున తొలిగా తాళపత్ర గ్రంథములు సేకరించుటయే గాక-అపూర్వ ముద్రిత గ్రంథములను సంపాదించినారు. అంతకు పూర్వము ప్రసిద్ధులైన కొక్కొండ, మండపాక, వావిలి కొలను మొదలగు విద్వన్మహాకవులకు సుపరిచితులు-వారుద్యోగరీత్యా విశాఖపట్టణము 1918లో వచ్చిరి -వారితో నేనును వచ్చి కెనేడియను బాప్టిస్టు మిషన్ పాఠశాలలో చదువుచుండెడివాడను. విశాఖపట్టణమునకు వచ్చిన సాహిత్యవేత్తలు మా ఇంటికి తప్పక వచ్చెడివారు. గిడుగు రామ్మూర్తి పంతులు, మానవల్లికవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలగువారు వచ్చునపుడు-నేను వారికి, చిన్నతనమైనను, కవుల పేర్లు, కావ్యముల పేర్లు జెప్పుచుండేవాడను. వారు నన్నాశీర్వదించుచుండెడివారు.

1917లో వంగూరి సుబ్బారావుగారు, కవిగారు మా ఇంటికి వచ్చిరి-అదియే ప్రథమ దర్శనము. మా తండ్రిగారు నన్ను చూపి, "మీ ఆశీస్సులకు పాత్రుడు" అని తెలిపిరి. కవిగారు నన్ను గుర్తించిరి.

ఆ కాలమున మాకు, చిలుకూరి నారాయణరావుగారు, తాపీ ధర్మారావుగారు ఉపాధ్యాయులుగా నుండేవారు. వారిలో ధర్మారావుగారికి నేనంటే చాలా మక్కువ-వారు నన్ను-కవిగారి ఇంటికి (నేడు ఘోషా ఆస్పత్రి ఉన్న లోపలి భాగమున-అరుట్ల రామదాసుగారి వసతి) తీసికొని వెళ్ళినారు. అప్పటికే సాహిత్యలోకమున కవిగారు ప్రసిద్ధులు. వారికి నవ్యసాహిత్య కావ్యములు-రాయప్రోలు, దువ్వూరి వారి రచనలు వచ్చుచుండెడివి. కవిగారు ప్రాచీన సంప్రదాయానుసారులయ్యు, నవ్య రచనలకు ప్రోత్సాహమిచ్చెడువారు-మాకు వానిని గూర్చి తెలిపెడివారు. వారానాడట్టి ప్రోత్సాహము మాకు కల్గింపని యెడల నేనీనాడు నవ్యసాహిత్యముపై నింత విశాల దృష్టి గలవాడనై యుండెడివాడను కాదు.

హిందూ పఠన మందిరము

ఇచ్చట హిందూ పఠన మందిర వృత్తాంతము చెప్పవలసి యున్నది. ఇది మొదట క్రీ.శ. 1870లో మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యుల వారి వలన స్థాపితమైనది. దానికి గోలే నారాయణ గజపతి రాయణింగారు, భవనము కట్టించి యిచ్చినారు-ఆనాడు క్రైస్తవ మతప్రబోధము, ప్రచారము హెచ్చుగా నుండెడిది. దానివలన కొందరు హిందువులు క్రైస్తవ మతము స్వీకరించుట జరిగినది. దీనిని కనిపెట్టి రంగాచార్యులుగారు క్రైస్తవ దేవాలయము కెదురుగా (కెనెడియను బాప్టిస్టు మిషను, ప్రార్థనాలయము) దీనిని నిర్మింపజేసి అందు హిందూ మతోపన్యాసము లిచ్చుచుండెడివారు. వారి యుపన్యాసముల మూలమున, హిందూ మతప్రాశస్త్యము నెఱిగి–మతాంతరులు గాక, తమ తమ మత ధర్మముల నిలుపుకొనిరి.

కాలక్రమమున రంగాచార్యులుగారు క్రీ.శ.1900లో గతించిన వెనుక, నిది

బూజుపట్టి పోయినది. పాత భవన ముండెడిది. దానిని తిరిగి 1916లో కవిగారు, శ్రీ విక్రమదేవవర్మగారు పూనుకొని పర్దవాన్ రాణీసాహెబా, సీతబాగారిచేత ప్రస్తుత భవనమును సముద్ధరింపజేసిరి. దీనికై కవిగారెంతయో కృషి చేసిరి. పూర్వము మేడలేదు. ప్రస్తుతమిది. దివ్యభవనముగా ప్రధాన వీధి నలంకరించు చున్నది. నూతన భవనములో పత్రికా పఠనము గ్రంథాలయము నేర్పాటగుటచే నిది దిన దినాభివృద్ధి గాంచినది. ఆ వెనుక, నీ భవన ప్రతిష్ఠకు హేతుభూతులైన శ్రీ రంగాచార్యులవారి చిత్రపటమందున్న శోభాయమానముగా నుండునని కొంత మందికి తోచినది. కాని అది క్రీ.శ. 1918న గాని నెఱవేఱలేదు. ఆయేడు, రంగా చార్యులవారి దౌహిత్రులైన అప్పలాచార్య చక్రవర్తి వెంకట రంగనాథస్వామిగారు చిత్రలేఖనా నిపుణుడగుటచేత తమ తాతగారి చిత్రపటమును వ్రాసి యిచ్చిరి. దాని ఆవిష్కరణము 1918 మార్చి నెలలో జరిగినది. అనాటి సభకు ఆంధ్రాంగ్లముల 'ప్రబల' వాగ్ధోరణి గల ప్రథల లక్ష్మీనరసింహము పంతులుగారధ్యక్షత వహించిరి. విక్రమదేవవర్మగారు, అచంట సాంఖ్యాయన శర్మగారు, కవిగారు ప్రసంగించిరి. ఆ సభయందే నేను నా ప్రథమ కవిత

"రంగాచార్య ప్రశంస"

అను పేరితో అయిదు పద్యములు రచించి వినిపించితిని - సభ్యులు హర్షించిరి. అవి అప్పుడు విజయనగరమున వెలువడుచుండెడి "భారతమాత" అను పత్రికలో ప్రకటితమైనవి. కవిగారు నన్ను పిలిపించి పద్యముల నభినందించి "నీవు కవిత్వము సంస్కృతమయముగా చేసితివే" అన్నారు. వారట్లనుటకు కారణము లేకపోలేదు-

ఇతరుల యనుభవమెట్లో నాకు తెలియదుగాని ప్రథమముగా కవిత్వము చెప్పినపుడది సంస్కృతపద జటిలముగా గంభీరముగానున్న గాని కవిత్వమనిపించు కొనదని యభిప్రాయముతో నుండేవాడను. అందలి తొలి పద్యమిది-

"గాంగే యోపమ ధర్మసారుడు, మహాగంభీర వాగ్వైఖరీ
సంగుండంచిత సంస్కృతాంధ్ర కవితాచాతుర్య ధుర్యుండునౌ
రంగాచార్యుడు వెల్గెనాక సకలార్య ప్రౌఢదీమన్మనో
రంగంబందు ననారతంబు ధిషణా రమ్య ప్రభావోన్నతిన్"

కవిగారు నన్ను చూచి "నీవు తెలుగు కవివి కావలయును గాని సంస్కృత కవివి కాకూడదు. తిక్కన భారతమును చదువుము" అని ఆదేశించిరి. దీనినిబట్టి అనాడే "తెలుగు"నందు వారికెంత యభినివేశ ముండెడిదో తెలియగలదు. కవితా విషయమున నన్ను ప్రోత్సహించెడువారు. పౌరులచే కవిగా నేను గుర్తింపబడి నాను.

1919వ సంవత్సరము, అక్టోబరు 2 తేదీని మహాత్మాగాంధీ ఏబదవ జన్మ దినోత్సవ సభ చేయుటకు విశాఖ పురప్రముఖులు తీర్మానించిరి. కవిగారు నన్ను సభనాటికి పద్యములు రచింపుమనిరి. నేనును 5 పద్యములు రచించి పుర మందిరమున జరిగిన సభలో వానిని చదివితిని. సభాధ్యక్షులు సి. వి. యస్. నరసింహరాజుగారు (ఏనుగరాజుగారు) సభ్యులు రెండుసార్లు నా పద్యములను చది వించిరి. కవిగారి యాదేశానుసారము వీనియందు 'తెలుగుదనము' వెలయునట్లు ప్రయత్నించినాను. మచ్చునకొక్క పద్యము నిచ్చున్నాను-

"ప్రేయమనే స్వరాజ్య ము రరీ కృతమై చన భారతీయ ది
వ్యాయత శక్తి లోకమున కంతకు పాఠము నేర్పునట్లుగా
జేయగ నీ మహోద్యమము సిద్ధి వహింప విధాత నీకు బ్ర
హ్మాయువొసంగు గావుత మహా మహితాత్మక గాంధినాయకా"

కవిగారు చాలా సంతోషించినారు. "ఈనాడు దేశమున ఏ కొలదిమందికే గాని గాంధీవిషయము తెలియదే నీకెట్లు తెలిసినది" అని ప్రశ్నించినారు, నేను1915 సంవత్సరాది సంచికలో 'గాంధీ'ని గూర్చిన వ్యాసము చదివి వ్రాసితినని చెప్పి తిని-నాకు రాజకీయ నాయకులయందు భక్తి కుదిరినందున మరీ మెచ్చుకున్నారు.

1919 అక్టోబరు 2 తేదీని రచింపబడిన యీ పద్యములు గాంధి శత జయంతి సందర్భమున 1969 అక్టోబరు 2 తేదిని ప్రసారము చేయబడినవి. తెలుగుదేశమును మొదటిసారిగా గాంధిని గూర్చిన కవితయని అందువలన నిర్ణయ మైనది.

మహాత్మాగాంధీని గూర్చి మొట్టమొదట తెలుగుకవిత వెలయించిన కీర్తి విశాఖపట్టణమునకే దక్కినది. ఈ గౌరవము నాకు గలుగజేసిన పుణ్యమూర్తులు కవిగారే-

1920 ఆగస్టు 1వ తేదీని లోకమాన్య తిలకు యశశ్శరీరుడైనాడు. కవి గారు పద్యములను వ్రాయుమనిరి. ఎనిమిది పద్యములు వ్రాసితిని. వారి యింటి వద్ద సమావేశములో వీనిని చదివితిని. కవిగారే వానిని కృష్ణాపత్రికకు పంపినారు. అందైదు పద్యములు ఆ నెల 10వ తేదిని ప్రకటింపబడినవి. అందు క్రింది పద్యము వారు మెచ్చినారు.

"తిలకు వంశంబునందున చెలగుకతన
భారతీయుల తిలకమై పరగితీవు
బాలగంగాధరుండవై ప్రబలు కతన
పండితులకెల్ల నీవు నీశ్వరుడవైతి"

'తిలకు' అనునది ఇంటి పేరు-మహారాష్ట్రులకు ఇంటిపేరు చివరనుండును. ఆయన పేరు బాలగంగాధరుడు.

"బాలో గంగా ధరశ్చాహం తిలకాన్వయ బోద్విజః" అని గీతారహస్యం తెలుగువారి కింటిపేరు మొదట-తరువాత అసలు పేరు.

1921లో నేను ఉన్నత పాఠశాల వీడి ప్రథమశాస్త్ర పరీక్షకై (ఇంటర్మీడి యట్ ఎగ్జామినేషన్) మిస్సెస్సేలియస్ కాలేజీలో ప్రవేశించినాను. ఆ కళాశాల నుద్ధరించిన ఆ మహనీయురాలి, మంగళ నామధేయమే మనకు తెలియలేదే; స్వాతంత్ర్యావతరణమున మనమెన్నో ఆంగ్ల నామములు మార్చినాము. అట్లే ఆవశ్యకముగా దీనిని మార్చుడు. అయాంధ్ర మహిళామణి దాతృత్వము వెల్ల డింపుడు.

స్వాతంత్ర్యసమరము—

సహాయనిరాకరణోద్యమ ప్రారంభము.

1921 ఆగస్టు 20 తేదిని వాల్తేరు ధూమశకట స్థానమున (రైల్వేస్టేషన్) మహమ్మదాలీని నిర్బంధించుటతో విశాఖపట్టణమున నా మహోద్యమము ప్రారంభ మైనది. కవిగారి రాజకీయ జీవితమునకు నీ సంవత్సరము నాంది. విశాఖ పట్టణమున నానాడు ఏకైకముగా నా యుద్యమము నడపించినది కవిగారే. వారికి కుడిభుజమైనవారు వసంతరావు బుచ్చి సుందరరావుగారు. వీరిద్దఱే తప్ప ఆ యుద్యమము నడిపించినవారు విశాఖపట్టణములో వేరెవ్వరు లేరు. 20-8-1921వ తేదీనుండి 1928 జులై వఱకును ఈ యుద్యమమున పాల్గొన్నాను.

పద్యముల మూలమున, ప్రచారము మూలమున, నాటకములో వేషధారణ మూలమున - బహుముఖములుగా ఉద్యమ వ్యాప్తికి తోడ్పడి నా విద్యార్థి జీవితము



సార్థకము చేసికొన్నాను. అదియొక పెద్ద చరిత్రశిదానిని తడవను. ఈ రెండేండ్లు కవిగారితో నాకు మరీ సన్నిహితత్త్వ మేర్పడినది. 1922 ఆంధ్రపత్రిక సంవత్స రాది సంచికలో నా "భారతీయ ప్రబోధము" అన్న పద్యములు ప్రకటితమైనవి. ఉద్యమ ప్రచారమునకు నెంతో తోడ్పడినవి అని కాశీనాథుని నాగేశ్వరరావుగారు నన్నభినందించిరి.

1923లో పట్టపరీక్షకై నా స్వస్థలమగు విజయనగరము వెడలితిని. అయినను నాకు కవిగారితో సంబంధముండెను. ఆయేడు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు-తమ సరస్వతీ పత్రికయందు "ఇంకం గుంకుమబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్" అను సమస్యను పూరణకై ప్రకటించిరి. దేశమున కవి పండితులు దీనిని పూరించిరి. ప్రభాకరశాస్త్రిగారు వీనిని సమీక్షించుచు కవిగారి పూరణము దేశకాల పాత్రోచితమై, పూరణము లన్నింటిలో విన్నాణముగా నున్నదని పొగడిరి. కవులాలంకారికపరముగా కవి సమయములతో పూరించిరి. మన కవి గారెట్లు పూరించిరో చూడుడు—

"బింకంబుల్ పలుకాఱ్లు పల్కి సభలన్ పేరందు బల్కోక్కెక్కి; ని
శ్శంకన్ తానటు చేయజాలకిటు దేశద్రోహియై ఖైదనన్
జంకెన్నీపతి, పేరు మాపుకొనియెన్ చావన్న వేఱున్న దే
ఇంకం గుంకుమబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్"

ఇది కవిగారి కవితారచనకు మేలిమి మచ్చుతునక — ఈ సమస్య వృత్తాంతమ్ముగాని. కవిగారి పూరణ పద్యముగాని జయంతి సుబ్బారావుగారి "కవిగారి మనుగడ"లో లేదు.

1926లో నేను పట్టపరీక్షలో కృతార్థుడనై, ఉపాధ్యాయ వృత్తి దొరకక పోవుటచే "సామ్రాజ్య వ్యాపారకోశము" (ఇంపీరియల్ బాంక్ ఆఫ్ ఇండియా) లో విజయనగరమున గుమాస్తాగా ప్రవేశించితిని. పన్నెండేండ్లకు పైకాలమా 'గుమాస్తా' పని నిర్వహించితి. అయినను సాహిత్య వ్యాసంగము మానలేదు.

1929లో నా కత్యంతాప్తులు, మఱపురాని మిత్రవర్యులు శ్రీ గంటి సూర్య నారాయణశాస్త్రిగారు (వీరికి శృంగారశాస్త్రి + ఖద్దరుశాస్త్రి + కల్యాణిశాస్త్రి + గంటిశాస్త్రి అని నాలుగు నామాంతరములు) విజయనగరమున కల్యాణి పత్రిక నడపుచుండిరి. వారికి నాకు గాఢ మైత్రి కుదిరినది. సాహిత్య వ్యాసంగమునకు హెచ్చుగా నవకాశము కలిగినది. మేమిరువురము కలిసి, విశాఖపట్టణమున నే సాహిత్య విషయిక సభయైనను వెళ్ళుచుండేవారము . అందు కవితాసమితి సమావేశములు ముఖ్యములు.

1930లో రవీంద్రుడు ఆంధ్ర విశ్వవిద్యాలయమున నుపన్యాసములిచ్చుటకై వచ్చెను. కవితాసమితివారు స్వాగత పత్రమర్పించి ఆయనతో ఛాయా చిత్రము తీయించుకొనిరి. రవీంద్రుడు తనకీయబోవు స్వాగతపత్రము సంస్కృత సంపర్కము లేని తెలుగు భాషలో నుండవలెనని కోరినాడు. అచ్చతెలుగున కవిగారు తప్ప మఱియెవ్వరు వ్రాయగలరు? వారు

"మేలిమినుడి రతనపు తొడవు"

అని పేరిట నా పత్రమును వ్రాసినారు. మేమిరువురము దానికి హాజరయినాము.

1933లో కవిగారి షష్టిపూర్తి మహోత్సవము విశాఖ పురమందిరమున మహావైభవముగా జరిగినది. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారధ్యక్షత వహించిరి. ఆ సందర్భమున నేను ప్రసంగించితిని. ముఖ్యంగా ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ గారు "కొమ్ముమన్న మోవాకంబు గురువరేణ్య" అను పద్యములును, సెట్టి లక్ష్మీ నరసింహంగారి పద్యములును సభ్యుల నాకర్షించినవి. ఆయేడే కవితాసమితివారు నిర్వహించిన అపూర్వ సాహిత్య క్రమము

ఆంధ్రకవుల ఛాయాచిత్ర పటప్రదర్శనము

జరిగినది. తెలుగుదేశమున కవుల చిత్రపటములన్ని సేకరింపబడినవి. వారి స్వంత వ్రాతలను సంపాదించి ప్రదర్శించిరి. దీనికి తొలుత ఆచంట సాంఖ్యాయన శర్మ గారధ్యక్షులుగా నెన్నుకొనబడిరి. వారు హఠాత్తుగా మరణింపగా గిడుగు రామమూర్తి పంతులు గారధ్యక్షత వహించిరి. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రారంభోత్సవము చేసిరి. నేను మా శాస్త్రిగారును పాల్గొంటిమి.

(ఈ సందర్భమున ఆచంట సాంఖ్యాయన శర్మగారి ఛలోక్తి యొకటి స్మరణకు వచ్చినది. కవితాసమితివారు సాంఖ్యాయన శర్మగారి నధ్యక్షులుగా కోరగా వారు ఛాయాచిత్రపట ప్రదర్శనమునకు చిలకమర్తివారిని ప్రారంభకులుగా చేయుడు (వారు అంధులు)-గిడుగు వారిని అధ్యక్షులుగా జేయుడు(వీరికి పుట్టెడు చెముడు)" అనిరి. ఇందు వ్యంగ్యము మీరు గ్రహింపగలరు)

కవితాసమితివారు నిర్వహించిన ఆంధ్రకవుల ఛాయాచిత్రపట ప్రదర్శనము ఆంధ్ర సాహిత్య ప్రపంచమున నాటికి నేటికి మరి జరుగలేదు. స్వాతంత్ర్యము వచ్చిన వెనుక నిట్టివి పునరుజ్జీవింప జేయవలెను. అంతకు మున్నెన్నడులేని యీ ప్రదర్శనమును తొలిసారిగా కావించిన కీర్తి కవితాసమితిది. విశాఖపట్టణముది.

1939లో నేను పీఠికాపుర మహారాజావారి సమాదరమున బ్యాంకు ఉద్యోగమును వదలి శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితుడనైతిని. పిఠాపురముననే ఆ కార్యాలయముండెడిది. అచ్చటి విద్యానంద పుస్తక భాండాగార వార్షికోత్సవ సభకు 1940లో కవిగారు పిఠాపురము వచ్చిరి. వారితో గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు వచ్చిరి. అప్పటికి కవిగారు

తెలుగు తల్లిని గద్దె

నెక్కించు నుద్యమమున నిమగ్నులై యుండిరి. వారి దృష్టి ఆ యుద్యమమునందే కేంద్రీకృతమైనది. పిఠాపురము పండితులకు ముఖ్యముగా తెలుగు నిఘంటు కార్యాలయ స్థానము. నేను సభాప్రారంభమును అచ్చతెలుగు పద్యములతోనే చేసితిని. కవిగారు నాకు అచ్చతెనుగు పాండిత్యము కుదిరినందులకు చాల మెచ్చుకొనిరి. తరువాత వారు నిఘంటు కార్యస్థానమునకు వచ్చి అచ్చటి పండితులతో నిఘంటు నిర్మాణమునకు కొన్ని సూచనలు గావించిరి.

వారప్పుడు తమ తెలుగు నిఘంటువు నుడికడలి ముద్రించిన మచ్చుపుటలను నా కొసగిరి.

1942లో విజయవాడలో తిరిగి అయ్యంకి వేంకటరమణయ్యగారి సన్మాన మహోత్సవ సభలో నేను కవిగారిని దర్శించుట తటస్థించినది. ఆ సందర్భమున నొక సన్మాన సంపుటము వెలువడినది అందులో కవిగారు "మా పొత్తు" అను వ్యాసమును వ్రాసినారు. అది వారి జీవితచరిత్రకు చాలా అమూల్యమైనది.

వారి గ్రంథాలయ జీవితమంతయు పొందు పూస గ్రుచ్చినట్లు 1914నుండి 1942 వఱకు తెలుపబడినది. ఆంధ్రదేశ గ్రంథాలయ చరిత్రకు కూడ ముఖ్యమైనది. ఇందు "మారేపల్లి రామచంద్రకవి" అనియే కలదు. ఇందు సాహిత్య వ్యాసములును గలవు. నేను వాఙ్మయ విశేషములు' అన్న వ్యాసము వ్రాసితిని.

ఈ సంపుటము 742 పుటలు గల బృహద్గ్రంథము. ఇందు కవిగారిదే గాక ఇతరములైన అమూల్య వ్యాసములెన్నియో గలవు.

1943లో వారు తమ 'నుడికడలి' ముద్రణ నిమిత్తమై మదరాసు వచ్చిరి. అప్పుడు నేను మదరాసు విశ్వవిద్యాలయమున తెలుగు శాఖలో నుపన్యాసకుడుగా నుండేవాడను. ఆంధ్ర గ్రంథముద్రణమున కాలంబనమైన వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారి వద్దకు తీసికొని వెళ్ళితిని. మదరాసు విశ్వవిద్యాలయమున నుండియు తక్కినవారివలె నేను ద్రావిడ భాషావాదమును చేపట్టక సంప్రదాయ సిద్ధమైన తెలుగు పాండిత్యము సంపాదించితినని అభినందించినారు. ఇదియే నాకును వారికి చివర సమాగమము

తెలుగు స్వతంత్రభాష

"అన్నీ ఒక యెత్తూ అగస్త్యుడొక్కడూ ఒక్క యెత్తు" అను రీతిగా కవిగారి తక్కిన సేవయొక్క ఎత్తు తెలుగు స్వతంత్ర భాషగా నిరూపించుట

యొక్క యెత్తు అని చెప్పవచ్చును. సంస్కృత భాషాసంపర్కము లేనప్పుడు తెలుగు వ్యవహారములో నున్నది. అప్పుడు తెలుగువారు సంస్కృతభాషా సాహాయ్యము లేనిదే వ్యవహరించి, తమ తెలుగుదనమును నిలుపుకొన్నారు, నేటికిని పల్లెలలో సంస్కృతభాషా ప్రసక్తిలేక తెలుగు వ్యవహరింపబడుచుండగా తెలుగు సంస్కృతభాషాజన్యమని, ద్రావిడభాషాజన్యమని అనరాదని కవిగారఖండ పరిశ్రమ చేసి "తెలుగుభాష స్వతంత్రభాష" అని సిద్ధాంతము ప్రతిపాదించిరి. దానికొఱకు తమ మనుగడను ధారపోసిరి. వారి తెలుగు తోబుట్టువులు" ఆధునిక భాషా శాస్త్రములలో చిన్నదైనను విలువ గల గ్రంథము. ద్రావిడభాషావాదులు తెలుగు ద్రావిడభాషా జన్యమనగా కవిగారు ద్రావిడభాష తల్లికాదు–తెలుగు తోబుట్టువు–అనగా, తెలుగుతో పుట్టినది అని సోపపత్తికముగా నిర్ణయించినారు. ఇది తెలుగు భాషా చరిత్రలోనొక నూతన ప్రతిపాదన.

కవిగారు నిత్యము వాడుకలోనున్న సంస్కృత పదములకు తెలుగు పదములే వాడెడివారు. "శ్రీ" అనుదానికి మేక" అని సేవకుడు అనుదానికి 'కొలువరి' అని వాడెడివారు. వారి రచనలకు తెలుగుపేర్లే పెట్టిరి ఇతరులకు వ్రాసినపుడు 'తెలుగుతల్లి తొలి కొలువరి' అని వ్రాసెడివారు. వారు కవీశ్వరునికి 'కయిసరి' అని వాడిరి. నేనును నా మంచుపల్లి అన్న పద్య కావ్యములో నీ పదమును ఇతరములైన కవిగారి తెలుగు పదములను వాడినాను. కళాప్రపూర్ణులు చిలుకూరి నారాయణరావుగారు దానిని సమీక్షించుచు

"యు ఆర్ మచ్ ఇన్‌ఫ్లుయన్స్‌డ్ బై అవర్ మారేపల్లి కవిగారు" అని వ్రాసినారు.

ఇంతకన్న మా ప్రగాఢ పరిచయమును గూర్చి నేనేమి వ్రాయగలను? అయిన, మఱికొన్నింటి నుట్టంకించి విరమింతును.

నాటకరచన

ఆంధ్ర నాటక చరిత్రమున కవిగారికొక విశిష్టస్థానము గలదు. వారు నటులుగా, నాటక సమాజ స్థాపకులుగా నాటక కర్తలుగా ప్రసిద్ధి గడించిరి. నటులుగా వీరు ధరించిన పాత్రలలో శ్రీకృష్ణుడు, ధర్మరాజు, అర్జునుడు ముఖ్యములు. కవిగారు నటనశిక్ష నిచ్చుటయందు సిద్ధహస్తులు. ఎట్టి మొద్దునైనను చక్కని నటుడుగా తీర్చిదిద్దగల శక్తి వీరియొద్ద నుండెడిది. కళాభిలాషక నాటక సమాజము 1895లో స్థాపించి విజయవంతముగా నడిపించినారు. వీరు మొత్తము ముప్పది నాటకములు రచియించినారు. వానిలో కొన్ని అసంపూర్ణములు. అందు ముద్రితములైనవి రెండు. 1. బిల్హణీయము 2. పారిజాతాపహరణము. వీరి నాటకములు పాటలతోను పద్యములతోను సులభ సుందరశైలిలోనుండి ప్రదర్శన యోగ్యములై సామాజికుల నాకర్షించెడివి. ఇట్లు నాటక రచనము నాటక దర్శకత్వము, పాత్రధారణము మూడు విశేషములు మూర్తీభవించిన నాటిక రచయితలు ఆంధ్ర నాటక చరిత్రలో వ్రేళ్ళపై లెక్కపెట్టదగినవారు మాత్రమే కలరు.

నటకులనేగాక నాటక రచయితలను ప్రోత్సహించుట కవిగారిలో విశేషము. విశాఖపట్టణమున నామండలమున ప్రచారము చెందిన 'జయంత జయపాలము' అను నాటకము రచించిన ఆకెళ్ళ సూర్యనారాయణ కవిగారి శిష్యుడు. కవిగారి ఆదేశమున నితడు షేక్స్పియరు ఒథెల్లో నాటకమును, జయదేవు అను పేరితోనను వాదము గావించినాడు. ఈ నాటక ప్రదర్శనములను రెండింటిని నేను చూచినాను.

వేశ్యలకు పడుపువృత్తి మాన్పించుటకు 'సంగీతమానినీ సమాజము'ను స్థాపించి వారిచే నాటకములాడించి, స్త్రీలచే నాటకములాడించిన ప్రథమవ్యక్తి కవిగారేయన్న కీర్తి నార్జించినారు. స్త్రీ పాత్రలను స్త్రీలచేతనే ప్రదర్శింపజేసిన సురభి నాటక సమాజమునకు వారు నాటకములు వ్రాసి యిచ్చినారు.

ప్రాచీనకావ్య పరిష్కరణము

కవిగారి సాహిత్య జీవితములో పేర్కొనదగినది ప్రాచీన కావ్య పరిష్కరణము. విశాఖపట్టణము, శారదామకుటము ముద్రాక్షరశాలాధిపతులు విన్నకోట అప్పలనరసింహులు శ్రేష్ఠిగారు–మహాభారతము–ఆదిపంచకము స్వల్పధరతో అందజేయుటకు ప్రయత్నించినపుడు శ్రీ కవిగారు దానికి పరిష్కర్తలుగా నుండి అది వెలువడునట్లు తోడ్పడిరి. వారా పరిష్కరణమున పాఠ భేదములు కూడ చూపుట విశేషము. దీనిని ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు తమ సంశోధిత మహాభారత ముద్రణమున పేర్కొన్నారు.

విదేశవస్త్ర బహిష్కారము

గాంధీమహాత్ముని యుద్యమమునకు ముందే వారు విదేశవస్త్రబహిష్కారము ప్రారంభించిరి. 1913 వ సంవత్సరమున ప్రకటింపబడిన ఆంధ్రపత్రిక–ఉగాది సంచికలో వారి చిత్రము చూడవచ్చును. ఉపాధ్యాయ వృత్తితో, కోటు పాగా ఉత్తరీయముతో నున్నది. మతస్వాతంత్ర్యము కొఱకుద్యోగమునకు స్వస్తి చెప్పినారు. ఆ వేషమును [illegible] మార్చినారు. పంచె, ఉత్తరీయము రెండే ధరించెడివారు. అవియును [illegible] ములమీద నేసినవే. ముఖ్యముగా పొందూరు నూలుబట్టియే ధరించెడివారు. వృత్తి విసర్జన తరువాత వారెన్నడును మిల్లు నూలు బట్ట ధరింపలేదు.

ఆంగ్లభాషా బహిష్కారము

నేను నా పరిచయంలో కనిపెట్టిన విషయమిది. వారితో సన్నిహితులగు వారును దీనిని గుర్తించిరో లేదో నాకు తెలియదు. పూర్వము కొక్కొండవారివలె గ్రాంథికభాష మాట్లాడకపోయినను వారు ఆంగ్ల పదములను వ్యవహారమున నుపయోగింపలేదు. "కాలమెంతైనది" అనువారు గాని "టైమెంతయినది" అనువారు కాదు.

స్వరూప స్వభావములు

కవిగారు మితభాషులు, గంభీరులు. అనవసరముగా నొక్కమాటయు నాడువారు కారు. వారు దృఢగాత్రులు చిన్నప్పుడు శరీర వ్యాయామం చేసినవారు. అందుచే వారి దేహము కమ్మచ్చున దీసినట్లుండెడిది. వారు కత్తిసామునందు ప్రవీణులు.

వారి నిత్యజీవితము పరిమితము. వారెన్నడు మంచముపై శయనించి యెఱుగరు. ఈ విషయమును వారు తమ షష్టిపూర్తి సన్మానసభలో వెల్లడించినారు. వారు భాషయందేగాక ఆహారమున మితవాదులు. బహు జాగరూకులు. అన్నము వండుటకు ముందు బియ్యమును కళ్ళజోడు పెట్టుకొని పరీక్షించి వంటకు ఇచ్చువారు. సర్వవిధముల ఋషివలె కవిగారు జీవితము గడపినారు.

కవిగారు తెలుగు ఋషి

1938లో వారి షష్టిపూర్తికి ముందొక సమావేశములో వారు తమకు ఆ సంవత్సరంలో అరవై యేండ్లు నిండినవి అని ప్రశంగ పశమున తెలిపిరి. నేనును మా గంటి శాస్త్రిగారును అత్యాశ్చర్యము నొందితిమి. "ముప్పది నలుబదేండ్లవాని వలెనున్నారే కవిగారికి అరవైయేండ్లు నిండుటేమి" అని మా భావన.

## అధోజ్ఞాపికలు :-

1. మానవల్లి రచనలు–పుట 45. ఇందు మన కవిగారి ప్రస్తావన గలదు.
2. ఆ కాలమున నించుమించుగ ప్రతి ఇంటను రవివర్మ చిత్రము లుండెడివి.
3. శ్రీనివాసయ్యంగారానాడు కళాశాలాధ్యక్షులుగా నుండెడివారు–వారి మేధా విశేషమును గూర్చి మా చిన్నతనమున కథలుగా చెప్పుకొనెడివారు.
4. మేము, హిందూ పఠన మందిరము ప్రక్క దూర్వాసులవారి మేడనానుకొని యున్న సందులో తుమ్మలపల్లివారి యింటనుండెడివారము.
5. విశాఖపట్టణమున నారెండేండ్లలో ప్రవర్తిల్లిన స్వాతంత్ర్య సమర చరిత్ర యంతయు 1969 మహాత్ముని శతజయంతి సందర్భమున నేను సమర్పించిన "గాంధీ సాహిత్యము" అను గ్రంథమున వ్రాసియున్నాను. అది ముద్రితము కావలసి యున్నది.

**పేశరణ : శ్రీ ద్వా. నా. శాస్త్రి**

# గుండె చప్పుళ్ళు

## కొడవంటి కాశీపతిరావు

కీచురాళ్ళు గీమని తెంపు లేకుండా అరుస్తున్నాయి. ఆ అరుపు వింటుంటే అప్పటికే మనసులో వున్న గాభరా పదిరెట్లుగా పెరిగిపోతూంది. గుమ్మాని కెదురుగా కుర్చీ వేసుక్కూచున్న నాకు గుమ్మంలోంచి వీధిలోకి చూస్తూంటే అంతా చీకటే కన్పిస్తూంది. ఆ చీకటి చూస్తున్న కొద్దీ పదిరెట్ల గాభరా గబ గబా ఇరవై రెట్లయి పోతూంది.

"అవునే...సత్యవతీ...వీడింకా రాలేదేవిటి " అనడిగేను నా గాభరా సణుచుకోవడానికి.

"వెర్రి వెధవ.... ఎప్పుడే ఊరెళ్ళినా చీకటి పడకముందే వాలేవాడింట్లో విశాఖపట్నం వెళ్తే మరీన్నూ... ఈ రోజు ఏనిటో ఇంకా రాలేదు..." వెర్రి వెధవ పేరు చెప్పి నాకు మరింత వెర్రెక్కిస్తున్నాది.

"సరాసరి...వచ్చేస్తాడులేగాని...నువ్వెళ్ళి పడుకో... నేనిక్కడే మంచం వేసుకుని నడుం వాలుస్తాను." అంటూ లైటార్పేసేను.

నాకు మాత్రం దాని సొదకంటే కీచురాళ్ళ రొదే నయమని పించింది. ఆ క్షణానికి, కాని అది వెళ్ళిపోయి దాని మా నాన్న ఆ దిటో కురుపెట్టు కుంటూ పడుకునేసరికి మళ్ళీ వీడి మీదికి ధ్యాస మళ్ళింది.

నా కొడుకని చెప్పడం కాదుగాని భార్గవది అచ్చం నా పోలికే. మనిషి రూపురేఖల్లోనేకాదు. గుణగణాల్లో కూడాను. పాళాబంగారం. అందుకే ఎవడెత్తుక పోతాడేమోనని కాదూ ఈ గాభరా అంతానూ.



ఎమ్మే చదువుకున్నాడు. వయసొచ్చింది. వాడి మావయ్య విశాఖపట్నంలో ఏదో సంబంధం చూసేడు. పిల్లనిచ్చి పెళ్ళిచేయడమే కాకుండా ఉద్యోగం వేయించు కుంటార్ట.

వాడి ఉద్యోగం కోసం ఎన్ని పుర్రాకులు కుడుతున్నాడు! బిసీ అని, ఏబీ సీడీ లనీ, ఎస్సీ అనీ ఎస్టీ అదీ అన్నింటికీ ఇన్నిన్ని పంచేస్తే మిగిలే పోస్టులెన్ని? అయితే భగవంతుడు మనయందు ఉండ బట్టీ, గొప్ప పుటక పుట్టాడు గాబట్టీ... ప్రభుత్వం కూడా మనదే గాబట్టి ఏ సిఫారసుల్తోనో ఉద్యోగం సంపాయించీ గల్డు. ఆ సదుపాయం ఆ ఎస్సీలకేదీ?

ఇకపోతే ఏ సంబంధం ద్వారానైనా కట్నం చేతికొస్తే పిక్సుడులో వేయిం చేసెయ్యాలనీ అసలు వాడివైనా వడ్డీతో మా ముసలి ప్రాణాలు రెండు కాలక్షేపం చేసెయ్యాలనీ వుంది. కాని బావమరిది విశాఖపట్నం సంబంధం గురించి ఓ మహా ఇదిగా చెప్పేడు. మరందుకే కదా ఇష్టం వున్నా లేకపోయినా భార్గవని పంపించేను.

ఏ వేళ కొస్తాడో ఏమో...హాయ్ .. అని అవలింతలు తీసుకుంటూ నడవ లోనే నడుం వాల్చేను. అంతే నిద్రపట్టేసింది,

ఎవరోలేపుతూంటే ఉలిక్కిపడి నిద్రలేచేను, మంచి నిద్రలో లేచేనేమో గుండెలు దడదడమంటున్నాయి. దానికి తోడు ఎదురుగా మా వాడి ఫ్రెండు రాంబాబుని చూసేసరికి గడగడలాడిపోయేను. చుట్టూ చూస్తే తెలతెలవారుతోంది? తెల్లారినా భార్గవ రాలేదన్న నిజం ముందు కనిపించగానే మరింత గాభరా పడిపోయేను.

"ఏవిరా...రాంబాబూ తెల్లారే వచ్చేవు?" అనడిగేను ఆత్రుతగా

"మీ వాణ్ణెవరో హైజాక్ చేశారండీ..." అన్నాడు.

వాడేం విమానవా... బస్సా... హైజాక్ చేసీడానికి అని ఒక్క లిప్తపాటు తమాషాగా నవ్వుకున్నా... వాడంత కన్నా విలువైనవాడు. పాళాబంగారం. అలాంటి వాణ్ణెవరో ఎత్తుకుపోయారని అర్థం కాగానే నిద్రమత్తు జారిపోయింది.

"ఏమిట్రా నువ్వు చెప్తున్నదీ...సరిగా చెప్పేడువు..." అన్నాను.

"నిన్నను...రాత్రి పది గంటల బస్సులో మీవాడు తిరిగొస్తున్నాడట.... మా పిన్ని విశాఖపట్నం పెళ్ళికి వెళ్ళిందలెండి. ఆవిడా ఆ బస్సులోనే వుంది. తగరపు వలస దాటేక ఓకమ్మాయి బస్సు నాపేసిందిట. ఆపేసి భార్గవని బల వంతాన దింపేసిందిట. వీడికీ ఆ అమ్మాయికీ ఘర్షణ కూడానట. తను రానని వీడు మొండిపట్టూ... నువ్వు రాకపోతే బస్సు కదల్దని ఆ అమ్మాయి బెదిరింపూ నట. చివరికి మీ నుండి మా కాలక్షేపమై పోతూంది. దిగవయ్యాబాబూ అని ప్రయాణీకులే దించేసేరుట," అని టాలతో వివరించేడు.

"ఓరి నీ అఘాయిత్యం కూలిపోనూ... అమ్మాయిలు అబ్బాయిల్నెత్తుకు పోవడమేవిటి కలికాలం కాకపోతే. .." అన్నాను బేజారుగా "అయినా ఆ అమ్మాయి ఎవరంటావురా రాంబాబూ..." అనడిగేను.

"అదే నాకూ తెలియకుండ వుందండి .. అమ్మాయిలంటే ఆమడ దూరం పోతాడు. ...అలాంటి వాడిని కాకపోతే నాలాంటి వాడి నెత్తుకపోకూడదూ...." అంటూ నవ్వి "వాడికా అమ్మాయి ఏ మాత్రం తెలిసి ఉండకపోతే అంత అధి కారంతో బస్సు దింపేస్తుందీ?" అన్నాడు రాంబాబు.

నిజవే అనిపించింది. కాని ఏం చేయాలో తోచలేదు.

"పోలీసు రిపోర్టు ఇద్దామంటరా?" అని రాంబాబు ఆలోచన చెప్పేడు.

అంత వరకు వెర్రిదానిలా మా ఇద్దరి ముఖాలు మార్చి మార్చి చూస్తున్న మా ఆవిడ అప్పటికి మాత్రం నోరువిప్పి బొంగురు పోయిన గొంతుతో "ఆ పని వెంటనే చెయ్యండి బాబూ" అంది,

గాభరా నన్ను నిబ్బళ్ళచోట నిలవనీయడం లేదు. నిజవే కాని కొట్టింత కుర్రాడు. ఏవని రిపోర్టు చేస్తాం? సబవేమీ కన్పించలేదు.' చూద్దాం. ఏ టైముకైనా రాక పోతాడా?

"చూద్దాంరా....రాంబాబూ ఏదైనా పనిమీద వెళ్ళాడేమో....తొందరపడి పోలీసు రిపోర్టిస్తే అభాసవుతుంది..." అన్నాను

"ఏం పనండి బాబూ... ఓ అమ్మాయి దింపేసిందని నేను చెబుతుంటేనూ...." అన్నాడు విసుగ్గా రాంబాబు.

"సరే అమ్మాయే దింపేసింది....కాని ఆ అమ్మాయింట్లో ఎన్నాళ్ళుంటాడూ వాళ్ళెంతకాలం ఉంచుకోగలరు;"

మీ ఖర్మ అన్నట్టు నావేపు ఓ చూపుచూసి వెళ్ళిపోయాడు రాంబాబు.

ఇంక మొదలెట్టింది,

"ఇదేం ఖర్మరా నాయనా....చీకటి పడితే ఎక్కడా ఉండని వాడివి.... ఏం చేస్తున్నావురా తండ్రీ .. "

"ఊరుకోవే .. అయ్యో ఊరుకోమంటూంటే....వాడేమైనా ఆడపిల్ల గనకనా నా మానమర్యాదలు పోతాయని భయపడ్డానికి. వెళ్ళు వెళ్ళు—వంట ప్రయత్నం చూడు...ఆకలిమీద వస్తాడేమో...." అన్నాను.

అస్త్రం పనిచేసింది

కాని నా మనసు మనసులో లేదు. గుండె గుండెలో లేదు. నాకు తెలుసు వాడచ్చం నా పోలికేనని. వాడేం ఆడపిల్లకాదని సరిపెట్టేసేను కాని ఆడపిల్ల మనస్తత్వం వాడిది.

కళ్ళు మూసుకున్నాను

భగవంతుని ప్రార్థించేను మౌనంగా

"వాడు శుభంగా సుఖంగా తిరిగొస్తే తల నీలాలు సమర్పించుకుంటాను స్వామీ..." అని కూడా బేరం పెట్టేను.

మరంచేత మనసు ఊరట చెందింది.

లోపలికి వెళ్ళి స్నాన పానాదులు ముగించుకొని బయటకు వచ్చి చూద్దును. గుమ్మం దగ్గర వెంకటరమణమూర్తి సాక్షాత్కరించేడు పద్మావతితో కూడా.

ఇదేమిటీయన దిగబడ్డాడు. మా వాడు తిరిగి రావాలని కదా ప్రార్థించేను. ఈయనిలా అర్థం చేసుకున్నాడేమిటి కొంపదీసి....అనుకుంటూనే తేరిపారచూసేను గుమ్మం ఫ్రేము కట్టినట్టు బారెడు బారెడు పూలదండలు వేసుకుని... ఇంత లింతలు కళ్యాణ తిలకాలతో నిలబడి వున్నాడు. కాని...

వెంకటరమణమూర్తిలా లేడే. మా భార్గవ పోలికలు కనిపిస్తున్నాయి. వాడేనా? అవును వాడే.

ఓ క్షణం ఆనందం ఉప్పొంగిపోయింది. అంతెత్తున పొంగిన కెరటాలూ వెనక్కి గబగబా తీసేసేయి.

వీణ్ణి పెళ్ళి చూపులకు వెళ్ళి రమ్మన్నానా.... పెళ్ళి చేసుకు రమ్మన్నానా.... ఒసేవ్ సత్యవతీ ...ఇలా వచ్చి చూడు... "అని ఓ గావుకేక పెట్టేను గాభరాతో.

అది లోపలినుండి పరిగెత్తుకువచ్చి...."నా బాబే...నా బంగారుకొండే..." అంటూ ఆనందంతో వాణ్ణి తడుముతూంది.

"నీ కొడుకు బంగారమే గాని....ఆ ప్రక్కనున్న దెవరో కాస్త చూడు...." అన్నాను కాస్త కటువుగా.

"మహాలక్ష్మిలా వుందండీ...." అంటూ మెటికలు విరిచింది

"ఏవిరా....ఏవిటి వాలకం .. " అని అడిగేను.

"అవున్నాన్నగారూ...పెళ్ళి చేసుకున్నాను రాత్రి.

"కనిపిస్తూనే వుంది గానీ...ఎవరూ... ఏవిటీ....ఎంత కట్నం....ఎవరు చేసేరు... మీ మావయ్య సంగతేవిటీ...." అంటూ ప్రశ్నల వర్షం కురిపించేను.

"మావయ్య వైజాగులో వున్నారు. ఆయన చూసిన సంబంధమూ అక్కడే వుంది! ఈ అమ్మాయిది దగ్గర పల్లెటూరు, వీళ్ళ నాన్న ఓ రైతు. కట్నాలు కానుకలూ ఏవీలేవు. ఇద్దరమూ ప్రేమించుకున్నాము. ఈ విషయం చెప్తే మీ




కర్థంకాదు అని ఇలా పెళ్ళిచేసుకు వచ్చేను...." అన్నాడు మొహంమీద గుద్దినట్టు.

మరి మా గతేవిటి? వాడుద్యోగంచేసి తెచ్చిన రాళ్ళతో మమ్మల్ని మాస్తాడా ఏవన్నానా....కట్నం డబ్బుతో కాలం గడుపుతున్నాం అని తప్పు కోపడం ఎంత దర్జాగా వుంటుందీ....వీడికెలా అర్థం అవుతుంది.

నా మనసులోని మాటలు చదివేసి నట్టున్నాడు.

"కొడుకు తెచ్చిన కట్నంతో కాలం గడుపుదామనుకోవడం దారుణం నాన్నగారూ.... అభిమానం కలిపిన అన్నం పెట్టి పెంచేరునన్ను. అటువంటి మీకు ఒకర్నిపిండి తెచ్చిన రక్తపుకూడు తినిపించలేను. నా కొడుకు నన్ను పువ్వుల్లో పెట్టుకు చూస్తున్నాడని దర్జాగా చెప్పుకునేట్టు చేస్తాను. నన్ను నమ్మండి నాన్నగారు...." అన్నాడు వాడు.

"ఆఁ ఇంతవరకూ ఉద్యోగానికి తికాణాలేదు గానీ...." అన్నాను ఈసడిస్తూ.

"వైజాగు వెళ్ళింది ఉద్యోగ ప్రయత్నము కోసమే నాన్నగారూ. మావయ్య దగ్గర కాకుండా మా ఫ్రెండు దగ్గరికి వెళ్ళి ప్రయత్నించేను. ఈ వారంలో ఆర్డర్సు వస్తాయి. అమ్మా నువ్వైనా నాన్నగారికి బోధపడేట్టు చెప్పమ్మా..."

ఇదొకటి....నాకు చెప్పేది.

"కట్నం గుంజాలనే చూస్తున్నారు గానీ...లేనిపోని తంతుల గురించి ఆలోచించేరు. మధ్య తరగతి మెహర్బానీలకు చేసే ఖర్చులన్నీ వీడు తగ్గించేడు. పెళ్ళిళ్ళతో అనారోగ్యంతో పాటు అప్పులభారాన్ని ఇప్పటివాళ్ళు పెంచుకుంటున్నారు. అటువంటిది ఎంతో ముందు చూపుతోనూ ఆదర్శంతో పెళ్ళి చేసుకున్నాడు. మన ముసలిపొట్టలకి ఎంత కావాలండీ... ఆ పాటిదానికి వీడు చూడడని ఎందుకనుకుంటున్నారూ..." అంటోంది సత్యవతి.

ఎందుకో తెలియకుండా కళ్ళు మండుతున్నాయి. అది కన్నీళ్ళకు సూచన అని తెలిసే లోపల నా కళ్ళని ఎవరో మెత్తగా తాకుతున్నారు. ఆ మృదువైన స్పర్శ నా గుండెని తాకింది. కిందికి చూస్తే వీడూ, ఆ పిల్లా నా కాళ్ళకు నమస్కరిస్తూ మసగ మసగ్గా కన్పిస్తున్నారు.

శ్రీ పెదారము చెన్నారెడ్డి

# కురుక్షేత్రం గూర్చి జైనుల కథనం

నన్నయ భారతం ప్రకారం దుష్యంతుని కుమారుడు భరతుడు, అతడు "అతీతానాగతులైన నిజవంశంబున రాజులకెల్ల వంశకర్త యైనాడు" (ఆది 4-110) అతని కొడుకు భుమన్యుడు, అతని కొడుకు సుహోత్రుడు, అతని కొడుకు హస్తి అతని పేర హస్తినాపుర వికుంఠనుడు. అజమీఢుడు. సంవరదుడు కుమారుడు. ఇతని పేర కురుక్షేత్రం వెలసింది. కురుక్షేత్రం ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైన పుణ్యతీర్థంగా భావింపబడుతున్నది. దీని చరిత్రను గూర్చి జైన, వైదిక, బౌద్ధ సాహిత్యాలలో విపులంగా వర్ణించినారు. ఇది ఢిల్లీకి 67 మైళ్ళ దూరంలో మీరట్ వద్ద ఉంది. మనదేశానికి "భారత వర్షం" అనే పేరు దుష్యంతుని కుమారుడైన భరతుని పేర వచ్చిందని ప్రతీతి. కాని భాగవత పురాణాన్ని బట్టి జైన ప్రథమ తీర్థంకరుడు ఋషభ దేవుని జ్యేష్ఠపుత్రుడు భరత చక్రవర్తి పేర ఈ దేశానికి భారత వర్షం అనే నామం సిద్ధించింది, (భాగవత, స్కంధం 11, అధ్యాయం 2) ఈ అభిప్రాయాన్ని "వసుదేవ హిండి" అనే అత్యంత ప్రాచీన జైన గ్రంథం కూడా ధృవపరుస్తుంది, (ప్రథమ ఖండం-పుట 186) దీనిని బట్టి దుష్యంతుని కుమారుడైన భరతునికి ఋషభదేవుని జ్యేష్ఠపుత్రుడైన భరతునికి మధ్య కొన్ని లక్షల సంవత్సరాల అంతరం ఏర్పడుతుందని జైనుల అభిప్రాయం. ఋషభదేవుని జేష్ఠపుత్రుడు భరత చక్రవర్తి దుష్యంతుని కుమారుడైన భరతుని కంటె చాలా పూర్వుడని అర్థం.

నాభి పుత్రుడైన ప్రథమరాజు ఋషభదేవుడు, అతనికి నూర్గురు కొడుకులు. వారిలో ఒకరి పేరు కురు. భారత వర్షములో ఈ కురు అనే పేరునే 'కురు' దేశం విఖ్యాతి చెందింది. బౌద్ధులకు చెందిన 16 జనపదాలలో 'కురు'ను మహా జనపదంగా లెక్కించినారు. పాళి సాహిత్యం ప్రకారం దీని విస్తీర్ణము 8 వేల యోజనాలు. జైనాగమ సూత్రం ప్రకారం కురు ఒక ఆర్య దేశంగా గుర్తింపబడింది. కురు దేశానికి సంబంధించి కురు జనపదం, కురుజాంగల దేశం, కురుక్షేత్రం, కురు రాష్ట్రం మొదలైన పేర్లు ప్రాచీన సాహిత్యంలో లభిస్తాయి. జైనాగమ సూత్రంలో ఈ కురుక్షేత్ర రాజధానిని గజపురం అని చెప్పినారు. జైనాగమాలలో ఒకటైన ప్రజాపన సూత్రం ప్రకారం కురుక్షేత్ర రాజధాని గజపురం (హస్తినాపురం) ఠాణాంగ సూత్రం ప్రకారం భారతవర్ష ప్రసిద్ధ రాజధానులలో ఒకటి హస్తినాపురం. వివిధ తీర్థ కల్పాలలో హస్తినాపుర సంస్థాపకుడు ఒక కురు పుత్రుడు. అతని పేరు హస్తి. ప్రాచీన సంస్కృత ప్రాకృత పాళి అపభ్రంశ, హిందీ, సాహిత్యాలలో ఈ నగరానికి వేర్వేరు పేర్లు ఇవ్వబడినాయి, గజపుర, గయఉర, గయనయర, గజనగర, గజాహ్వ, గజసాహ్వాయ, హతినాఉర. హత్థినాపుర, హస్తినాపుర, హస్తిగ్రామ, నాగాహ్వయ, నాగసాహ్వ. నాగపుర, హస్తినాపుర, ఇవి కాకుండా ఆసందిపథ లేక ఆసందివత, బ్రహ్మస్థల అనే పేర్లు కూడా ఇవ్వబడినాయి.

హిందువుల అభిప్రాయాన్ని బట్టి త్రేతాయుగంలో ప్రధాన రాజధాని అయోధ్య, ఈ యుగంలో ప్రధాన రాజధాని ఢిల్లీ; ఆ విధంగానే ద్వాపర యుగంలో ప్రధాన రాజధాని హస్తినాపురం. ప్రాచీన హస్తినాపురం గంగానదికి దక్షిణ-పశ్చిమ తీరంలో ఉండేది. జైన గ్రంథము వాసుదేవ హిండిని బట్టి వివిధ తీర్థ కల్పాలను బట్టి కూడా హస్తినాపురం గంగానదీ తీరానే ఉండేది, కాని గంగానది దిశ మారుతూ వచ్చినందువల్ల దాని పూర్వ ధార హస్తినాపురానికి సుమారు 9 మైళ్ళ దూరంలో ఉండిపోయింది. మహాభారత కాలంలో హస్తినాపురం భారతదేశంలో అత్యంత ప్రసిద్ధ నగరంగా ఉండేది. జైనాగమాల ప్రకారం భారతదేశంలో ఆది నగరాలైన అయోధ్య, కాశీ నగరాలతో బాటు గజపురం (హస్తినాపురం) కూడా నిర్మింపబడింది. జైన ప్రథమ తీర్థంకరుడైన ఋషభదేవుడు భోగ భూమి (అ కర్మభూమి)ని కర్మభూమిగా మార్చిన కాలం ఇది అని జైనుల విశ్వాసం. అసి (శస్త్రము) మసి(చదవటం వ్రాయటం)కృషి (వ్యవసాయం) ఇవిలేని లోటు అంటే కల్పవృక్షాలతోనే అన్ని లభించే చోటు అని అర్థం. దీనిని జైనులు కర్మ భూమి అంటారు, ఏ పనీ చేయకుండా తమ అవసరాలన్నీ తీరే చోటు అని దీని అర్థం.

ఋషభదేవుడే ఆర్యావర్తానికి ప్రథమ రాజని జైనులంటారు. ఇతని జ్యేష్ఠ పుత్రుడైన భరతుని పేర దీనికి భారత వర్షమనే నామము సిద్ధించింది. ఋషభదేవుడు అయోధ్యను తన రాజధానిగా చేసుకున్నాడు. ప్రపంచంలో తొలిసారిగా సామాజిక వ్యవస్థను రాజకీయ వ్యవస్థను కల్పించినాడు. మానవ నాగరికత అతనితోనే ప్రారంభమైనదని జైనుల విశ్వాసం. అతనికి నూర్గురు కొడుకులు పుట్టినారు. ఆర్యావర్తాన్ని అతడు నూరు భాగాలుగా చేసి ఒక్కొక్క కొడుకును ఒక్కొక్క భాగానికి రాజ్యాధికారిగా చేసినాడు. జ్యేష్ఠపుత్రుడైన భరతునికి అయోధ్యను, అతనికంటె చిన్నవాడైనా బాహుబలికి తక్షశిలను, కురుకు కురుక్షేత్రాన్ని అప్పగించినాడు. (కల్ప సూత్ర సుబోధిక-సవ్యాఖ్యానం-పుట 174) తాను ఆధ్యాత్మిక ధర్మప్రచారానికి రాజ్యత్యాగం చేసి నిర్గ్రంథ (సన్యాసి) దీక్ష గైకొన్నాడు. అతనికి 4000 మంది అనుయాయులు తయారైతే వారిలో అతని పుత్రులే 98 మంది. ఈ కాలంలో తొలిసారిగా ముని విహారం ప్రారంభమయింది. ఈ కారణాలవల్ల ఋషభదేవుడు అంతిమ మనువు, ఆదిరాజు, ఆదినాథుడు, ఆదిమానవుడు, ఆదిదేవుడని జైనులు వర్ణిస్తారు.

ఇట్లు కురుక్షేత్ర రాజ్యం బాహుబలి అధికారంలోనికి వచ్చింది. అతనికి తక్షశిల హస్తినాపుర రాజ్యం లభించినట్లు జైన గ్రంథం "వసుదేవ హిండి" లో పేర్కొనబడింది. "బాహుబలి", "హత్థినా ఉర తక్షసిలాసామి" అని ఆ గ్రంథంలో లిఖింపబడింది. (పుట 186 ఖండం-1) భరతుడు చక్రవర్తిపదవిని పొందడానికై తన తమ్ముడైన బాహుబలితో యుద్ధం చేసినాడు. కాని అతడు బాహుబలిని జయించలేకపోయినాడు. అప్పుడు బాహుబలి తన అన్న అయిన భరతుని పితృతుల్యుడుగా భావించి, అతనికి తన రాజ్యాన్ని సహర్షంగా అర్పించినాడు. అతడు కూడా సన్యాస దీక్ష గైకొన్నాడు. అప్పుడు చక్రవర్తియైన భరతుడు బాహుబలి పుత్రుడైన సోమ ప్రభుని బాహుబలి రాజ్యానికి అధికారిగా చేసినాడు తాను చక్రవర్తియై భారత క్షేత్రానికి ఏకచ్ఛత్రాధిపత్యం వహించినాడు. అయోధ్యను తన రాజధానిగా చేసుకొని రాజ్యపాలన గావించినాడు.

ఋషభదేవుడు నన్నూరు దినాలు ఉపవాసం ఉన్నాడు. ఆర్య-అనార్య దేశాలన్నింట సంచరించి, హస్తినాపురానికి వచ్చినాడు. అప్పుడు బాహుబలి పుత్రుడు సోమప్రభ-సోమయశుడు రాజ్యం చేస్తున్నాడు అతని కుమారుడు శ్రేయాంస కుమారుడు అతని అనంతరం రాజ్యాధికారి కానున్నాడు. ఋషభదేవుడు హస్తినాపురానికి వచ్చినట్లు తెలిసింది. ప్రజలందరు ఉత్సాహంగా ఉన్నారు. శ్రేయాంస కుమారుడు తన పితామహుని చూడటానికై లేవబోతూ

ఉండగా, అతడే వచ్చినాడు. ఋషభదేవుడు అంతవరకు ఉపవాస దీక్ష చేస్తునే ఉన్నాడు. శ్రేయాంస కుమారుడు ఇక్షురసం తెచ్చి ఇయ్యగా: అతడు స్వీకరించి పారణ చేసినాడు. నాటి నుండి జైనులలో సార్వజనిక దాన సంప్రదాయం మొదలు అయింది. అది హస్తినాపురంలో శ్రేయాంస కుమారునితో ప్రారంభ మయింది.

జైన పరంపరను బట్టి, భారత క్షేత్రానికి పన్నెండుగురు చక్రవర్తులు అయినారు. వీరిలో నాలుగవ, అయిదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ చక్రవర్తులకు - అంటే ఆరుగురు చక్రవర్తులకు హస్తినాపురమే రాజధాని. నాల్గవ చక్రవర్తి సనత్కుమారుడు, ఐదవచక్రవర్తి శాంతినాథుడు, ఆరవ చక్రవర్తి కుంథునాథుడు, ఏడవ చక్రవర్తి అరనాథుడు, ఎనిమిదవ చక్రవర్తి సభూముడు, తొమ్మిదవ చక్రవర్తి మహాపద్ముడు, వీరందరూ హస్తినాపురంలోనే పుట్టినారు. ఇక్కడెంతో మంది మునులు సన్యాస దీక్షను పొందినారు. భగవాన్ నేమి నాథుని కాలంలో కౌరవ పాండవుల రాజధాని హస్తినాపురమే, వీరి జన్మభూమి, క్రీడా క్షేత్రం కూడా ఇదే. మహా భారత యుద్ధం ఇక్కడే జరిగింది. జమదగ్ని కుమారుడు పరశురాముడు ఈ నగరంలోనే పుట్టినాడు. ఇతడు విద్యాధరునివద్ద పరశు విద్య నేర్చింది ఇక్కడే. తరువాత గోహారక అనంతవీర్యుని వధించినాడు, తన తండ్రిని చంపిన కృతవీర్యుని (కార్తవీర్యార్జునుని) చంపినాడు. ఈ మహాక్రోధి ఇరవై ఒక్కమార్లు దండెత్తి దేశాన్ని క్షత్రియ శూన్యంగా చేసినాడు. ఇదంతా భగవాన్ మహావీరునికి పూర్వ చరిత్ర.

దిగంబర జైన సంప్రదాయ అనుశ్రుతిని బట్టి రక్షాబంధనం లేక శ్రావణీ మహాపర్వ ప్రచారానికి ఒక ఘటన ప్రారంభమైంది. ఈ ఘటన హస్తినా పురంలోనే జరిగింది. అకంపనాచార్యుని ముని సంఘం పట్ల బలిచక్రవర్తికి ద్వేషం ఏర్పడింది. ఆ ముని సంఘం ఏడు న్నూరుగురితో కూడింది. వీరందరూ హస్తినాపురానికి వచ్చినారు. బలిచక్రవర్తి తన అధికార బలంతో నరమేధ యజ్ఞం చేసినాడు. ఈ మునులందరిని భస్మం చేసి వేయటానికి ఏర్పాట్లు గావించి నాడు. ఋషిధారిముని విష్ణు కుమారునికి ఈ సంగతి తెలిసింది. అతడు వామనావతారం ధరించినాడు. ఉపాయంగా బలిచక్రవర్తిని వచన బద్ధుని గావించినాడు. ముని సంఘానికి ఏర్పడిన ఉపద్రవం తప్పిపోయింది. అప్పటినుండే రక్షాబంధనం ప్రచారం లోనికి వచ్చింది. (దిగంబరుల హరివంశ పురాణం)

మహమ్మద్ బీన్ తుగ్లక్ (విక్రమ సంవత్సరం 1825 - 1851) రాజ్య కాలంలో జైనాచార్యుడు జీన ప్రభసూరి, ఢిల్లీ వచ్చినారు. సుల్తాన్ నుండి ఒక ఫర్మానా పొందినాడు. దీని ప్రకారం అతడు తన సంఘంతో హస్తినాపుర యాత్ర చేయవచ్చు. ఆచార్యునితోబాటు రాజధానిలోని ధనవంతులైన వ్యాపారులు అనేకులు ఈ యాత్రలో పాల్గొనినారు. అనేక ధార్మిక కలాపాలు, ఉత్సవాలు జరిపినారు. దానధర్మాలు చేసినాడు. మందిరాలలో నవీన జీవ ప్రతిమలను స్థాపించినారు. ఆ కాలంలో అక్కడ శాంతి, కుంజు, అర, మల్లినాథ తీర్థంకరుల ప్రాచీన మందిరాలు, అంబికాదేవి జైన మందిరం (దేవల) ఉండేవి. గంగానది ఇప్పటికంటె హస్తినాపురానికి సమీపంలో ప్రవహిస్తుండేది.

సుమారు రెండున్నర వేల సంవత్సరాల మధ్య ఈ నగరం శిథిలం అయిందని, దీని స్థానంలో భయంకర అరణ్య మేర్పడిందని, జైన చరిత్ర కారులంటున్నారు. హస్తినాపురం పంచస్తూపాలతో, పంచతీర్థంకరులతో, పంచ చక్రవర్తులతో, పంచ పాండవులతో సంబంధం కలిగి ఉన్నందువల్ల ప్రాచీన కాలం నుండి ఇది విశ్వవిఖ్యాతి చెందిన తీర్థం అయ్యిందని చెప్పుతున్నారు.

మహాభారత కాలానికి పూర్వమే ఒక చక్కని నగరంగా ఇది ప్రసిద్ధి చెందింది. అప్పట్లో ఇది ఎన్నిసార్లు ధ్వంసం అయిందో తెలుసుకొనటానికి చారిత్రక ఆధారాలు ఏవీ లేవు. మహాభారత వర్ణనలను బట్టి, కాళిదాసుని వర్ణనలను బట్టి, హస్తినాపురానికి ఉత్తరాన మైళ్ళకొలదిమేర విశాలమైన దుర్గమారణ్యం ఉన్నట్లు ఋజువవుతుంది. మహాభారత యుద్ధకాలం ఇప్పటికే వివాదగ్రస్తంగానే

# వంశీవియోగి

## శ్రీ శనగన నరసింహస్వామి

ఎప్పుడో పూంకారున నివ్వనాన
చూతశాఖలనుండి ధాత్రీతటాన
రాలిపోయిన కాకలీరవము కొరకు
విరతి యెరుగక వెదకెదవే కుమార! 1

ఆ మనియేగె గ్రీష్మసమయంబు సురింగె వినీలనీరద
గ్రామము లంతరించెను శరద్విభవంబు తొలంగె నివ్వనీ
సీమను దుస్సహంబయిన సీతువెరాజ్యమొనర్చునేడు స్వే
చ్ఛామతి నింక నీ పగటి స్వప్నములెట్లు ఫలించు నర్భకా! 2

ఆక యొకింతలేక శిశిరాక్రమణంబు దిగంత చుంబియై
భ్రామకలమానమూనముగ మాటికి నీవి సడల్ప జారుకా
రాకులు సేయు మర్మర రవాణువులే వినిపించుగాని పుం
స్కోకిల గీతమెట్లు చెవి సోకెడి నివ్వనవీథి బాలకా! 3

ధాత్రీజములు వినూతన సూనముల పేర
హర్షాశ్రు బిందుల సట్టె కురియ-
మేతలాడుట మాని మృగమృగీయూథంబు
లరమోడ్పు గనుదోయి నవధరింప
లేలిహానములు వల్మీకముల్వీడి వచ్చి
నెరిఫణమ్ములు విప్పి నృత్యమాడ-
సంచరిష్ణువులైన సామీరశాబంబు
లొక నిమేషము వీనులొగ్గి నిలువ-
గానమొనరించుకొంచును కలయదిరిగి
యివ్విపినవాటి నే పువ్వుటీరమందొ
అలసి నిదురించి ప్రాణము ప్రాణమైన
వంశనాళంబునే పారవైచుకొంటి. 4

నాడు మొదలుగ నన్నపానములు మాని
షెన్నిధిని గోలుపోయిన పేదపగిది
శూన్య హృదయుడనగుచు సనన్యవృత్తి
నాస మోసులుగొన తిరుగాడుచుంటి. 5

ఇప్పుడు గూడ-వంశి లభియించెనయేని సుధాంశునంశువుల్
చిప్పిల నగ్నభూజములు చిరలుదాల్ప లతానికుంజముల్
తెప్పరిలంగ తెమ్మెరలు తేర్లగ వేయి వసంత మాసముల్
కుప్పలు తుప్పలై భువిబుగుల్కొన గానము సేయనేర్చెదన్. 6

ప్రాతవడిపోయి యందంచ పగులువారి
శ్రుతులు మారిన మురళికై మతి కలంగి
అద్దిరా! డింభగాయక! ఆహరహంబు
వెదకి వేసారుట్టి వివేకమగును? 7

గానమె జీవనార్థముగ కాలము బుచ్చు భవాదృశుల్ వయ
శ్శ్రీనిధులివ్విధిన్ వగవజెల్లునె; కొండొక వేణుదండమున్
పూనిక మీరజెక్కి నవమోహనవంశి రచించి మోవిపై
నూనుము చాలు వత్స! రసికోత్సవముల్ విలసిల్లు నట్టెసన్. 8

ఉంది. ఒక్కొక్క పండితుడు ఒక్కొక్క విధంగా ఈ కాలాన్ని క్రీ. పూ. 3102 నుండి క్రీ. పూ. 950 వరకు పరిగణిస్తున్నారు. అనేకుల అభిప్రాయాన్ని బట్టి ఈ ఘటన క్రీ. పూ. 15 వ శతాబ్ది మధ్య భాగంలో జరిగింది. "మహాభారత కాల నిర్ణయం" అనే శీర్షిక కింద డా. ఘంటా జవహర్‌లాల్ (భారతి మే, 1984) ఒక వ్యాసం వ్రాసినారు :— "భరత జాతి గంగా యమునా, నదుల మధ్య భాగాలను పాలించెడిదని" ఋగ్వేదం చెప్పుతున్నట్లు తెలిపినారు.

ప్రఖ్యాత శాసన లిపి పరిశోధకుడు డా. డి. సి. సర్కారు 1975 సెప్టెంబరులో 'మహాభారతం అభూత కల్పన' అని ప్రకటించినారు. ప్రముఖ పురాతత్వవేత్త డా.శంకాలియా సర్కారు వాదనమును సమర్థించినారు. "పురాతత్వ శాస్త్రాధారంతో పరిశీలిస్తే మహాభారత యుద్ధం కల్పితమే" అన్నారు.

"యజుర్వేదంలో గల" కథాసంహితం (8-95) లో విచిత్ర వీర్యుని కొడుకు ధృతరాష్ట్రుని కొడుకుగా పేర్కొనబడింది. (క్రీ. పూ. 600) కౌరవులు కురుక్షేత్రమునుండి తరిమివేయబడిరని "సాంఖాయనశ్రౌత సూత్రం" తెలుపుచున్నది.

క్రీ.శ. 7వ శతాబ్దంలో కురుక్షేత్రం సందర్శించిన హ్యూయాన్‌సాంగ్ పూర్వకాలంలో జరిగిన గొప్ప సంగ్రామమునకు గుర్తుగా ఇంకనూ కురుక్షేత్రం ఎముకల కుప్పలతో నిండివున్నదని తెలిపినాడు.

హస్తినాపురం అనగా నేటి మీరట్ జిల్లా, ఉత్తరప్రదేశ్. ఇటీవల ప్రఖ్యాత పురాతత్వవేత్త డా. బి. బి. లాల్ మహాభారతంలో పేర్కొన్న స్థలాల్లో త్రవ్వకాలు చేపట్టినారు. మహాభారతంలో పేర్కొన్న స్థలాల్లో అన్నింటిలోను అడుగుపొర (లేయర్)లో ఒకే సంస్కృతి బయటపడుటచే అది కురుపాండవుల సంస్కృతిగా పురాతత్వ శాస్త్రవేత్త డా. లాల్ పరిగణించినారు. మహాభారత యుద్ధం కల్పితం కాదని పై త్రవ్వకాలను బట్టి తేలింది. భారత యుద్ధకాలం (క్రీ.పూ. 836)గా డా. లాల్ పేర్కొన్నారు. కాని క్రీ.పూ. 1200-1000 మధ్య కాలంలో భారత సంగ్రామం జరిగి యుండవచ్చునని డా. ఎస్. పి. గుప్త వాదించినారు. మహాభారత కథకు ముఖ్య రంగభూమి హస్తినాపురమే. ఇది కౌరవ పాండవుల రాజధాని.

పాండవ కౌరవుల మధ్య కురుక్షేత్రంలో మహా భయంకర యుద్ధం జరిగింది. పాండవుల విజయానంతరం హస్తినాపుర రాజ్యం యుధిష్ఠిరుని చేతిలోనికి వచ్చింది. అతని తరువాత అతని మనుమడు పరీక్షితుడు సింహాసనం ఎక్కినాడు. అతడు ఒక ఆదర్శవంతుడైన రాజు. అతని కాలంలో పంజాబ్, పశ్చిమోత్తర ప్రాంతంలో నాగజాతి రాజ్యం చేస్తూ ఉండేది. నాగులు హస్తినాపురంపై దండయాత్ర చేసినారు, పరీక్షితుని చంపివేసినారు. పరీక్షితుని పుత్రుడు జనమేజయుడు దీనికి ప్రతీకారం పూనినాడు. నాగులతో నిర్విరామ యుద్ధం చేసినాడు. వారిని దారుణ పరాజయానికి గురి చేసినాడు. కాని నాగులు శాంతించలేదు. కొన్ని తరాల వరకు దండయాత్రలు కొనసాగించినారు. ఈ కారణంగా పాండవుల వంశస్థుడైన నిచక్షుని రాజ్యకాలంలో హస్తినాపుర వైభవం క్షీణించింది. ఇదే కాలంలోనే ఎఱ్ఱ మిడుతల దండు వచ్చిబడి పంటలను ధ్వంసం చేసింది. గంగానది వరదలవల్ల హస్తినాపుర రాజధాని కూడా ధ్వంసం అయింది. ఈ కారణంగా నిచక్షుడు తన పూర్వుల రాజధానిని, రాజ్యాన్ని వదలిపెట్టి తూర్పువైపున కౌశాంబి వచ్చి స్థిరపడినాడు. "మత్స్యపురాణం" (50, 57, 65, 66, 78, 79) "వాయుపురాణం" (99, 249, 250, 256, 258)ని బట్టి హస్తినాపురం గంగానది వరదలలో మునిగినపుడు, పాండవ వంశంలో అయిదవ తరానికి చెందిన నిచక్ష మహారాజు తన రాజధానిని హస్తినాపురం నుండి కౌశాంబికకు మార్చినాడట-'భారతి' (జూన్, 1984) ఘంటా జవహర్‌లాల్ వ్యాసం. "...నిచక్షుర్భవిత నృపః 1 యోగంగయాపహృతే హస్తినాపురే కౌశాంబ్యామ్ వితత్స్యతి" నిచక్షుడు యుధిష్ఠిరునికి ఏడవతరంలోనివాడు. ఇట్లు హస్తినాపుర వినాశం క్రీ.పూ. 1000 ప్రాంతంలో జరిగినట్లు ఊహించడానికి వీలు ఉంది. ఈ మధ్య జరిగిన పురాతత్వ పరిశోధనలను బట్టి ఈ కాలం ధ్రువపడుతుంది.

మహాభారత కాలంనాటి హస్తినాపుర వినాశం తర్వాత నాగవంశానికి చెందిన ఏదో ఒక శాఖకు దీనిపై అధికారం ఏర్పడి వుంటుంది. ఎందుకంటే ఈ కాలం నాగజాతి పునరుత్థానకాలం. పశ్చిమోత్తర ప్రాంతంనుండి పంజాబ్‌నుండి పురోగమిస్తూ ఈ నాగజాతి మధ్యప్రదేశ్‌లోను, సుదూరంగా తూర్పు పంజాబులోను వ్యాపించింది. తక్షశిల, ఉద్యానపురి, అహిచ్ఛత్ర, మధుర, పద్మావతి, కాంతిపురి, నాగపుర మొదలైనవాటిలో నాగుల కేంద్రాలు స్థాపించబడినాయి. వీరి రాజ్యంలో హస్తినాపుర పునఃప్రతిష్ఠ జరిగింది. బ్రాహ్మణులు వీరిని వేదవిరోధులైన వ్రాత్యక్షత్రియులుగా లెక్కించినారు. కారణం ఏమిటంటే వీరు శ్రమణోపాసకులు (జైనమతానుయాయులు) శ్రమణ సంస్కృతిలో వ్రతధారణ చేసిన శ్రమణులను, శ్రమణోపాసకులను వ్రాత్యులు అంటారు. జైన నిర్గ్రంధులు, జైన శ్రావికులు వ్రాత్యులే. జైన ధర్మప్రవర్తకులైన ఇరవైనాలుగుమంది తీర్థంకరులు క్షత్రియులే. అందువల్ల మగధ (బంగాళం, బిహార్, ఒరిస్సా)కు చెందిన క్షత్రియులను కూడా వైదిక ఆర్యులు "వ్రాత్య క్షత్రియులు" అని కూడా పిలిచినారు. వర్ణసంకరం చెందినవారని వ్యంగ్యార్థం. నాగుల రాజ్య కాలంలో జైనుల 23వ తీర్థంకరుడు పార్శ్వనాథ భగవాన్ కూడా హస్తినాపురానికి వచ్చినాడు. బౌద్ధగ్రంథాలను బట్టి మహాత్మబుద్ధుడు కూడా మతప్రచారం కోసరం ఇక్కడికి వచ్చినాడు. అతని సమకాలీనుడైన తీర్థంకరుడు భగవాన్ మహావీరుడు కూడా ఇక్కడికి వచ్చినాడు. అతడు శివరాజుకు, పొట్టిలునికి ఇక్కడే జినదీక్ష ఇచ్చినాడు.

చరిత్రనుబట్టి నందవంశ రాజులు, బహుశా మహాపద్మనందుడు క్రీ.పూ. 400 ప్రాంతంలో కురుదేశాన్ని జయించి తన విశాలమైన మగధ రాజ్యంలో కలిపివేసినాడు. పురాతత్వశాఖ జరిపిన త్రవ్వకాలలో, కాలినమట్టి, బూడిద, వెదురు మొదలైన అవశేషాలు లభించినాయి. వీటినిబట్టి ఆ కాలంలో ఇది దారుణమైన అగ్నికాండకు గురి అయినట్లు తెలుస్తుంది. ఇది క్రీ.పూ. 4వ శతాబ్దిలో జరిగింది. సమ్రాట్ అశోకుని కాలంలో ఈ నగరం మరలా ధ్వంసం అయింది. ఎందుకంటే అశోకుని శిలాశాసనం ఏది ఇక్కడ లభించలేదు. అతని తరువాత అతని మనుమడు సంప్రతి మౌర్యుడు ఈ సామ్రాజ్యానికి అధిపతి అయినాడు. ఇతడు జైనమతానుయాయి. అశోకుడు బౌద్ధమతం కోసరం చేసినంత కృషి, సంప్రతి మౌర్యుడు జైనమతం కోసరం చేసినాడు. అతడు అనార్య దేశాలలో జైనమత ప్రచారం కోసరం జైన సాధువులను కూడా పంపినాడు. అతని రాజ్యం భారతవర్షం అంతటా విస్తరించటమేగాక పూర్వోత్తర దిశగా టిబెట్, ఖేతాన్, టర్కిస్థాన్, అరబ్ అంచులుదాకా చారిత్రాత్మకమైన చైనా 'గ్రేట్ వాల్' దాకా విస్తరించింది. సంప్రతి దాడులనుండి ఆత్మరక్షణ కోసరమే చైనీయులు ఈ గ్రేట్‌వాల్‌ను నిర్మించినట్లు జైనులు చెప్పుతున్నారు. క్రీ.పూ. 3వ శతాబ్దినుండి ఆ తరువాత కొన్ని నూర్ల ఏండ్లదాకా చరిత్రలో మరెట్టి ప్రమాణాలు లభ్యం కావటం లేదు. దీనినిబట్టి హస్తినాపుర వైభవం పూర్తిగా తగ్గిపోయిందని అర్థం. ఎందుకంటే చైనా యాత్రికులు ఫాహియాన్ (క్రీ.శ. 410), యువాన్‌చ్వాంగ్ (క్రీ.శ. 629-644)ల యాత్రా వృత్తాంతంలో సైతం హస్తినాపుర ప్రస్తావన లేదు. యువాన్‌చ్వాంగ్ ఈ ప్రాంతంలో చాలా దూరం సంచారం కూడా చేసినాడు, కాని హస్తినాపురం గూర్చి అతడేమి చెప్పలేదు. ఈ విధంగా హస్తినాపురం మహాభారత యుద్ధకాలంనుండి నాలుగు పర్యాయాలు నిర్మించబడింది. నాలుగు పర్యాయాలు ధ్వంసం కూడా అయిందని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు.



# చంద్రగ్రహణం

## భమిడి వేంకటేశ్వర్లు



చంద్రశేఖర్ ఆలోచనలో పడ్డాడు. అతని మనసు చాలా చికాగ్గా, ఆందోళనగా వుంది. మరోవైపునుంచి కోపం! ఏం చేసేందుకు తోచటం లేదు. ప్రస్తుతం అతన్ని వేధిస్తున్న సమస్య ఒక్కటే! తనకు అర్జంటుగా అయిదువేల రూపాయలు కావాలి. ఎప్పుడో మూడేళ్ళ క్రితం, తనకో స్నేహితుడు పెళ్ళానికి తెలియకుండా దాచమని ఆ డబ్బు యిచ్చాడు. అప్పటికీ చంద్రశేఖర్ చెప్పాడు 'నా గురించి నీకు తెలుసు. నా దగ్గర డబ్బు వుండదు. పొరపాటున వున్నా ఎన్నోవిధాల ఖర్చయిపోతుంది. బహుశా నా అంత దురదృష్టవంతుడు మరొకడు వుండడేమో ...అందులో మా ఆవిడ సంగతి నీకు తెలియనిది కాదు. డబ్బు కన బడితే చాలు, అది ఎవరిదైనా సరే-కోరికల హరివిల్లుకు ఆహ్వానం పలుకుతుంది. ఏ బేంకులోనైనా దాచుకో'' అని... సదరు స్నేహితుడు యిలా జవాబు చెప్పాడు.

"నీ గురించి నాకు తెలుసు. నీ ఖర్చుల గురించి తెలుసు. నిజానికి నువ్వు చెప్పిన సలహా నాకు ముందే గుర్తుకొచ్చింది. మా ఆవిడ గురించి నీకే కాదు నాకే తెలియదు. మీ ఆవిడే బెటరు. బ్యాంకులో డబ్బు దాచి, ఆ పాసు పుస్తకం కడుపులో దాచుకున్నా సరే కడుపు కోసైనా-బయటకు తీసి చూస్తుంది. అప్పుడు నా అవస్థ నీకు ఎలా చెప్పను గురూ...ఇంతవరకూ యీ డబ్బు గురించి యింట్లో చెప్పలేదు. ఏదో అదృష్టం వల్ల, ఆఫీసులో రాదనుకున్న డబ్బు చేతికందింది. నీకు తెలుసుగా, నాకు యింటి నిర్మాణానికి అప్పు మంజూరయిందని! ప్రస్తుతం కట్టదలుచుకోలేదు. అందుకే నీ దగ్గర దాచమంటున్నాను'' అని.

ఆ డబ్బు చూడగానే చంద్రశేఖర్‌కి వంటిమీద జెర్రులు పాకినట్టనిపించింది. గొంతులో వెలక్కాయ పడినట్లయింది. తన యింటిపని నిర్మాణం ఆగిపోయింది డబ్బు లేకపోవటంతో. నాలుగైదు నెలలుగా ఆఫీసులో జీతంనుంచి వంద రూపాయలు మినహాయింపు అవుతోంది. చంద్రశేఖర్ ఆఫీసునుంచి గృహనిర్మాణానికి అప్పు తీసుకున్నాడు. కొన్ని పనులు నిలిచిపోయాయి. ఫలితంగా "ఇంటి నిర్మాణం పూర్తయింది'' అనే సర్టిఫికేటు యివ్వలేకపోయాడు. ఫలితంగా యీ బాధలు... యిబ్బందులు ....జీతంలో కోత...

అటువంటి సమయంలో స్నేహితుడు డబ్బు దాచుకుంటానికి దేవుడు పంపినట్లుగా వచ్చాడు. ఆనందం, సంతోషం కలిగినా మరోవైపు నిస్సహాయత.... బెంగ...ఆందోళన...

"నువ్వడిగినప్పుడు నేను యివ్వలేనేమో...నా పరిస్థితులు నీకు తెలుసుగా" అక్కడికీ చెప్పి చూసాడు చంద్రశేఖర్.

"ఆ మాత్రం నాకు తెలియదా...నాలుగు నెలలు ముందుగా చెప్తాను. నీ వయసుకు, అనుభవానికి, పరపతికి, అయిదువేలు సంపాదించటానికి నాలుగు నెలలు అవసరం లేదు. కాబట్టి నిశ్చింతగా వుండు."

స్నేహితుడు యిరకాటంలో పెట్టేసాడు అతన్ని.

"ఎందుకైనా మంచిది, యీ డబ్బు గురించి మీ ఆవిడకు చెప్పు. ఇంటి నిర్మాణం కోసం వుపయోగించాలంటే, ఆమె మాత్రం దుబారాగా ఖర్చు చేస్తుందా ..." అన్నాడు చంద్రశేఖర్.

"వద్దు గురూ....నువ్వే నాకు....స్విట్జర్లాండు బాంకుకంటే రహస్యంగా, జాగ్రత్తగా వుంటుంది నీ దగ్గర. ఆ నమ్మకం నాకుంది."

ఆపైన మాట్లాడలేకపోయాడు చంద్రశేఖర్.

స్నేహితుడి దగ్గర డబ్బు తీసుకున్నాడు.

"ఏమండీ....జీతంలో వంద రూపాయలు తగ్గిపోతే సంసారం ఎలా గడుస్తుంది. ఎన్నో అప్పులు చేస్తూ, ఖర్చులు తగ్గించుకుంటూ, సరదాలు వాయిదా వేసుకుంటూ ఎలా కాలక్షేపం చేస్తున్నామో మీకు తెలుసు. ఇప్పుడు యీ డబ్బుతో మిగిలిపోయిన పనులు పూర్తి చేసేసి, ఆ దిక్కుమాలిన సర్టిఫికేటు ఆఫీసులో యిచ్చేస్తే జీతం మామూలుగా వస్తుంది. ఇంటిపనులు పూర్తయినట్టుగా వుంటుంది. ఎప్పటికైనా యివి చేయించాలిగా! అంటూ సలహా యిచ్చింది జానకి.

చంద్రశేఖర్ అనుకున్నట్టుగానే జరిగింది.

వెంటనే యింటిపనులు చేయించేసాడు. నెలలో అన్ని పనులు పూర్తయిపోయాయి. ఆఫీసులో సర్టిఫికేటు యిచ్చేసాడు. ఇప్పుడతనికి హాయిగా, తృప్తిగా వుంది. ఇంటి పనులు పూర్తయ్యేసరికి యింటికి ఓ విధమైన నిండుతనం, కొత్తదనం కనిపించసాగాయి. మరోవైపు బాకీ విషయం గుర్తుకు రావటంలో... విచారం బెంగ ...

తెలియకుండానే ధైర్యం కలగసాగింది అతనికి. అయిదువేలు సంపాదించలేకపోతామా? అనే ధీమా అతనిలో టానిక్‌లా పని చేయసాగింది. అప్పుడప్పుడు బెంగ మాత్రం వేధిస్తూనే వుంది.

కాలం గిర్రున తిరిగిపోసాగింది.

అప్పు యిచ్చిన స్నేహితుడు వచ్చాడు ఆరునెలల క్రితం....అప్పట్నుంచీ ప్రయత్నం చేయసాగాడు చంద్రశేఖర్. అనుకున్నంత తేలిగ్గా డబ్బు దొరికితే, సంపాదించగలిగితే—మనుషుల జీవితాలు యిలా వుండవేమో!

ఏ మాట కామాటే చెప్పాలి. చంద్రశేఖర్‌కి డబ్బంటే చాలా భయం. చేతిలో డబ్బు లేకపోతేనే హాయిగా వుంటుందతనికి. అప్పులు చేయటం, అరువు తీసుకోటం సుతరామూ యిష్టం వుండదు, మరీ కొంపలు మునిగితే తప్ప. అటువంటి పరిస్థితులు పదేళ్ళ క్రితం వచ్చి పడ్డాయి. అంతే సదరు గురుడు అప్పు చేయక తప్పలేదు.

పదిహేనేళ్ళ క్రితం, హైదరాబాదులో ఉద్యోగం నిమిత్తం వచ్చినప్పుడు... నాలుగు నెలలకు గృహస్థాశ్రమం స్వీకరించినప్పుడు అసలు సమస్య ఆరంభమయింది. ఇంటి యజమానులు యిళ్లు అద్దెకివ్వటం వ్యాపార ధోరణిలో జరగటం చంద్రశేఖర్‌ని మరీ ఇరకాటంలో పడేసింది. రకరకాల కారణాలతో యిల్లు ఖాళీ చేయించటంతో అతను అయిదేళ్ళల్లో ఆరు యిళ్ళు మారవలసి వచ్చింది.

ఆ సమయంలో ఆఫీసులో ఎవరి ద్వారానో ఇళ్ళస్థలాలు అమ్మకం గురించి తెలిసింది. డబ్బు లేనివాడు ముందే నావ ఎక్కినట్లుగా, చేతిలో పైసా లేకుండానే యిళ్ళ స్థలాల గురించి వేట ఆరంభించాడు.

జానకితో వెళ్ళి ప్లాటు చూసి వచ్చాడు. ఇద్దరికీ నచ్చింది. మరో యిద్దరి స్నేహితులని కూడా తీసుకెళ్ళి చూపించాడు. వాళ్లు కూడా గ్రీన్‌సిగ్నల్ యిచ్చారు. అంతే, అమ్మకందారుతో ఆమోదం తెలిపాడు చంద్రశేఖర్.



"కేవలం ఆమోదం తెలిపితే చాలదు. ముందు రెండువేలు కట్టాలి. మూడు నెలల తరువాత అయిదువేలు కట్టాలి. ఆరో నెలలో మిగిలిన డబ్బు అంటే మూడు వేలు కట్టాలి." చెప్పాడు అమ్మకందారు.

అతను యిరకాటంలో పడ్డాడు.

ఎవరిని అడిగినా వందల్లోనే సర్దగలమన్నారు. అలా ప్రయత్నించినా వెయ్యి రూపాయలు మించలేదు. అప్పుడు చూడాలి చంద్రశేఖర్ పరిస్థితి! అంతే అప్పు చేసి రెండు వేలు యిచ్చి తృప్తిగా నిట్టూర్చాడు. ఆ అప్పుల వలలోనుంచి ఎలా బయటపడాలి? ఆ తరువాత రెండువేలు...ఆ పైన నాలుగువేలు...యీ విధంగా ఎనిమిది నెలల కాలంలో అప్పు సంపాదించి యింటి స్థలం కొనేసాడు. చంద్రశేఖర్‌కి గర్వం తొంగిచూసింది...మరోవైపు విచారం, బెంగ....తెలియకుండానే ఏదో ధీమా!

వెంటనే గృహ నిర్మాణానికి ఆఫీసులో అప్పుకోసం అప్లయ్ చేసాడు. సహకారసంఘ సొసైటీ నుంచి కూడా అప్పు లభించింది. మొత్తం ఆరునెలల కాలంలో అతని చేతిలో నలభై వేలు డబ్బు వచ్చి పడింది. అట్టహాసాలకు, ఆర్భాటాలకు పోకుండా, జాగ్రత్తగా యిల్లు కట్టాడు ఆరు గదులతో.

వెంటనే మూడు గదులు అద్దెకిచ్చేసాడు.

ఇంటి అద్దెతో చేసిన అప్పులు నెమ్మది నెమ్మదిగా తీర్చటం...మిగిలిన యింటిపనులు పూర్తి చేసేందుకు కొత్తగా అప్పులు చేయటం....అలవాటయింది చంద్రశేఖర్‌కి. సిమెంటు ఫ్రీగా దొరక్కపోవటం, బ్లాకులో కొనటం, గృహ నిర్మాణ వస్తువుల ధరలు పెరగటంతో, పనులు చురుకుగా జరిగేవి కావు.

వాయిదాల మీద పనులు చేయించటం తప్ప మరోమార్గం చంద్రశేఖర్‌కి కనిపించలేదు.

అతనికి అప్పుడప్పుడు కోపం, చిరాకు కలుగుతూ వుంటుంది. మనిషికి డబ్బు లేకపోయినా, దొరక్కపోయినా కోపం తప్పనిసరిగా కలుగుతుందేమో! ఇప్పుడు స్నేహితుడి బాకీ ఎలా తీర్చాలి అన్నదే అతని ప్రస్తుత సమస్య!

ఆలోచిస్తున్నాడు...పరిష్కారం దొరకలేదు.

నాలుగు రోజుల క్రితం స్నేహితుడొచ్చి డబ్బు గురించి మళ్ళీ గుర్తు చేసాడు. సరే అనేసాడు చంద్రశేఖర్....కాని ఎలా సంపాదించాలి...ఎవరి నడగాలి .. ఈ గండం ఎలా గట్టెక్కాలి?

చంద్రశేఖర్‌కో అలవాటుంది. ఏదైనా సమస్య, యిబ్బంది ఎదురైనప్పుడు ఏ రైల్వే స్టేషనుకో, బస్టాండుకో వెళ్ళి ఆలోచించటం అంటే అక్కడుండే జనం తన సమస్యలని పరిష్కరిస్తారని కాదు. ఆదుకుంటారని కాదు. కాసేపైనా తనను తాను మరిచిపోయి, నిర్భయంగా నిశ్చింతగా వుండగలిగే ఏకైక ప్రాంతం అది.

అందుకే సికింద్రాబాదు రైల్వేస్టేషనుకు బయలుదేరాడు చంద్రశేఖర్. రద్దీ, సందడిని చూస్తుంటే అతనికి కొంత ఉపశమనంగా వుంటుంది. ఫ్రీగా వుంటుంది. అప్పుల్లో పడినప్పట్నుంచీ, సమస్యల్లో చిక్కుపడినప్పట్నుంచీ... పదిహేను, యిరవై రోజులకోసారైనా అతను ప్లాట్‌ఫారం మీదకు వెడుతుంటాడు.

చంద్రశేఖర్‌లో యింకా పదిహేనేళ్ళ క్రితం మిగిలిపోయిన "పురిటి వాసన" పోలేదు. బహుశా ఎప్పటికీ పోదేమో! ఆ "పురిటి వాసన" అందించిన, మిగిల్చిన "కళ్యాణి"ని కూడా మరువలేదు.

చంద్రశేఖర్ రోడ్డుమీద నెమ్మదిగా నడుస్తున్నాడు.

ఇప్పటికీ తాను అనుకుంటూ వుంటాడు, తను కొన్ని పొరపాట్లు చేశానని, అప్పట్లో ఆలోచించే అవకాశం, వయసు లేదు. తొందరపాటు చర్యగా భావిస్తుంటాడు...ఇప్పటికీ అదే సరియైన నిర్ణయంగా భావించలేదు. చూస్తుండగానే పదిహేనేళ్ళు పదిహేను నిముషాలుగా దొర్లిపోయాయి. చేసిన పొరపాట్లు మరోసారి గుర్తుకొచ్చాయి. అంతలోనే ఏదో సర్దుబాటు....అంతకన్నా ఎక్కువగా వేదాంతం గుర్తుకు వచ్చింది.

ఎం.ఎస్సి. పాసైన నేరానికి దిగువ తరగతి గుమాస్తాగా ఉద్యోగం... అదికూడా కళ్యాణి ప్రోత్సాహం, ప్రోద్బలంతో.

చంద్రశేఖర్‌లో విజయవాడ వాతావరణం, పరిస్థితులు పూర్తిగా నాటుకుపోయాయి. ఆ ఉద్యోగంలో అప్పట్లో మరో యిరవై ఏళ్ళకుగాని సీనియర్ గుమాస్తాగా ప్రమోషను రాదని-వేరే మంచి ఉద్యోగం కోసం ప్రయత్నించమని సలహా యివ్వటం...ఫలితంగా ఉద్యోగాల వేట...

కళ్యాణిని పెళ్ళాడేందుకు అతని తండ్రికి, తల్లికి ఏమీ అభ్యంతరం లేదు. ఆమె తల్లికి వున్నా, అంతగా లెక్కపెట్టదు కళ్యాణి...కాని ఎదిరించలేని బలహీనత మాత్రం ఆమెలో లేకపోలేదు.

"పెళ్ళంటే మాటలు కాదు. ఎన్నో విషయాలు ఆలోచించాలి. అందులో ఉద్యోగం చేసే ఆడదాని విషయం జాగ్రత్తగా పరిశీలించాలి. బాగా స్టడీ చేయాలి. ఆడదాన్ని అర్థం చేసుకోటం కష్టం. వారి ఉద్దేశం ఎప్పుడు ఎలా మారుతుందో.... చెప్పలేము. అందుకే వారిని చపలచిత్తు లంటారు. "దాదాపు పది పదిహేనుసార్లు అయినా చెప్పి వుంటాడు చంద్రశేఖర్ తాత, కొడుకుతో.

అప్పుడు అతని తండ్రి వేరే సంబంధం చూసాడు. జానకితో వివాహం గమ్మత్తుగా, కాకతాళీయంగా జరిగిపోయింది.

జానకి స్కూల్ ఫైనల్ దాకా చదివింది, టైపులో లోయరు పరీక్ష పాసయింది! అందుకే చంద్రశేఖర్ అప్పుడే, భార్యచేత అప్పుడే వచ్చిన రైల్వేసర్వీసు కమీషను ప్రకటన చూసి అప్లయ్ చేయించాడు! కాని దురదృష్టం...యోగం.... ప్రాప్తం...వీటిమీద మనుషులకు నమ్మకం లేకపోయినా, అలస్యంగానైనా వాటి మీదే నమ్మకం ఏర్పడి జీవితాలని మారుస్తుంటాయేమో!

ఉద్యోగాలు తేలిగ్గా వచ్చిపడితే, దేశానికి నిరుద్యోగ సమస్య ఎందుకుంటుంది? నాయకులకు పనెక్కడుంటుంది! అల్లర్లు, సందేశాలు, గొడవలు ఏం కావాలి?

ఇప్పటికీ చంద్రశేఖర్ అనుకుంటూనే వుంటాడు-జానకి ఎలా ఎస్సెల్సీ పాసైందని! అందులో డెబ్భై శాతంతోనా! విద్యాప్రమాణాల మీద అతనికి కోపం కలిగింది. చదివినవాళ్ళు పరీక్ష తప్పటం...పుస్తకం చూడనివాళ్ళు, బ్రహ్మాండమైన మార్కులతో ప్యాసవటం....ఆశ్చర్యం వేస్తూ వుంటుంది....

వ్రాతపరీక్షకు జానకికి పిలుపు వచ్చింది. ఆర్డరు కాగితం అందుకోగానే ఆమె చేతులు వణికాయి. పరీక్ష భయం ఆవరించింది. చంద్రశేఖర్ ఏవో గైడ్లు కొన్నాడు. భార్యచేత చదివించాడు. కాని బుర్రకెక్కితే కదా....ఎంత చెప్పినా అర్థమయ్యేది కాదు. చెప్పింది వస్తుంది చస్తేగా! పంచరు పడ్డ ట్యూబులో ఎంత గాలికొట్టినా ఏం లాభం?

జానకి పరీక్షకు హాజరు కాలేదు.

ఏ మాటకామాటే చెప్పాలి. ఆమెకు ఉద్యోగం చేయాలనుంటుంది. కాని తేలిగ్గా ఎవరు పిలిచి ఉద్యోగం యిస్తారు! అందులో యీ రోజుల్లోనా? భుజానికి వానిటీ బ్యాగు ధరించి, కొత్త కొత్త చీరలు కట్టి—అందరిలాగే ఆఫీసులకెళ్ళి నిద్రపోవాలని జానకి ఆరాటం....పనిచేయ్యకుండా స్నేహితులతో కబుర్లు చెప్పి నెలయ్యే సరికి రెవెన్యూస్టాంపు మీద సంతకంచేసి, నోట్లు లెక్కపెట్టుకుని బ్యాగులో పెట్టుకోవాలని కోరిక.

కానీ ఏదీ జరగలేదు....వయసు పెరగటం....ముగ్గురాడపిల్లలు పుట్టటం.... కొడుకు కోసం నాలుగోసారి గర్భం దాల్చటం అప్పుడు కూడా ఆడపిల్లే పుట్టటం... చంద్రశేఖర్‌కి భయం కలిగింది. నగర జీవితం....పెరిగే ధరలు ... పెరగని

జీతం.... పై సంపాదన లేని ఉద్యోగం....మరోవిధంగా సంపాదించటం యిష్టంలేని మనస్తత్వం.... అతన్ని ఎగతాళి చేయసాగింది.

జీవితం మీద విరక్తి....ఏర్పడింది. దానికితోడు జానక్కి భర్తమీద చులకనభావం కలగటం....నలుగురూ ఆడపిల్లలే పుట్టటం....రోజూ దంపతుల మధ్య ఏదో విషయంలో పోట్లాట, ఘర్షణ... మనశ్శాంతి లోపించటం....భార్య చేసే అనవసరపు దుబారా ఖర్చులు చంద్రశేఖర్‌ని అప్పుల్లో పడేసింది.

"హరి భగవంతుడా ...ఈ అప్పులెలా తీరుస్తావ్... ఏదైనా దారి చూపిస్తావా ...పాత అప్పులు తీర్చేందుకు కొత్త అప్పులు చేయటం తప్ప మరో మార్గం లేదా....అందరి జీవితాలు యిట్లాగే వున్నాయా? నాకేనా యీ శాపం?" అనుకోని రోజు వుండదు.

దానికితోడు జానకిలో మరో సమస్య. ఆమెకు దైవభక్తి ఎక్కువ. ప్రతీదీ దేవుడికే వదిలిపెట్టి, మన ప్రయత్నం ఏమీ అవసరం లేదు అన్న నమ్మకాన్ని పెంచుకోటం చంద్రశేఖర్‌కిష్టం వుండదు. "దేవునికి నువ్వు ఒక్కత్తే భక్తురాలు కాదు. కోట్లమంది వుంటారు. ఎందరికి ఆ దేవుడు కోరికలు తీర్చి గట్టెక్కిస్తాడు. నిజంగా తీర్చేస్తే ఎవరు తనని కొలుస్తారు ...అందుకే చాలా కోరికలని తీర్చకుండానే, కళ్ళు మూసుకుంటాడు. ఓ చెవితో విన్నదాన్ని, మరో చెవిలోనుంచి వదిలేస్తాడు." అంటూ వుంటాడు అతను.

ఆలోచనలతో స్టేషను చేరాడు చంద్రశేఖర్.

* * *

ప్లాట్‌ఫారం టిక్కెట్టు కొని లోపలికెళ్ళి కాంటీనులోకి అడుగు పెట్టాడు. కౌంటర్లో టోకెను తీసుకుని, కాఫీ సెక్షన్లో యిచ్చాడు. కాఫీ కప్పు అందుకుని ఖాళీగా వున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు. నెమ్మదిగా కాఫీ సిప్ చేయసాగాడు చంద్రశేఖర్.

కళ్ళ ముందర స్నేహితుడి రూపం కనిపించింది.

అతనిచ్చిన అయిదువేలు....ఆ బాకీ తీర్చేందుకు తాను చేస్తున్న ప్రయత్నాలు గుర్తుకొచ్చాయి మళ్ళీ.

కాఫీ తాగటం పూర్తయింది. బయటకు నడిచి ప్లాట్‌ఫారంమీద నిలబడ్డాడు. అన్ని లైన్లమీదా ఏవో పాసెంజరు రైళ్ళు, గూడ్సు రైళ్లు...అక్కడక్కడ ఖాళీ లైన్లమీద షంటింగు చేస్తున్న యింజన్లు ...రైల్వే సిబ్బంది పరుగులు, కేకలు వినిపిస్తున్నాయి.

చంద్రశేఖర్ మరికొంచెం ముందుకు నడిచాడు.

ప్రయాణీకుల ఉరుకుల పరుగులు, వారిని సాగనంపేవాళ్లు. అమ్ముకునే వాళ్ళు, బిచ్చగాళ్ళు, దేశజనాభా ప్లాట్‌ఫారం మీదే వచ్చి పడినట్టుగా వుంది. చికాగ్గా వున్నా, మనసులో వున్న ఆలోచన చంద్రశేఖర్‌ని అంతగా విసిగించటం లేదు.

అతనికి జానకి మీద కోపంగా వుంది. ఇల్లు బాగుపడాలనే అందరు కోరుకుంటారు. కాని ఆమె భేషజాలకే విలువ యిస్తుంది. ఈ మనుషులు, యీ సమాజం వీటికే ప్రాముఖ్యత నిస్తారు. నలుగురిలో గొప్పగా కనిపించేందుకే తాపత్రయ పడతారేమో! నీటిబుడగలాటి జీవితం కోసం...పాలపొంగులాంటి ఆశల జీవితం కోసం ఆరాటము?

ఎప్పుడో ఆర్థికపరిస్థితి కొంచెం మెరుగ్గా వున్న రోజుల్లో ఓ కుట్టుమిషను కొన్నాడు చంద్రశేఖర్.

"ఎందుకండీ అనవసరంగా కుట్టుమిషను" అంటూ విసుక్కుంది జానకి.

"ఎందుకేమిటి...కష్టపడి నలుగురు ఆడపిల్లల్ని కన్నావుగా...,మీ గుడ్డలు టైలరుకిస్తే ఎంతవుతుందో తెలుసా? కుట్టుపని నేర్చుకుంటే మంచిది. ఇతరులవి కూడా కుడితే సంపాదన వుంటుంది." చెప్పాడు చంద్రశేఖర్-కుట్టుపనిమీద వుండే ఆదాయం మరి దేనిమీదా లేదనే విషయాన్ని నొక్కి చెప్తూ.

జానక్కి యీ సలహా బాగానే వుందనిపించగానే, యింటికి దగ్గర్లో వున్న కుట్టుపని నేర్పే స్కూల్లో చేరింది. ఆరునెలల కాలంలో నేర్చుకున్నది ఏమీ లేకపోయినా డబ్బు మాత్రం బాగానే ఖర్చయింది. స్నేహితులు, చుట్టుపక్కల వాళ్ల కొత్త గుడ్డలు కుట్టించుకోకపోయినా, చిరిగిన జాకెట్లు, చీరలు, లంగాలు "రఫ్" చేయించుకోటం చంద్రశేఖర్ కూ్కడా యిష్టం వుండేది కాదు. ఇటువంటి "ప్రజా సేవ" కోసమా తాను కుట్టుమిషను కొన్నది! అయినా యిచ్చేవాళ్ళకైనా బుద్ధి వుండదేమో? వాళ్ళకెందు కుంటుంది! ఫ్రీగా అందరూ పాలు పోస్తుంటే, వేరే ఆవుని ఎందుకు కొనటం అన్నట్లుగా వుంది.

"నువ్వోసారి ఏదో కారణం చెప్పి చూడు. అప్పుడు ఎవరూ యిలా చేయరు" ఎన్నోసార్లు సలహా యిచ్చాడు చంద్రశేఖర్.

ఎప్పటికప్పుడు భర్త సలహా పాటించాలనే అనుకొనేది జానకి. కాని, తీరా ఆచరణలో కొచ్చేసరికి "మొహమాటం" నోటిని కట్టిపడేసేసరికి కథ మళ్ళీ మొదటికే వచ్చిపడేది.

ఆ మధ్య ఆఫీసులో అనుకోకుండా "బకాయిల పని" చేసినందుకు పద్ధేను వందల రూపాయలొచ్చాయి.

"హమ్మయ్య...మరో మూడ్రెయ్ అయిదొందలు సంపాదిస్తే వాళ్ళ అప్పు తీర్చేయచ్చు" అన్నాడు చంద్రశేఖర్ భార్యతో.

జానక్కి అది నచ్చలేదు.

"ఈ డబ్బు రాలేదనుకొని మొత్తం డబ్బు కోసం ప్రయత్నించండి. దీనితో కేసట్ టేపు రికార్డరు కొనుక్కుందాం...అందరిళ్ళల్లోనూ వుంది. పిల్లలు సరదా పడుతున్నారు....ఎవరిళ్ళకో వెళ్ళి వింటున్నారు అంది జానకి.

"టేపురికార్డరు అంటే మాటలు కాదు. తరచు కేసట్లు కొంటూ వుండాలి. కొనకుండా వుండలేము. ఇంక రిపేర్లు వస్తే చెప్పాలా...కాబట్టి యీ డబ్బుతో బాకీ తీరుద్దాం" నిశ్చయంగా చెప్పాడు.

జానకి వినిపించుకోలేదు.

చంద్రశేఖర్ సాయంత్రం ఇంటికొచ్చేసరికి ఇంట్లో టు-యిన్-వన్ వుంది. నిస్సహాయత అతన్ని వెక్కిరించింది. తన మాట గెలవలేదు. ఓడిపోయిన బతుకు ఎందుకని అనిపించింది.

"రెండు కేసట్లు, నాలుగు బాటరీలు ఫ్రీగా ఇచ్చాడు" అంటూ చూపించింది జానకి.



"నీలాటి వాళ్ళుండబట్టే వ్యాపారస్తులు కోట్లు సంపాదిస్తున్నారు. ఏలాగైనా సరుకు అమ్ముడుపోవాలన్న ఉద్దేశంతో ఏదో ఒకటి 'ఉచితం' అంటారు. లేదా 'తగ్గింపు' అంటారు. మనం రోడ్డుమీద పారేసే చెత్తని కూడా వాళ్ళు జాగ్రత్త పరచి—ఏదో పేరుపెట్టి, ఏవో రంగులు పూసి తిరిగి మనకే అమ్ముతారు. మనుషుల్లో యిటువంటి బలహీనత వున్నంతకాలం ఏ వస్తువైనా అమ్ముడయి పోతుంది"

జానకి భర్త నోటికి తాళం వేసింది.

"వాయిదాల్లో యిస్తున్నారని ఆ టీ.వీ. కొనిపించావు. పదిహేనుపందలు అప్పు చేయించి ముందిచ్చి, వస్తువు యింటికి తెచ్చావు. నెలకు పంద రూపాయలు వాయిదా కట్టాలంటే ఎంత అవస్థగా వుందో చూస్తున్నావు కదా....దానికితోడు 'షోకు తగ్గిపోయినట్టుగా స్టాండు, షట్టర్లు కొనిపించావు. ఎందుకు? యిదంతా టేబులు మీద పెట్టి, ఓ తువ్వాలు కప్పితే చాలదూ! చెప్తే వినవు..." అంటూ విసుక్కున్నాడు అతను.

లెక్కచేసేవారికి ఎంత చెప్పినా ఫరవాలేదు.

ఆ మధ్య కాలనీలో ఓ యిల్లాలు పట్టుచీర కొనుక్కుని జానక్కి చూపించింది. ఆమె భర్తకు చూపించింది, తనకూ ఒకటి కొనమంటూ.

"పట్టుచీర చాలా రేటుంటుంది. పైగా రోజూ కట్టుకొనేందుకు వీలుండదు. ఏమైనా నూనె మరకలు పడితే యింతే సంగతులు. ఆ ఖరీదుతో మామూలుగా కట్టుకునే చీరలు కొనుక్కుంటే మంచింది" అంటూ సలహా యిచ్చాడు చంద్ర శేఖర్.

"ఏటి సామెత చెప్పినట్టుగా వుంది మీ ధోరణి...అయినా మిమ్మల్ని అంటకట్టి మా నాన్న చాలా పొరపాటు చేశాడు. సరదాలు, కోరికల మాట దేవుడెరుగు....కనీసం మగపిల్లాడిని కనే యోగం కూడా దేవుడు యివ్వలేదు" అంటూ ఓసారి కళ్ళనీళ్ళు పెట్టుకుంది జానకి.

చంద్రశేఖర్ వుండే కాలనీ షోష్ కాలనీ. అలా అని అక్కడ నివసించే వాళ్ళందరూ హైక్లాసు మెంటాలిటీతో వున్నారంటే పొరపాటే. ఘరానా పెద్ద మనుషులు. చీకటి పనులు చేసే పెద్ద మనుషులు. వాళ్ళంతా పెళ్ళాల మాట వింటారు. కారణం లేకపోలేదు. అంతో యింతో పుట్టింటినుంచి ఆస్తో, కట్నాలో తెచ్చి మొగుళ్ళకిచ్చారు. ఆ అభిమానంతోటి సర్దుకుపోతుంటారు. పెత్తనం ఆడవాళ్ళదే: కావలసినది కొనకపోతే నిద్రపట్టదు. అది ఎదుటివాళ్ళకు చూపించి, మెప్పు పొందకపోతే తిన్నది అరగదు. వాళ్ళని తేలిగ్గా చూడకపోతే సంసారం చేస్తున్నట్టుండదు.

"పోనీ నాకు రేపు దసరా పండగలకైనా పట్టుచీర కొనండి" భర్త మూడ్ కనిపెట్టి అడిగింది జానకి.




చంద్రశేఖర్ గట్టిగా నవ్వాడు.

"చూడు జానకీ....నువ్వు కావాలంటేనే గ్రైండరు, వాషింగు మెషీను, ఎలక్ట్రానిక్ గోడ గడియారం, సోఫా కం బెడ్ కొన్నాను? ఇప్పుడు మన ఆర్థిక పరిస్థితి ఎలా వుందో నీకు తెలుసు. పైగా మనం ముందుగా తీర్చవలసిన అయిదు వేల బాకీ ఒకటుంది. ఇంటిపన్ను కూడా మూడేళ్ళనుంచి కట్టాలి. ఇంటికి రంగులు వేయించకపోయినా కనీసం సున్నం అయినా వేయించాలి. చిల్లర బాకీలు దాదాపు నాలుగువేలున్నాయి. అంటే మొత్తం తొమ్మిదివేలు అప్పు పెట్టుకొని నువ్విలా కోరటం న్యాయమేనా ఆలోచించు" చంద్రశేఖర్ సర్ది చెప్పబోయాడు.

"మరి కొనేవాళ్ళంతా ఎలా కొంటున్నారని....వాళ్ళు కూడా మీలాగే యుడీసీలే కదా....అందరికీ జీతాలు సమానంగానే వస్తాయి కదా....మనకే ఎందుకిన్ని ఇబ్బందులు?

అతనికేం చెప్పాలో తెలియలేదు.

"ఆ విషయం నీకు తెలుసు. అప్పు చేసి బతకటం, లేని గొప్పలు కోసం ప్రాకులాడటం నాకిష్టం లేదు. అప్పు చేయటం తేలిక కాని యింటిముందుకొచ్చి గోలపెడితే ఎంత నామోషీ! అది నాకిష్టం లేదు. చేసిన అప్పులు చాలు. అవి తీర్చగలిగితే ఈ జన్మ ధన్యమైనట్లే" చంద్రశేఖర్ అన్నాడు.

"పోదురూ....ఎందుకొచ్చిన వేదాంతం యిది, కడుపు నిండేదా? కొనటం యిష్టం లేకపోతే సరి...." జానకి కొట్టి పారేసింది.

చంద్రశేఖర్ సరదాకు టైపు హయ్యరు నేర్చుకున్నాడు. సర్టిఫికేటు కూడా పొందాడు. "పోనీ ఎక్కడైనా పార్ట్‌టైముగా టైపు పని చేయచ్చు కదా....నేర్చుకున్నదాన్ని సద్వినియోగ పరచుకోవచ్చు కదా...." చాలాసార్లు అనేది జానకి.

"ఇరవై నాలుగ్గంటలూ సంపాదన తప్ప మరో ఆలోచన వుండదు? ఆరోగ్యం ఏం కావాలి? నాకొచ్చే జీతం మన సంసారానికి చాలు, లేనిపోని గొప్పలు అరికడితే సరి! నిజాయితీగా ఉద్యోగం చేసి, వచ్చే జీతం చాలు....కాని చాలామందికి చెడుదారులు తొక్కటం అలవాటయి పోతోంది....అది నాకిష్టం వుండదు"

భర్త ధోరణి జానక్కి అంతుపట్టదు. సంపాదించే తెలివితేటలు లేని ప్రతి మనిషి ఇలాగే మాట్లాడతాడని ఆమె ఉద్దేశం!

ఇది "షో" ప్రపంచం! ఇంట్లో ఎలా వున్నా పైకి మాత్రం హుందాగా, డాంబికంగా కనబడే ప్రయత్నం చేసేవాళ్ళు ఎక్కువవుతున్నారు. ఖరీదైన బట్టలు ధరించటం....వారానికో సినిమా చూడటం....టీ.వీ. పాతదై పోయింది కాబట్టి వీడియో వున్నవారినే గుర్తించే నవశకం ఆరంభమవటం....చేసే ఉద్యోగంతో సంబంధం లేకుండా గొప్పలకు ఎగబడేవారినే సమాజం గౌరవిస్తోందేమో!

మొన్నటికి మొన్న-జరిగి అప్పుడే నాలుగు నెలలు అయింది! అప్పు దేమయిందని—

చంద్రశేఖర్ ఎంత చెప్పినా వినకుండా జానకి పిల్లల్ని తీసుకుని పుట్టింటి కెళ్ళిపోయింది! వేసవికాలం సెలవులు స్కూళ్ళకు యివ్వగానే. అయిష్టంగానే అతను వారినే బస్సు ఎక్కించి వచ్చాడు. ఇదో ఆరేడువందల ఖర్చు....అతని దృష్టిలో రూపాయికి కూడా నూరుపైసల విలువ వుంది.

"ఇప్పుడెందుకు జానకీ....ఎవర బోలెడంత ఖర్చు కనబడుతుంది! ఇవ్వవలసిన బాకీ ఎలా తీర్చాలో తెలియక నేను సతమతమవుతుంటే యీ ప్రయాణం దేనికి?" అని చెప్పి చూసాడు నాలుగైదుసార్లు!

భర్త మాటని జానకి వినిపించుకోలేదు! "ఏం మనిషో....ఎప్పుడూ డబ్బు, ఖర్చులు, అప్పుల గురించే ఆలోచన....పుట్టింటికెళ్ళని ఆడది ఉంటుందా" స్వగతంలో ఆమె అనుకున్నా చంద్రశేఖర్‌కి వినిపించాయి ఆ మాటలు!

కాని ఏం చేయగలడు?

రూపాయి సంపాదించటం కష్టం! ఖర్చు చేసేందుకు ఎంతోసేపు పట్టదు!

ఆలోచించే అవసరం వుండదు! ఊరగాయలు పెట్టేందుకు ఆరొందలు అయింది! క్రితం ఏడు ఇద్దరు పిల్లల్ని వేరే స్కూళ్ళల్లో చేర్పించేందుకు పదిహేను వందలు డొనేషను కట్టాడు చంద్రశేఖర్! ఈ యేడు కూడా మరో ఇద్దరికి కొత్త స్కూలు చూడాలి.... డొనేషను ఎంత కట్టాలో? అదిగాక ఫీజులు, పుస్తకాలు, యూనిఫారాలు....తలచుకొంటేనే ఒళ్లు వేడెక్కిపోతోంది....

జానకి ధోరణి అతనికి అంతుపట్టటం లేదు! చెప్తే అర్థం చేసుకొని వినే రకం కాదు! ప్రతి విషయంలో ఇద్దరికీ చెరో అభిప్రాయమే! ఉత్తర, దక్షిణ ధృవాల్లాంటి ఆలోచనలు...అభిప్రాయాలు....

"రెండేళ్ళకోసారైనా పుట్టింటి కెళ్ళాలిట" ఇదీ జానకి ఉద్దేశం...చిన్నప్పటి స్నేహితులకు ఇప్పుడు కూడా ఉత్తరాలు రాస్తుంది! పెళ్ళయి, పిల్లలు పుట్టి, ఎవరి సంసారాల్లో వాళ్లు పడి సతమతమవుతూ వుంటే ఏమిటీ ఉత్తరాలు! ఎన్నోసార్లు వారించబోయాడు చంద్రశేఖర్! "నువ్వు ఉత్తరాలు రాయటంవల్ల మీ ఫ్రెండ్సు విసుక్కుంటారు! వాళ్ళచేత అనవసరంగా ఖర్చు పెట్టిస్తున్నావు...నాలుగు రాస్తే ఒకటో రెండో రాస్తున్నారు! దీన్నిబట్టైనా అర్థం చేసుకో....పోస్టేజి ఖర్చు దేనికి?" అంటూ!

"మా నాయనమ్మ కల్లోకి వస్తోందండీ—చూడాలని వుంది! అన్నయ్యలు, వదినలు, అక్కయ్యలు వస్తున్నారు! ఈ రూపంగానైనా అందర్నీ చూడొచ్చు!" జానకి చెప్పింది వూరికెళ్ళే కారణంగా!

"ఆవిడకు పెద్ద వయసు. ఏవో నలతలు, అనారోగ్యం తప్పవు. ఈ కారణంగా అనవసరపు ఖర్చు దేనికి! రేపు వాడొచ్చి, బాకీ తీర్చమని గోల పెడితే యీ జనాభాలో ఎవరైనా ఆదుకుంటారా? జీవితంలో వచ్చే కొన్ని ఎదురు దెబ్బలకు అంతగా ప్రాముఖ్యత యివ్వగూడదు. ముందు మన గురించి చూసుకోవాలి.... రోజులెలా వున్నాయి?" చంద్రశేఖర్ వివరించాడు.

"నాయనమ్మను బతికుండగా చూడాలని వుంది"

"ఈ బంధాలు, ప్రేమలు, అభిమానాలు, ఆప్యాయతలకు అర్థం పర్థం లేవు. వాటికి విలువ లేని రోజులు. ఇతరుల కోసం మనం ఆరాట పడేముందు మన కోసం వాళ్ళు ఎంత తాపత్రయ పడుతున్నారన్న విషయాన్ని గ్రహించాలి. జీవితంలో బరువు బాధ్యతలు పెరుగుతున్నప్పుడు, వయసు అనుభవం పిల్లలతో పాటు ఎదుగుతున్నప్పుడు-యిలా అభిమానాలు, ఆప్యాయతలు అంటూ ఖర్చులు పెంచుకోటంలో అర్థం లేదు. మనసులో వుంటే చాలు. ఎదురుగా వెళ్ళి కావలించుకుని ఏడ్చేసి నటించటం అనవసరం... కాని యీ రోజుల్లో నటనకే, మొసలి కన్నీళ్ళకే నీలాటివాళ్ళు కరిగిపోతున్నారు .... కలికాలం..." చంద్రశేఖర్ మరింతగా వివరించి చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

అసలీ రోజుల్లో మనిషికి మరోమనిషి బరువు. భరించటం కష్టం. చంద్రశేఖర్‌కి యిప్పటికీ గుర్తే...ఆ రోజు. అంటే పెళ్ళి జరిగిన మరునాడు—అనుకున్న మాటల ప్రకారం పెళ్ళికొచ్చిన జనం విడిది యిల్లు ఖాళీ చేసి వెళ్ళిపోవాలి. భోజనాలు, టిఫిను, కనీసం కాఫీలు కూడా జానకి తండ్రికి సంబంధం లేదు. కాని కాంట్రాక్టు బస్సుకి రిపేరు వచ్చి దారిలో ఆగిపోయింది. దాదాపు మూడు నాలుగు గంటల ఆలస్యం అయింది వచ్చేందుకు. అప్పటికే జానకి తండ్రి కాఫీ టిఫిన్లు ఏర్పాటు చేసాడు. టైము పదకొండు గంటలు అయింది...భోజనాల టైము అయింది...

ఈలోగా మధ్యవర్తి వెళ్ళి భోజనం ఏర్పాటు చేయమని అర్థించాడు. "క్షమించండి...ఇప్పటికే అనుకున్న ప్రకారంకంటే అదనంగా కాఫీ, టిఫిన్లు అందించాను. ఇంక భోజనం అంటే నావల్ల కాదు. మీరే ఏదైనా ఏర్పాటు చూసుకోండి" అంటూ చేతులు జోడించాడు,ఆ తండ్రి నిర్మొహమాటంగా.

ఎవరి దారి వారు చూసుకున్నారు. ఇప్పటికీ ఆయన తత్వం అంతే. ఇంటికెవరొచ్చినా భయపడిపోయి. బి.పి. పెంచుకుంటాడాయన....కొడుకులు, కూతుళ్లు,



ఎవరొచ్చినా అంతే!

ఎన్నో ఆలోచనలతో అసలు సమస్యకు పరిష్కారం దొరకటం లేదు ప్లాట్‌ఫారం మీదకు వచ్చేవాళ్ళు, పోయేవాళ్ళు ఇంక రైల్వే లైన్లమీదకు ఏవో రైళ్ళు వస్తూనే వున్నాయి.... పోతున్నాయి...మరికొన్నింటిమీద అలాగే నిలిచిపోతున్నాయి. చంద్రశేఖర్ కిదంతా ఆశ్చర్యంగా, వింతగా వుంది. తను రైల్వే ఉద్యోగంలోనే వుండిపోవాల్సింది. ఈ ఉద్యోగంలో ఎదుగు బొదుగు లేదు. నెల నెలా జీతం....ఏడాదికోసారి ఇంక్రిమెంటు. అప్పుడప్పుడు ప్రభుత్వం దయతలచి ప్రకటించే కరువు భత్యం....అంతకు తప్పించి మరేం లేదు. డిపార్ట్‌మెంటల్ పరీక్షలు పాసయితేనే ప్రమోషను. అది ఓ పెద్ద గండం. నాలుగుసార్లు ప్రయత్నించి ఓడిపోయాడు. ఆ తరువాత బద్ధకం అశ్రద్ధ ...

తాను రైల్వేలోనే వుండిపోతే యీపాటికి హెడ్‌క్లర్కు అయిపోయేవాడు. మూడవ వేతన సంఘం సిఫార్సు, రైల్వేల ఆధునీకత, విస్తరణ, అభివృద్ధి వల్ల ఉద్యోగులకు బాగా లాభం, ప్రయోజనం కలిగిందని అప్పటి స్నేహితుల ద్వారా తెలిసి—చేసిన తెలివి తక్కువ పనికి నాలుగైదు రోజులు విచారించేవాడు చంద్రశేఖర్. కనీసం జానకికైనా రైల్వే ఉద్యోగం బాగా ఉపయోగకరంగా వుండేది-తన ప్రయాణాలకు ఖర్చు తప్పేది, పాసులుండటంవల్ల ....

విజయవాడ-హైదరాబాదు జీవితాలకు ఎంతో వ్యత్యాసం వుంది. అందులో యిప్పుడు విజయవాడ ఎంతో అభివృద్ధి చెందిందిట... ఆరేడేళ్ళయింది వెళ్ళి.... పాత స్నేహితులని చూసి....అతనికి ముఖ్యంగా కళ్యాణిని చూడాలని వుంది.

"నువ్వేదో నమ్మకస్తుడవని నమ్మి, డబ్బు చేతిలో పెట్టాను. ఇప్పుడు ఇవ్వలేనని అంటే నేను ఏ రైలుకింద పడాలి! నా ఖర్చులు, అప్పులు ఎవరితో చెప్పుకోను!" స్నేహితుడు అడుగుతున్నట్టుగా అనిపించింది చంద్రశేఖర్‌కి.

ఉలిక్కిపడ్డాడు అతను.

"నో, నో ...అటువంటి పరిస్థితి రాదు...కలగదు....నమ్మి చేతిలో డబ్బు వుంచిన స్నేహితుడిని మోసగించకూడదు. ప్రయత్నాలు మరింత గట్టిగా చేసైనా అయిదువేలు యిచ్చేసేయాలి" స్వగతంలో అనుకున్నాడు.

తృప్తి, ఆనందం, హాయి, సంతోషం-ఇవి మనుషులకు రకరకాలుగా వుంటాయి. కాని చంద్రశేఖర్‌కి మాత్రం యిటువంటి కష్టాల్లో, ఆపదల్లో, సమస్యల్లో-తృప్తినిచ్చినా....ఆనందం, హాయి యిచ్చేది....సంతోషంగా వుండేది ఒకే ఒక్క మనిషి—

కళ్యాణి! ఆమె పరిచయం...ఆమెతో స్నేహం....ఆమె ప్రేమ....ఆమె తీయని మాటలు....అందమైన రూపం....ఆకర్షణగా వుండే ముఖారవిందం....

కాసేపు యీ బాధలు, ఖర్చులు, అప్పులు, యిబ్బందులు అవతలపెట్టి కళ్యాణి రూపాన్ని కళ్ళముందు నిలుపుకున్నాడు చంద్రశేఖర్. పరిచయం, గతం సినిమారీలులా తిరగసాగింది.

ఆలోచనల్నుంచి తేరుకునేసరికి ప్లాట్‌ఫాం యింకా సందడిగానే వున్నట్లు గ్రహించాడు చంద్రశేఖర్. ఎక్కడ చూసినా జనమే...రైల్వుస్టేషన్లు, బస్టాండ్లు, రోడ్లు, సినిమాహాళ్ళు, ఆసుపత్రులు, స్మశానాలు-ఒకటనేమిటి! అందుకే కాబోలు ఫామిలీ ప్లానింగు గురించి యింత ముమ్మరంగా ప్రచారం చేస్తున్నారు? అయినా పుట్టుకొస్తూనే వున్నారు, అదుపు అడ్డు లేకుండా.

చంద్రశేఖర్ టైము చూశాడు ..చాలా టైమయిందే అనుకున్నాడు! ఇంటి వైపు దారిపట్టాడు. తన సమస్యకు పరిష్కారం లభించలేదు.

బస్టాండులో నిలబడ్డాడు. వెంటనే ఏదో బస్సు వచ్చింది. ఎక్కి కూర్చు న్నాడు. అరగంట తర్వాత యిల్లు చేరాడు చంద్రశేఖర్.

"ఇంతవరకూ ఎక్కడికి కెళ్లారు? ఇల్లు, సంసారం పట్టించుకోకుండా అలా రోడ్లవెంబడి తిరిగితే ఏం లాభం? మీ ఫ్రెండు వచ్చి వెళ్ళాడు ....మీరొచ్చాక యింటికి రమ్మనమని చెప్పాడు" జానకి విసుగ్గానే అంది.

అతని చూపులు నిల్వలేకపోయాయి. డబ్బు కోసమే వచ్చి వుంటాడు. లేకపోతే తనమీద ప్రేమతో ఎవరొస్తారు? మరోసారి చేస్తున్న ప్రయత్నాలు గుర్తుకు వచ్చాయి.

"ఇంతకీ డబ్బు గురించి ఏం ఆలోచించారు" అడిగింది జానకి.

"ఏమీ ఆలోచించలేదు. అదే ప్రయత్నంలో వున్నాను. అయిదువేలు కాదు కదా అయిదు వందలు కూడా దొరికేలా కనపడటం లేదు. అతనికి ఎలా ఇవ్వాలో అర్థం కావటం లేదు." భార్యమీద కోపంగా వున్నా పైకి మాత్రం ఏమీ ప్రదర్శించ లేక సౌమ్యంగానే చెప్పాడు అతను.

"ఓ పని చేయండి .. రేపొద్దున్నే వాళ్ళింటికెళ్ళి మూడునెలల టైము ఇమ్మనండి. ఈలోగా ఏదో చూడొచ్చు" సలహాగా చెప్పింది జానకి.

"నేను అడగను. బాగోదు" నిశ్చయంగా అన్నాడు చంద్రశేఖర్.

"ఇంతకీ చిట్‌ఫండు ప్రయత్నం ఎంతవరకూ వచ్చింది?"

"అది కూడా ఫలించేలా లేదు. సాక్షులే కరువయ్యారు. ఒక్కడే సంతకం చేస్తానన్నాడు. మరో సంతకం వాళ్ళ ఫ్రెండు చేత చేయిస్తానన్నాడు, రెండు వందలు యిస్తే. లేదంటే వాళ్ళావిడకు రెండు బేరాలు యిప్పించమన్నాడు. సరే అన్నాను. నీకెటూ బేరాలు రావు. ఆ వచ్చినవాళ్ళని వాళ్ళింటికి పంపిస్తే సంతో షిస్తుందా యిల్లాలు. మనకీ తృప్తిగానూ వుంటుంది"

భర్త మాటలు జానకిలో చిన్నచూపు కలిగించినా, ప్రస్తుత పరిస్థితుల్లో యిదే మంచిదనిపించింది.

"అనవసరంగా మీరు చిట్‌లో చేరతానంటున్నారు. నెలనెలా మనం చిట్ డబ్బు కట్టలేము...కాబట్టి వెళ్ళి మీ నాన్నగారిని అడగండి" అంది జానకి— ఏదో బృహత్తర ప్రణాళికను పరిష్కరించిన ధోరణిలో.

చంద్రశేఖర్‌కి తండ్రి దగ్గరకు వెళ్ళటం యిష్టం లేదు. జానకి చేసే దుబారా ఖర్చులు, ఆర్భాటాలు, ఆయనకు నచ్చవు. వారించమని ఎన్నోసార్లు కొడుకుతో చెప్పాడాయన. కాని ఫలితం లేకపోగా మరింతగా ఖర్చుచేస్తూ వుండ టంతో అప్పులు పెరిగాయి. తన అప్పులని తండ్రిని తీర్చమని అడగటంలో అర్థం పర్థం లేదు.

చాలాసేపు ఆలోచించాక, యింతకన్నా వేరే మార్గం కనిపించలేదు. మర్నాడు పొద్దున్నే కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో విజయవాడ వెళ్ళేందుకు నిశ్చయించు కున్నాడు. కంచం ముందు కూర్చున్నాడు, భోజనం చేసేందుకు.

ఎల్లాగో అయిందనిపించాడు.

మళ్ళీ పాంటు, షర్టు వేసుకొని స్నేహితుడింటికి బయలుదేరాడు. చంద్ర శేఖర్ వెళ్ళేసరికి అతను రేడియో వింటున్నాడు.

"ఎంత హాయిగా బతుకుతున్నావయ్యా...రేడియో వినటం మాట దేవు డెరుగు, టీ.వీ. చూసి ఎన్ని రోజులయిందో నాకు" స్వగతంలో అనుకున్నాడు చంద్రశేఖర్.

"దరిద్రుడి పెళ్ళికి వడగళ్ళ వాన అన్నట్లుగా, సరిగ్గా నా వంతు వచ్చే సరికే బడ్జెట్ అయిపోయిందట...కాబట్టి యీ ఏటికి ఇల్లు కట్టే యోగం లేదు. అసలుందో లేదో! మళ్ళీ ఏటికి పరిస్థితి ఎలా వుంటుందో...గుడ్డిలో మెల్ల అన్న ట్లుగా నాకు భూటాన్ డిపుటేషను వచ్చింది. రెండేళ్లు. వెళ్ళేందుకే నిశ్చయించు కున్నాను. బహుశా వారం పదిరోజుల్లో ఆర్డర్సురావచ్చు" అన్నాడా స్నేహితుడు.

చంద్రశేఖర్‌కి మనసులో ఆనందంగానే వుంది. కాని పైకి మాత్రం "నీ డబ్బు వారం రోజుల్లో రెడీ అవుతుంది" అన్నాడు.

"ఇంకెందుకులేవయ్యా యిప్పుడు....ఖర్చయిపోతుంది....నీదగ్గరే వుంచు. మీ ఆవిడ యిందాక ఏవో అప్పుల గురించి చెప్పింది. అనవసరంగా వడ్డీలు ఎందుకు చెల్లిస్తావ్! ప్రస్తుతం అవసరం లేదులే నాకు....ఈ డిపుటేషనువల్ల నాలుగు వందలు ఎక్కువ వస్తుంది. పైగా భూటాన్‌లో క్వార్టరు యిస్తారుట. ఖర్చు కూడా అంత వుండదు"

"ఓ పని చేయి. నీ బాంకు ఎకౌంట్ నెంబరు యిస్తే, డబ్బు క్రెడిట్ చేస్తాను. నా దగ్గర డబ్బు నిలవ వుండే ప్రసక్తే లేదు" అన్నాడు చంద్రశేఖర్ స్నేహితుడి మాటలకు బదులుగా.

"వద్దులేవయ్యా ...నీ దగ్గరే వుండనీ" అన్నాడు అతను.

"బై ది బై, యీ విషయం జానకితో చెప్పావా?"

"లేదు. నాకు మాత్రం తెలియదా!"

"అలా అని కాదులే....ప్రస్తుతం నీ డబ్బు గురించే ప్రయత్నిస్తున్నాను. నువ్వు యీ విషయం జానకితో చెప్పావంటే నా పని అయినట్లే... ప్రస్తుతం డబ్బు దొరగ్గానే, దానితో ఇంటికి రంగులు, బయట నాపరాళ్ళు వేయించ మంటుంది. ఇంటికి ఎంత ఖర్చు పెట్టినా ఇంకా ఏదో మిగులుతూనే వుంటుంది. రేపు మా నాన్న దగ్గరకెడుతున్నాను" అన్నాడు చంద్రశేఖర్.

"అంత హడావిడి ఏం వచ్చిందని...తీరుబడిగా యివ్వచ్చుగా" చెప్పాడు స్నేహితుడు.

"అలా అనకు. ప్రస్తుతం చేస్తున్న ప్రయత్నం కొనసాగాలి. ఈ వేడి చల్లారిపోతే మళ్ళీ వేడెక్కదు. అదృష్టం బాగుండి డబ్బు దొరికితే వెల్ అండ్ గుడ్. నీకే యిచ్చేస్తాను. లేదంటే నీ ఎకౌంటులో వేస్తాను. కాబట్టి నెంబరు చెప్పు"

"నీకు ముందే చెప్పాను. మళ్ళీ మొదటికే వచ్చావు నువ్వు. నాకు ఎకౌంటు లేదు."

"మీ ఆవిడ ఎకౌంటు వుందిగా"

"ఆ పని మాత్రం చేయకు. నీ ధోరణి చూస్తుంటే అయిదువేలు హారతి కర్పూరంలా ఖర్చు చేయించేట్టుగా ఉన్నావు. సరే, యీ నెంబరులో క్రెడిట్ చేయి" అంటూ నెంబరు చెప్పాడు అతను.

చంద్రశేఖర్ ఇంటి కెళ్ళిపోయాడు.

మర్నాడు పొద్దున్నే విజయవాడ వెళ్ళిపోయాడు అతను,

* * *

వినాయకుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే అన్నట్టుగా, చంద్రశేఖర్ వెళ్ళేసరికి తల్లి, తండ్రి ఢిల్లీ కూతురి దగ్గరకు వెళ్ళేరని పక్కవాళ్ళు చెప్పారు.

"హతోస్మి" అనుకున్నాడు.

ఏం చేయాలో తోచటం లేదు.

చంద్రశేఖర్‌కి 'కళ్యాణి' గుర్తుకొచ్చింది. ఎన్నో ఏళ్ళు అయింది ఆమెను

చూసి. ఓసారి చూడాలనిపించింది.

అంతే, ఆలోచన రావటమే తరువాయి. వెంటనే బయలుదేరాడు.

ఆఫీసు భవనాలు ఎంతో మారిపోయాయి. కొత్తవి కొన్ని... పాతవాటి స్థానంలో మరికొన్ని ...తిన్నగా తాను పనిచేసిన ఆఫీసువైపు నడిచాడు. ఓసారి గుమ్మం దగ్గర నిలబడి లోపలకు చూసాడు. కొత్త ముఖాలు...అక్కడక్కడ పాత ముఖాలు, నెరిసిన జుట్టు, ముడతలు పడ్డ ముఖాలు— మొత్తానికి గుర్తు పట్టినా ఎవరూ అతన్ని పలకరించలేదు. అదో చెంపదెబ్బగా తోచింది.

కళ్యాణి కూడా ఇలాగే ప్రవర్తిస్తుందేమో...

అప్పుడేం చేయాలి? మనుషులు దూరంగా వుంటే అభిమానం పెరుగుతుందట ...కాని ప్రస్తుతం వేరేగా కనిపిస్తోంది...

ఏదో పాత ముఖం కనిపిస్తే పలకరించబోయాడు...కాని నిరాశే మిగిలింది. ఎరగనట్టు, చూడనట్టు, హడావిడిగా వెళ్ళిపోయాడు ఆ మానవుడు.

మొత్తానికి కళ్యాణిని గుర్తుపట్టి దగ్గరకు వెళ్ళాడు.

కొన్ని క్షణాలు ఇద్దరి కళ్ళు మూగగా పలకరించుకున్నాయి. ఆనంద బాష్పాలు నాలుగుకళ్ళు వర్షించాయి.

'కళ్యాణి హెడ్ క్లర్క్' అన్న నేం ప్లేటు గోడకి తగిలించబడింది. చంద్రశేఖర్ చూసి సిగ్గుపడ్డాడు అందుకే ముందే తను పలకరించాడు, "బాగున్నారా" అంటూ.

"కూర్చోండి ఏమిటలా వున్నారు! వంట్లో బాగుండటం లేదా" కళ్యాణి ఆప్యాయంగా అడిగింది

'బాగానే వున్నానుగా ..' అంటూ తనవైపు చూసుకొన్నాడు అతను. అయిదు నిముషాలు ఇద్దరిమధ్య పలకరింపులు .. యోగక్షేమ విచారణ ...

"అప్పుడు వెళ్ళి యిప్పుడు కనిపిస్తున్నారు న్యాయమేనా?" అంది ఆమె

"కాదు . నేను నాలుగుసార్లు వచ్చినా కలవలేకపోయాను. విజయవాడ వచ్చి చాలా ఏళ్ళయింది. ఇప్పుడు ఓ అర్జంటు పనిమీద వచ్చాను. కాని అదిలోనే హంసపాదు అన్నట్టయింది .. " అంటూ తల వంచుకున్నాడు చంద్రశేఖర్.

"మీ ఆవిడ, పిల్లలు అంతా బాగున్నారా . హైదరాబాదులో యిల్లు కట్టుకున్నారట .. " కళ్యాణి అడుగుతోంది.

"ఈ విషయం ఎవరు చెప్పారు?"

"మీరు రైల్వే వదిలి వెళ్ళిపోయినా, మీ నాన్నగారు యిక్కడే పని చేస్తున్నారుగా .. ఆయనే అమధ్య చెప్పారు"

"అదే నేను చేసిన పొరపాటు .. ఏదో ఎగువ తరగతి గుమస్తా ఉద్యోగం అని వెళ్ళాను ..అంతే ఎదుగూ బొదుగూ లేదు . మరో చేసిన పొరపాటు యిల్లు కట్టటం...ఇంతకీ మీవారు . పిల్లలు బాగున్నారా?"

"మా అమ్మకి తగిన శాస్తి జరిగింది. నాకు మా సినిమా బావతో పెళ్ళయింది. అదో దిక్కుమాలిన ప్రపంచం . ఎదుగులేని జీవితం అది. ప్రొడ్యూసర్లు డబ్బు యివ్వటం దేవుడెరుగు ...వేషాల కోసం ఎదురివ్వటం . దానితో నేను డబ్బు యివ్వటం...ఎనిమిదేళ్ళు మద్రాసు—విజయవాడ మధ్య వ్యవహారం నడిచింది...బహుశా దేవుడికి మామీద కన్ను కుట్టి వుంటుంది. నా సౌభాగ్యాన్ని దురదృష్టం వరించింది" కళ్యాణి చెప్తూనే వుంది నిర్లిప్తంగా.

"ఇంతకీ పిల్లలెంతమంది?" అడిగాడు చంద్రశేఖర్.

"ఇద్దరమ్మాయిలు ..."

"ఇద్దరం ఒకే విధంగానే వున్నామన్నమాట .. " చటుక్కున నోటినుంచి వచ్చేసాయి ఆ మాటలు...

"అంటే" అర్థం కాలేదామెకు.

"నాకు నలుగురు కూతుళ్లు..."

"ఇదేనేమో చిత్రం అంటే .. మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నా కనీసం ఓ మగపిల్లాడు పుట్టేవాడేమో... ఇటు జీవితం అటు మారేదేమో.. " పమిటతో కళ్ళు తుడుచుకుంది కళ్యాణి.

పావుగంటసేపు యిద్దరూ ఎంతో ఆప్యాయంగా కబుర్లు చెప్పుకున్నారు. పాత స్నేహితులందరి గురించి అడిగాడు. కొందరు ట్రాన్సఫరు అయ్యారు, మరి కొందరు చనిపోయారు. ఇంకొందరు సస్పెండయ్యారు .. ఇలా వుంది అక్కడి పరిస్థితి...

"ఈ రాత్రికి మా ఇంటికి రండి..." అంది కళ్యాణి.

చంద్రశేఖర్‌కి వెళ్లాలనే వుంది. అంతలోనే అయిదువేల అప్పు గుర్తు రావటం ... స్నేహితుడితో జరిగిన సంభాషణ. తల్లి తండ్రి ఢిల్లీ వెళ్ళటం చికాకు కలిగించింది. ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? నేను పరాయిదాన్ననా?" చిరుకోపం ప్రదర్శించింది కళ్యాణి.

"అబ్బే అదేం లేదు.. కాని అర్జంటుగా వెళ్ళిపోవాలి' అని మాత్రం అన్నాడు.

"డబ్బు గురించేనా బెంగ"

ఆశ్చర్యపోయాడు చంద్రశేఖర్ ఎలా తెలుసు అన్నట్లుగా.

"నాకు మన పరిచయం, స్నేహం, మీ మాటలు యిప్పటికీ గుర్తే... మీరు డబ్బు గురించి వర్రీ అవుతున్నారేమో... పెరిగే ధరలు, పెరగని జీతం, ఖర్చులు నగర జీవితం, పైగా యిల్లు కట్టటం . అందులో ఆడపిల్లలు . ఆమాత్రం గ్రహించలేనా?" కళ్యాణి మాటలు అప్పటికీ యిప్పటికీ ఒకేలాగున్నాయి.

సరే అన్నాడు.

"ఇదిగో సబ్బు, టవెల్. టాయిలెట్ కెళ్ళి ముఖం కడుక్కొని రండి" అంటూ సబ్బు, టవెల్ అందించింది ఆమె!

ఇబ్బందిగానే అందుకున్నాడు వాటిని.

పది నిముషాలు గడిచాయి.

"భోజనం చేయలేదనుకుంటాను" అంది ఆమె.

"ఇప్పుడు భోజనం ఏమిటి ...అయినా మిమ్మల్ని చూసేక ఆకలే వేయడం లేదు. ఏకంగా రాత్రి చేస్తాను" ఎల్లాగో అన్నాడు చంద్రశేఖర్.

"భలేవారండీ మీరు ...జీవితం అంటే ఏమిటి...పొద్దున్నే లేవగానే దంతధావనం, కాఫీ, భోజనం, మధ్యాహ్నం కాఫీ, టిఫిను, రాత్రి మళ్ళీ భోజనం, పడుకునే ముందు 'అది'—ఇందులో ఏది లేకపోయినా రోజు వెళ్ళినట్టు వుండదు అని మీరు చెప్పేవారు. మరిచిపోయారా" అంటూ గుర్తు చేసింది కళ్యాణి.




అతనిలో ఇంకా ఆశ్చర్యం పోలేదు.

కళ్యాణి సెలవుచీటీ రాసి ఆఫీసరుకు పంపించింది.

ఇద్దరూ యింటి కెళ్ళిపోయారు.

* * *

"రోజూ టేపు రికార్డరులో పాటలు వింటున్నారా?" వడ్డిస్తూ అడిగింది కళ్యాణి.

"ఏం పాటలో కళ్యాణీ... ఆ జీవితం ఎప్పుడో పోయింది. ఇప్పుడు నా జీవితం నాకే భయంగా, చికాకుగా వుంటోంది. ఏమయిపోతుందో అన్న ఆందోళన నన్ను అనుక్షణం వేధిస్తుంది. అందులో నలుగురూ ఆడపిల్లలే! పైగా జానకి దుబారా మనిషి....మా యిద్దరికీ ఏ విషయంలోనూ పొత్తు కుదరదు. నా మాట చెల్లదు. ఎందుకీ బతుకు?" చంద్రశేఖర్ అన్యమనస్కంగానే చెప్తున్నాడు.

"చదువుకున్నవారు, మీరే యిలా భయపడితే ఎలాగ! ఆ రోజుల్లో మీరు ఎంత ధైర్యంగా, చలాకీగా వుండేవారూ! జీవితం అంటే ఓ సాగరం ... అందులో ఆటుపోటులే కాదు, తుఫానులు కూడా వస్తుంటాయి. ఇంకా మీరు ఏమనేవారో గుర్తుందో లేదో?" ఓ క్షణం ఆగింది ఆమె.

భోజనం ముగించి లేచాడు అతను.

కళ్యాణి వక్కపొడి అందించింది.

"ఏం అనేవాడిని?"

"అప్పుడే మరిచిపోయారా—జీవితం రైల్వే ప్లాట్‌ఫారం లాటిది. ఏవో రైళ్లు వస్తూ పోతూ వుంటాయి . ఎప్పుడూ రద్దీగా వుండే ప్లాట్‌ఫారాలకి అందం నిండుతనం... అలాగే జీవితాలు కూడా ...ఖర్చులు, సమస్యలు, యిబ్బందులు ఎదురవుతుంటాయి ...భయపడిపోతే ఎలా అని చెప్పేవారుగా!" అందామె.

"నిజమే కళ్యాణీ ...కాని నేను తలకు మించిన అప్పులు చేసాను. నా కోసం చేస్తే నేను అంతగా బాధపడను. జానకి తన గొప్పల కోసం, మెప్పుల కోసం, సర్టిఫికేట్ల కోసం, యితరుల దృష్టిలో హుందాగా కనిపించేందుకు నాచేత అప్పు చేయించింది. ఇప్పుడు ఆ బాకీలు ఎలా తీర్చాలో అర్థం కావటం లేదు" అంటూ అయిదువేల గురించి చెప్పాడు చంద్రశేఖర్.

కళ్యాణి చక్కగా నవ్వింది.

"నువ్వు కూడా నవ్వుతున్నావా కళ్యాణి" సిగ్గుపడుతూ అన్నాడతను.

"లేదండి.... చేతివేళ్ళల్లాగే మనుషుల్లో ఎన్ని రకాలు! ఎవరి అభిప్రాయం, ఆలోచన, దృష్టి వారిదే' నిశ్చయంగా అంది ఆమె.

ఏం చెప్పాలో అర్థం కాలేదు అతనికి.

అంతలో కళ్యాణి పిల్లలిద్దరూ స్కూలునుంచి వచ్చారు. "ఇది సీనియరు, అది జూనియర్" అంటూ పరిచయం చేసింది కళ్యాణి.

"నమస్తే అంకుల్" అన్నారిద్దరూ ఏకకంఠంగా.

ఆశ్చర్యపోతూ యిద్దర్నీ దగ్గరకు తీసుకుని, పేరు, చదువు, స్కూలు గురించి అడిగాడు జేబులోనుంచి రెండు పది రూపాయల నోట్లు తీసి వారి చేతిలో పెట్టాడు. "వద్దు అంకుల్" అంటూ తల్లివైపు చూసారు వాళ్ళు!

"ఇదేం బాగోలేదండీ" అంది కళ్యాణి!

"పిల్లలు! వారికేం తేలేకపోయాను....అయినా నీకేం ఇవ్వటం లేదుగా ... ఏదో కృష్ణుడికి కుచేలుడు అటుకులు యిచ్చినట్లుగా, చంద్రుడికో నూలుపోగు అన్నట్లుగా..." చంద్రశేఖర్ సంజాయిషీగా చెప్పాడు!

పిల్లలు లోపలకు వెళ్ళిపోయారు!

కళ్యాణి టేపురికార్డరు తెచ్చి కేసట్ పెట్టి ఆన్ చేసింది! మంచిపాట.... ప్రేమమయం ...శృంగారం నూరుపాళ్ళు రంగరించి పోసినట్లు వున్న పాట అది!

కాని అతనికి వినాలనిపించటం లేదు!

కళ్యాణి, చంద్రశేఖర్ అన్యమనస్కంగా వున్నట్టు గ్రహించింది. ఆ మాటే అడిగింది.

"నేనింకా బతికున్నానంటే కేవలం విజయవాడలో పెరగటం, నీ చేతి మీదుగా రైల్వే ఉద్యోగంలో చేరటం... మన పరిచయం-తరచు గుర్తుకు తెచ్చుకుని ఆ కాసేపైనా బాధలు మర్చిపోతుంటాను...." అన్నాడు అతను.

"అందుకే కాబోలు ఒక్క ఉత్తరం అయినా రాయలేదు" ఎగతాళి చేస్తున్నట్టు అందామె.

"నువ్వు మనస్ఫూర్తిగా అంటున్నావా... అయినా ఒకరి భార్యవు. ఎలా రాయను .. ఏం బాగుంటుంది .. " అన్నాడు అతను.

కళ్యాణి ఏం బదులు చెప్పలేదు.

ఇద్దరిమధ్య రెండు గంటలసేపు కబుర్లు దొర్లాయి. వారికి ఎంతో తృప్తిగా వుంది. కాని ఏదో బలహీనత...

చంద్రశేఖర్‌కి మళ్ళీ అప్పులు ...ఖర్చులు...బాకీలు గుర్తుకు రాగానే మనసంతా ఏదో బాధ, బెంగ ఆవరించినట్లయింది.

"నేను రాత్రి గోదావరి కెళ్ళిపోతాను" వెళ్ళాలని లేకపోయినా అనక తప్పలేదు అతనికి.

"తప్పదంటే మీ యిష్టం" కళ్యాణి కూడా ఇబ్బందిగానే చెప్పింది.

ఆ రాత్రి రైలుకే చంద్రశేఖర్ హైదరాబాదు వెళ్ళిపోయాడు.

* * *

అయిదో రోజున చంద్రశేఖర్‌కి కళ్యాణినుంచి ఉత్తరం వచ్చింది. అది కవరు. ఆత్రంగా, ఆశ్చర్యంగా విప్పి చూసాడు. అందులో ఒక బాంకు చెక్కు, ఉత్తరం వున్నాయి.

పదివేల రూపాయలకు రాయబడిన చెక్కు!

అతని కళ్ళు ఉత్తరం వెంబడి పరుగెట్టాయి.

శ్రీ చంద్రశేఖర్‌గారికి, వెంటనే ఉత్తరం రాస్తున్నందుకు ఏమీ అనుకోరు కదూ....నా పొరపాటో, గ్రహపాటో, లేక ముందు చూపో-నా భర్తకు ప్రావిడ్యూసర్లు యిచ్చిన డబ్బునుంచి యిది మాత్రం ఎల్లాగో దాచుకోగలిగాను. పదహారు వేలకు మిగిలింది యిది మాత్రమే....అందులో అయిదువేలు మా అక్క తీసుకుంది. తిరిగి రాదని తెలుసు. నా దగ్గర యింకా వుందని ఎవరెవరో వచ్చి ఉచ్చులు వేయసాగారు. చెరువులో నీళ్ళుంటేనే కప్పలు, చేపలు చేరతాయిట .. బెల్లం చుట్టూ ఈగలు ముసురుతాయట....అది నిజమో కాదో తెలియకపోయినా—డబ్బుంటే మాత్రం మనుషులకు ప్రేమాభిమానాలు, ఆప్యాయతలు మాత్రం పెరుగుతాయని గ్రహించాను.

డబ్బు దాచటం చాలా కష్టమైందని నా అనుభవంలో గ్రహించాను. గతంలో నాలుగైదుసార్లు మీ నాన్నగారు కనిపిస్తే, మీ అడ్రస్సు అడిగి మీకు ఈ డబ్బు పంపించాలనుకున్నాను. కాని ఆయన ఏమనుకుంటారోనని భయపడ్డాను. ఈ లోకంలో నాకు మిగిలిన ఆప్తులు, స్నేహితులు మీరే! దేవుడిలా కనిపించారు. అదే పదివేలుగా భావించి యీ పదివేలను నా దేవుడి దగ్గర భద్రపరచాలని భావించాను. ఈ డబ్బు నా పిల్లల కోసం ఎల్లాగో ఉపయోగించాలి. ఇంకా ఆరేడేళ్ళ మాట కదా...

మనిషికి డబ్బుకి మించిన విచారం, మనోవ్యాధి మరొకటి వుండదేమో... ప్రస్తుతం మీ యిబ్బందులు, ఖర్చులు యీ స్వల్ప మొత్తంతో తీరితే, ఉపయోగించుకోవచ్చు. ఇలా రాసినందుకు మరోలా భావించకండి. హటాత్తుగా వచ్చి మాత్రం డబ్బు ఇమ్మని మిమ్మల్ని అడగను. మరో విషయం... మీకెప్పుడు డబ్బు అవసరమైనా, ఈ కళ్యాణిని గుర్తుంచుకోండి. వీలయినప్పుడు ఉత్తరం రాయండి.

మీ శ్రీమతిని, పిల్లలని అడిగినట్లు చెప్పండి.

ఉంటాను—కళ్యాణి.

# అంతరంగం

## జాన్

మనః వాటికలో
జ్ఞాపకాల నాటికలు ....
వాస్తవాల తెరలు హఠాత్తుగా వాలిస్తూ
వేదికపై నా నీడా
తోడుగా యేవేవో పొగలజాడా
ప్రేక్షకుడు వొకడే
వొంటరి నక్షత్రంలా మినుక్కు మినుక్కుమంటూ
సూత్రధారి యెవడో మాంత్రికుడు
నా నీడను వశపరచు కున్న తాంత్రికుడు
ప్రేక్షకుడు మాత్రం నిజంగా పిచ్చివాడు
పొగుడుతూ, తిడుతూ
నవ్వుతూ, యేడుస్తూ
రసాలు తొమ్మిదన్న వాడిని యెగతాళి పట్టిస్తూ
వొకోసారి కోపం వచ్చి
సుడిగాలిలా బయటకి పరిగెట్టుకెళ్ళిపోతాడు
నా నీడ మాత్రం వాడిని వెంటాడి
వాడిలో లయించుకుపోతుంది
చివరకు —
నే నే మిగులుతాను .......



ఉత్తరం మీద చంద్రశేఖర్ కళ్ళు చెమరుస్తున్నాయి. బాంకు చెక్కు చేతిలో వణుకుతోంది!

అయితే, అతనికి మరో ఆలోచన కూడా కలిగింది—ఈ డబ్బు గురించి జానక్కి తెలిస్తే మాత్రం వూరుకోదు. తనకి, కళ్యాణికి మధ్య ఏవో సంబంధాలున్న విషయం కాసేపు మరిచిపోయి, ఆ డబ్బుని ఖర్చు పెట్టేందుకు పథకాలు వేస్తుంది.

ప్రేయసి సలహా పాటించాలి!

తాను డబ్బు గురించే ప్రయత్నిస్తున్నట్టు, బాధపడుతున్నట్టు జానకి గ్రహించాలి .. పరోక్షంగా ముఖ్యమైన బాకీలు తీర్చాలి....కళ్యాణి పదివేలు జాగ్రత్తపరచి, పువ్వుల్లో పెట్టి ఆమెకే అందించాలి!

"కళ్యాణీ...నీ మేలు ఎప్పటికీ మరువలేను ...చీకట్లో మిణుగురు పురుగు సృష్టించే వెలుతురు ఎంత గొప్పదో—నా ప్రస్తుత పరిస్థితుల్లో నీ సాయం అంతకన్నా గొప్పది..." చంద్రశేఖర్ స్వగతంలో అనుకోగానే అతని కళ్లు మరింతగా చెమరించి వర్షించసాగాయి. ●

డా. యు. ఎ. నరసింహమూర్తి.

# గురజాడ - శ్రీశ్రీ

గురజాడ ఆధునిక సాహిత్యోద్యమానికి ఆద్యుడు. శ్రీ శ్రీ దాని గతికి బాధ్యుడు. గురజాడ ఒక ఉద్యమంగా విస్తరించిన వ్యక్తి. శ్రీశ్రీ ఒక ఉద్యమం వైపు తన తరాన్ని ఆకర్షించిన శక్తి. గురజాడవి నిశ్చితాభిప్రాయాలు. అతని సాహిత్య జీవితంలో ఒక క్రమపరిణతి-వికాసం వున్నాయి. అందులో ఇతరుల ప్రభావం వుండవచ్చునేమోగాని ప్రమేయంలేదు. శ్రీశ్రీ స్వభావంలో సందిగ్ధతకు తావుంది, అతని సాహిత్యజీవితంలోని కొన్ని పరిణామాలు, అభ్యుదయ మార్గంలో సాగినవే అయినా, అతని ప్రమేయం లేకుండా జరిగేయి. అప్పుడప్పుడు 'నన్ను నేను తిరగేసి తొడుక్కున్నాను' అని శ్రీశ్రీ ఆశ్చర్యపడడం వుంది. గురజాడ పొరపాట్లు చేసినట్లుగాని, అందుకు విచారం వెలిబుచ్చినట్లుగాని చెప్పడానికి స్ఫుటమైన దాఖలాలులేవు, శ్రీశ్రీ లో అలాంటివి కనిపిస్తాయి. గురజాడ అన్ని సందర్భాలలోనూ తగుమనిషిలా కనిపిస్తాడు. శ్రీశ్రీ లో అప్పటప్పట పసితనం పెచ్చురేగడం కద్దు. వేషంలో గురజాడకి శ్రీశ్రీ కి ఒక తరపు అంతరం స్పష్టంగా కనిపిస్తుంది. ప్రశాంత, మెరుస్తూ లోతుగా చూచే గురజాడ కళ్ళ వెనుక తన శారీరక దౌర్బల్యాన్ని తోసిరాజని ఉద్యమించే దృఢమైన మనసు కనిపిస్తుంది. సమాజాన్ని ఆకళించుకునే ఒక స్తిమితవైశాల్యం పరుచుకుని వుంటుంది. 'ఆ!' అంటూ ఆశ్చర్యంతో విచ్చుకున్న శ్రీశ్రీ కళ్ళలోంచి కొంచెం ముందుకొచ్చిన గ్రుడ్లు అతని మహోద్రేకాలను వెదజల్లుతాయి. 'కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మా' లంటాడు గురజాడ. 'పాతకి గోరీకట్టాలని-కొత్తకి భేరీ కొట్టాలని' చాటిస్తాడు, ఉద్ఘోషిస్తాడు శ్రీశ్రీ. గురజాడ కవిత 'ఆకులందున అణగి మణగిన కోయిల' శ్రీశ్రీ కవిత 'ఝంఝానిల షడ్జధ్వానం' గురజాడ కురిపించింది జాలిసోన. శ్రీశ్రీ ది అగ్గివాన. తనమీద విరుచుకుపడే మూకని కంటి చూపుతో మౌనంగా ఎదిరిస్తున్నట్టు కనిపిస్తాడు గురజాడ, గల్లీలో దూకుతూ పెడబొబ్బలు పెట్టే మల్లుడిలా కనిపిస్తాడు శ్రీశ్రీ, గురజాడలో ఆత్మాశ్రయధోరణి అంతగాలేదు శ్రీశ్రీ లో ఆత్మాశ్రయ ధోరణివుంది. అయితే అది భావకవుల ఆత్మాశ్రయ ధోరణికంటె భిన్నమైనది. గురజాడలో 'అదనులేదే దేనికైనను' అనే సంయమనం ఒక ఆలోచన-ఒకధీమా కనిపిస్తాయి. శ్రీశ్రీ కి 'శిల్ప మనర్ఘ' మని తెలిసినా అదుపులేని ఈ ఉద్రేకం కమవుతుందేదో ఉన్మాదం' అని గ్రహిస్తున్నా 'అనుకున్నది అనుకున్నట్టునేయడం' అలవాటు. గురజాడ మహస్సుకు బహిః ప్రేరణ వేమిటో అతను చెప్పకోలేదు. శ్రీశ్రీ మాత్రం "ఆల్కాహాలిక ధూమజ్వాలలు సెగలిస్తవి నా తపస్సుకు" అని స్పష్టంగా చెప్పకున్నాడు. గురజాడనాటికి ప్రపంచం ఇంకా 'చిన్నకాలపు చిన్నబుద్ధులకు' బాగా బెదురుతూంది. శ్రీశ్రీ నాటికి ప్రపంచం పరిపక్వంగావుంది.

ఇంచుమించుగా ఇద్దరూ ఒక ప్రాంతంవారే, ఇద్దరూ అభ్యుదయాన్ని కోరేరు. ఇద్దరూ మానవాళి మధ్య ఎల్లలుచెరిపేరు. ఇద్దరూ కొత్తతోవలు తొక్కేరు. ఇద్దరికీ సంప్రదాయ భూమిక బలంగా వుంది ఇద్దరూ సంప్రదాయ కవిత్వం రాసేరు. అందులోంచి బయటపడ్డారు ఇద్దరూ పద్యానికంటూ ఒకభాష వుంటుందని చెప్పక చెప్పేరు. ఇద్దరూ సమకాలీన సమాజంలోని సమస్యలను తలచికొని క్షోభించేరు. ఇద్దరికి రెండు రెండు జీవితాలున్నాయి, ఉద్యోగప్రవృత్తి ఒకటి. సాహిత్య ప్రవృత్తి ఒకటి. గురజాడ అప్పల కొండయాంబ దగ్గర ఆంతరంగిక కార్యదర్శిగా వుంటే శ్రీశ్రీ నిజాం కొలువులోఉద్యోగం చేసేడు. గురజాడ జమీందారీవ్యవస్థకు కొమ్ము కాసేడంటే శ్రీశ్రీ వ్యాపారసంస్థలకు వత్తాసు పలికాడు- అయితే ఈ ఇద్దరిలో ఏ ఒక్కరూ కేవలం జీవికకోసం ఆదర్శాన్ని అమ్ముకొన్న వారుకారు. ఇద్దరికీ జీవితాన్ని అంటని స్వచ్ఛమైన అంతఃకరణం ఒకటుంది. ఇద్దరిలోనూ ప్రతిభా వ్యుత్పత్తులు సమపాళ్ళలో వున్నాయి. ఇద్దరూ తమకు అందినంత ప్రపంచాన్ని అవగాహన చేసుకున్నారు, ప్రతికూలశక్తుల బలం ఇద్దరికీ బాగా తెలుసు. కాదన్న మాదన్నలు కొందరున్నా ఇద్దరినీ మహాకవులని అన్నవాళ్ళెందరో వున్నారు. అయితే 'మహాకవి' అన్నది గురజాడకు మరణానంతరం వచ్చిన మర్యాద. శ్రీశ్రీ జీవించి వుండగానే ఈ బరువుని చాలాకాలం మోసేడు.

'కొత్త పాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా' అని మాటవరుసకు అన్నా గురజాడ గతాన్ని ఆదరించలేదు. మంచిగతమున కొంచెమేనోయ్' అని తన అభిప్రాయాన్ని ఖచ్చితంగాచెప్పాడు. పండితులు వెఱ్ఱి పురాణగాథలను నమ్మజెల్లదన్నాడు, దేవునికంటె ముందుగా మనిషిని గుర్తించవలసిన అవసరాన్ని స్పష్టంగా చెప్పేడు. "ఇతిహాసాస్పృతకోష్టము - లతికామ్రేడిక రచనలందిరి నృపతుల్" అని కృతిభర్తలకు, కృతికర్తలకు వాత పెట్టాడు. మంచి - మలినము అనేరెండు వర్ణాలను మాత్రమే పరిగణించేడు జ్ఞానమొకటే శాశ్వతంగా నిలుస్తుందని గ్రహించేడు. ఇంత ఆకళింపుతో నిబ్బరంగా-ఒకతరం ముందుగా గురజాడ 'వచ్చెనిదె బంగారుకాలము' అంటూ ఢంకా బజాయిస్తే శ్రీశ్రీ 'కించిద్విషాదం' 'కించిన్నిరాశ' 'కించిదసంతృప్తి' కమ్ముకోగా "నిజంగానే నిజంగానే నిఖిలలోకం నిండుహర్షం వహిస్తుందా!" అంటాడు. ఒక 'సకలాతీతశక్తి ఉన్నట్టా? లేనట్టా?', అనే సదసత్సంశయంలో కొట్టుకుంటాడు. ఏదో నిరాశగా ఇంతసేపూ వాగాను కదూ? అని సర్దుకుంటూ వుంటాడు. శ్రీశ్రీలోని 'చేదుపాట' గురజాడలో లేదు. గురజాడ పాత్రలు కూడా మరణంలో సైతం నిబ్బరంగా వుంటాయి.

వస్తువు విషయంలో, అభివ్యక్తి మార్గంలో, ఛందస్సులో గురజాడకు శ్రీశ్రీ కి భేదముంది 'లవణరాజుకల' 'పూర్ణమ్మ' 'కన్యక' 'డామను పితియసు' లలో కథవుంది. ఈ కథలు గురజాడవికావు, కాని తన పంథాకు పనికొస్తాయని వీటిని ఎన్నుకొన్నాడు. ముత్యాల సరములు 'కాసులు' అనేవాటిలో సన్నివేశాలున్నాయి. ఇవి గురజాడ తన ఆదర్శాలను వ్యక్తం చేయడంకోసం కల్పించినవి. ఈ కల్పనలకు ప్రేరణలున్నాయి 'దేశభక్తి' ప్రబోధగేయం. 'దించులంగరు' 'లంగరెత్తుము' గురజాడ అనుభూతులు 'మిణుగురులు' పిల్లలకోసం రాసినవి. 'బొట్టు' 'నీలగిరిపాటలు' మొదలైనవి వర్ణనలు. ఇలా వైవిధ్యమున్నా గురజాడ కథా మార్గం మీద మనసుపడ్డట్టు కనిపిస్తుంది. శ్రీశ్రీ కవితలలో 'భిక్షువర్షీయసి' 'ఆకాశదీపం' 'బాటసారి' లాంటివి రేఖాచిత్రాలు మాత్రమే అందులోని కథాంశం స్వల్పం. శ్రీశ్రీ కి కథ అక్కరలేదు. శ్రీశ్రీ లో ఉద్రేకానికున్న స్థానం కల్పనకు లేదు. గురజాడలో కూడా కల్పనా పటిమ పరిమితమే ఐనా అది శ్రీశ్రీ కంటె బాగా ఎక్కువ.

గురజాడలో అలంకారిక ధోరణిలేదు, అతని కవితలలో ఎక్కడా రసం శిల్పం లాంటి మాటలను కూడా వాడలేదు. అలంకారిక మర్యాద లన్నింటినీ ధ్వంసంచేసి కన్యాశుల్కం రాసేడు. అందుకే, ఇప్పటికీ కన్యాశుల్కంలో నాయకు డెవరు? రసం ఏమిటి? అని సిగపట్లు పట్టేవాళ్ళు కొందరున్నారు. శ్రీశ్రీ కూడా ఈ ప్రయత్నంలో కొంత పాలుపంచుకున్నాడు. గురజాడ ఆ పాతమాటల్ని, ఆ పాత పడికట్లనీ స్మరించకుండా తనదారిని తానుపోయేడు ఆ అడుగుజాడలో

వదుస్తున్నానని చెప్పినా శ్రీశ్రీ తరచుగా రసరాజ్యడోలలో ఊగుతూ దర్శన మిస్తాడు. ఒక ఊపులో రచనను ముగించే అతని ఆలోచన రసధుని, శిల్పాన్ని గూర్చి ఎత్తుకోకుండానే గురజాడ అనల్పశిల్ప సౌష్ఠవాన్ని సాధించేడు. శ్రీశ్రీ శిల్ప మనర్ఘమని ఘోషిస్తూనే కొన్ని భగ్నశిల్పాలను కలగన్నాడు. గురజాడ కవితలలో లాలిత్యం పాలు ఎక్కువ. చాలాచోట్ల అవి మృదువుగా వుంటూనే వాడిగా వుంటాయి రసపిపాసి కావడంవల్ల శ్రీశ్రీ కవిత్వంలో ప్రౌఢిమ ఎక్కువ. భావానికి తగ్గభాష ఉండాలన్న పట్టు శ్రీశ్రీ లో కనిపిస్తుంది ఆద్యంతం తన కవిత్వానికి ఒకే పాఠక వర్గాన్ని ఎంచుకున్న గురజాడ రచనలో ఒడిదుడుకు లుండవు. అందులో వైవిధ్యం లేదు. ఒక్కొక్కదశలో ఒక్కొక్కతీరుగా రాసి నందువల్ల శ్రీశ్రీ కవితలలో వైవిధ్యంతో పాటు కొన్ని ఒడి దుడుకులు కూడా వున్నాయి. గురజాడ అభివ్యక్తులు కొత్తవి. శ్రీశ్రీ అభివ్యక్తులలో ప్రయోగంతో పాటు సంప్రదాయధోరణి పురాణ ప్రతీకలు ఎక్కువ.

"మనః ప్రపంచానికి బాహ్యరూపం భాష
భాషా విప్లవమే భావవిప్లవం"

అంటాడు శ్రీశ్రీ. గురజాడ కవిత్వంలోని భాష వ్యావహారికంలా కనిపించే గ్రాంథికము. శ్రీశ్రీ కవిత్వంలో గ్రాంథికపు హళాహళితోపాటు విరుచుకుపడ్డ వ్యావహారికం సైతం కనిపిస్తుంది పిల్లలకోసం రాసినప్పుడు గురజాడ.

"బూరుగుచెట్టు - చిలకలతోను - ఏమనిపలికింది ?
పండినపండు - ఎండినదూదై - పకపకనవ్వింది"

అని ఒక తత్వాన్ని భాషని గుదిగుచ్చి చెప్తాడు. ఈ తేటు గురజాడలో అంతటా కనిపిస్తుంది. పిల్లలనుద్దేశించిన శ్రీశ్రీ "మీ హాసంలో మెరుగులు తీరును వచ్చేనాళ్ళ విభాప్రభాతములు" అంటాడు. శ్రీశ్రీ శబ్ద బ్రహ్మఅని అనిపించుకుంటే అనిపించుకోవచ్చును. కవితకు కావలసినది - కవితలో చూపవలసినది శబ్దంమీది ప్రభుత్వ మొక్కటేకాదు. దానిని తన పంథాలో అదునుకొద్దీ వాడుకునే పదును కూడా కావాలి. గిరాంమూర్తి తన ఇన్‌స్పిరేషన్‌గా, గురజాడ అడుగుజాడగా నోరారా పలికిన శ్రీశ్రీ కవితలలో క్రమ్మి - త్రాగుతూ - ప్రాకులాడు బ్రతుకు - ప్రక్కన - ప్రోవు - గుడ్డి - మ్రోగు - క్రక్కు - త్రొక్కు లాంటి ప్రయోగాలున్నాయి. నోళులు - వ్రేళులు వంటి బహువచన రూపాలున్నాయి. విచలద్విహంగాలు - గుంజన్మృదంగాలు - కవనపుహల్లీసకము - శరస్నిశీధినులు వంటి సంధి బంధాలున్నాయి, మనీషామారణాస్త్రం - మస్తిష్కకులాయంవంటి రూపకాలున్నాయి. రవ్వష్ణగీతి పవ్వగ్రహేతి వంటి వికృత ప్రాసక్రీడలున్నాయి. ఆదివృద్ధులతో భాషను సాగదీస్తారని విశ్వనాథవారిని విమర్శించేవారు వైష్ణవ్యగీతం చాంపేయమాల - యాథార్థ్యదృశ్యం - శైశవగీతి - శైశిరకాలం - వాసంత సమరం - అణుశక్తి - ఐంద్రకార్ముకం - బాడబాగ్నులు - శాత్రవదుర్మార్గాలు లాంటి పీకుడు ప్రయోగాలనొకసారి పరామర్శించాలి. పరీవృతుడు - వికాసించి నైకానోకహం కవుంగింట - హ్లాదసంపుష్టము - నిత్యవినీతిజ్ఞులు - సద్యోం హశ్చర్యలు - వంటివి మాంధాతలనాటి మాటలని మరచిపోకూడదు. ఇలాంటి ఒడిదుడుకులన్నీ శ్రీశ్రీ కి భాషపట్ల ఒకనిర్దిష్టమైన కట్టుబాటులేదని చెప్తున్నాయి. దీనికి ప్రజలభాష అనిపేరుపెట్టి ఆ ప్రవాహంలో పడికొట్టుకుపోయే గంధోళిగాళ్ళు కొందరు మనకు లేకపోలేదు. గురజాడ ఇందుకుపూర్తిగా భిన్నం,

"బ్రతుకునందు లేని స్థిరత - వెతకనేల భాషయందు" అని ప్రశ్నించి పాతపలుకుబళ్ళ వదలి తనకంటూ ఒక నిర్దిష్టమైన భాషను ఎన్నుకున్నాడు, నిజంగా అతనివి తేటైన మాటలు. చలంచెప్పిన పాతపదాలు - డిక్షన్ను గురజాడతోనే రాజన్నాడు. శ్రీశ్రీ ని అవి పూర్తిగా వదల్లేదు.

'లోకమందలి మంచి చెడ్డలు లోకు లెరుగుదురా?' అనే ప్రశ్న వేసుకున్నాడు గురజాడ. ప్రజగతానుగతికమైనదేగాని పారమార్థిక మైనది కాదని అతనికి తెలుసు. అందుకే తనకున్న జ్ఞానంతో మంచి చెడులను గూర్చి ప్రజలకు చెప్పాలనుకున్నాడు, 'నాటి ప్రజల ఉద్యమం' అని గురజాడ చెప్పినది అతని గుండెలోని మాట 'మీకోసం కలంపట్టి' అన్న శ్రీశ్రీ మాట అతని 'చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణ' లోంచి వెలువడ్డది. ఆ రెండూ తమ తమ పరిధుల్లో నిష్కళంకమైన ప్రకటనలు అయితే సంఘంతో ముఖాముఖీ తలపడ్డప్పుడు గురజాడకు శ్రీశ్రీ కున్నన్ని భరోసాలులేవు. గురజాడ వ్యక్తిగా పోరాటాన్ని సాగించేడు. శ్రీశ్రీ వెనుక ఒక సంఘటిత శక్తి నిప్పుల్లో దూకడానికి సిద్ధంగా వుంది. అయితే గురజాడకున్న అచంచల విశ్వాసం - నిర్విరామదీక్ష - బహుముఖ పరిశీలనం వ్యూహరచన శ్రీశ్రీ లో అంతగా లేవనిపిస్తుంది. ఎన్నోటు వ్యవహారాల్లో తలమునక లవుతూన్నా గురజాడ రచయితగా తన ఉనికిని విస్మరించలేదు. తాను చేయాలనుకున్నది చాలా వరకుచేసేడు. శ్రీశ్రీ కి అంత పని ఒత్తిడిలేదు. నిరంతరం ఊహాపోహలలో తేలుతూ తాను చేయాలనుకున్న కొన్నిపనులను ఆలోచన దశనూ దాటించి బయటకుతీసుకుని రాలేకపోయాడు. అయితే ఇది శ్రీశ్రీ కి ఒక లోటు ఎంతమాత్రం కాదు, నేరం అంతకంటేకాదు.

తాను సంఘంకోసం చెప్పేది కేవలం కవిత్వంలో ఉంటే చాలదనుకున్నాడు గురజాడ. ఎంత ప్రచారంలోకి వచ్చినా కవిత్వం పరిధి పరిమితమని అతడు గ్రహించేడు. అందుకే అణిముత్యాలు - కన్యాశుల్కం వెలువడ్డాయి. సమకాలీన సమాజంలో వచనానికున్న శక్తి ఏమిటో మనకు ముందుగా చెప్పిన రచనలివి. నేటికీ వచనంలో గురజాడ ముందునే వున్నాడు. 'దిద్దుబాటు' ను దాటి కథ ఎదగలేదని, 'కన్యాశుల్కం' వంటి గొప్పనాటకం ఇంకా రాలేదని ఇప్పుడుకూడా భావిస్తూన్న వారున్నారు. శ్రీశ్రీ కూడా వచన రచనల అవసరాన్ని, శక్తిని గుర్తించేడు కథలు రాసేడు. నాటికలు రాసేడు. వ్యాసాలు రాసేడు నాటకం రాయాలని చాలాకాలం ఆలోచించేడు. ఇంతచేసినా వచనంలో గురజాడ అనే పర్వతం ముందు శ్రీశ్రీ పిపీలికం అన్నదొక చేదునిజం.

గురజాడకు తనదంటూ ఒకతాత్విక భూమిక వుంది. అది మానవతా దృక్పథం. స్త్రీలమీద అతనికున్న జాలి - వారి సమస్యలపట్ల అతనికున్న అవగాహన అలవికానివి.

మగడు వేల్పన పాతమాటది;
ప్రాణమిత్రుడనీకు నీ వెనరు
కలుగకయున్న పేదను కలిగినను
నా వదపి వేల్పులరేని కెక్కడ—

పాతమాటను కత్తిరించి కోతపెట్టి స్త్రీ పురుష సంబంధాన్ని సరికొత్తగా చెప్పిన ఈ మాట తెలుగులో మొదటిది గురజాడ తాత్వికదృష్టికి ఇది ఆరంభం. అతని రచనలన్నిటా ఇది వ్యాప్తి చెందింది. శ్రీశ్రీ కి తనదంటూ ఒక తాత్విక భూమికలేదు. అభ్యుదయ మార్గంలో అతని మొదటిదశ మార్క్సు తత్వాన్ని అనుసరించి సాగింది చరమదశ మావో తత్వాన్ని అనుసరించి సాగింది. "ఏయే యెండల కాయాగొడుగులు" అంటూ మితవాదులు నేర్పేగుణపాఠాన్ని గురజాడ ఎప్పుడూ పట్టించుకోలేదు. గ్రీన్‌రూము చాణక్యుడైన శ్రీశ్రీ అభ్యుదయ దృక్పథంతో సమాజంలో నమోదైన ప్రతికొత్త శక్తికి చేయూతనివ్వడం ఆ గొడుగుల్లోకి దూరడం అతనికి నూత్నజవసత్వాల నిచ్చేయన్నది ఉన్నమాట. ఆ పరిణామం అతని నిత్యచైతన్యానికి గుర్తు కాని 'అదే చేదు సికీ అదే' అన్నమాటను గుర్తుచేస్తూ చరమదశలో గుండెల జట్టుకట్టి గురువుల మాట కొట్టి గురజాడ అభ్యుదయ సాహిత్యానికి పితామహుడు కాదని తానే త్రివిక్రమావతారం దాల్చాలనే ప్రలోభం శ్రీశ్రీ ని బాధించింది. ముంజేతి కంకణానికి అద్దమక్కరలేదు. అభ్యుదయసాహిత్యానికి గురజాడే ఆద్యుడనడానికి ఈ తరం వాళ్ళకే సాక్ష్యాధారాలు చూపవలసినంత దుర్దశరాలేదు.

# మంజరి

సురజాడ రాజశేఖర

మంజరి ఆపాదమస్తకము అవమానంతో భగ, భగ లాడుతోంది. ఎంత మరచిపోదామన్నా దుర్గమ్మ మాటలు, ఆ మాట్లాడిన తీరు మళ్ళి మళ్ళి గుర్తుకు వచ్చి మనసును మండిస్తున్నాయి.

దుర్గమ్మ వయసుతో నిమిత్తం లేకుండా షోకులన్ని పదింతలుగా చేసుకుంటుంది. నలభై దాటిన తరువాత అలాంటి షోకులన్ని అందానికి బదులు అసహ్యాన్ని కల్గిస్తాయనే ఆలోచన కూడా రాదామెకు.

దుర్గమ్మ రావటం మంజరికి ఎంతమాత్రము ఇష్టం లేదు. అయినా 'రావద్దు' అని అనలేదు. ఆ పల్లెటూళ్ళో ఎవరు బాహాటంగా ఎవర్ని ఏమీ అనలేరు. ప్రతి ఒక్కరు ఒకరి వెనుకన ఒకరు నేరాలు చెప్పుకుంటునే ఉంటారు.

ముఖం నిండా సంతోషాన్ని పులుముకుని వచ్చింది దుర్గమ్మ.

"ఇదిగో మంజు ఎంత తియ్యటి వార్త తెచ్చానో తెలుసా! ముందు నా నోటిని తీపి చెయ్యి—ఆ తరువాతనే సంగతి చెప్పేది—"

ఎదుటివాళ్ళ వచ్చదనాన్ని చూసి ఏమాత్రమూ ఓర్వలేని ఆ ముఖంలో సంతోషం చూసి భయపడింది కాని, దుర్గమ్మ నోటిని మాత్రం తీపి చెయ్యలేదు మంజరి. దుర్గమ్మ మూతిని ముప్పైఆరు వంకర్లు త్రిప్పింది.

"ఏమిటమ్మా కదలవు? ఓయబ్బో...అవునులే! ఇప్పుడు నీవు ఎంత బెట్టు చేసినా చెల్లుతుంది. కలవారి కాబోయే కోడలవి కదా!"

"ఏమిటండి" తీక్షణంగా అడిగింది మంజరి—

"అబ్బో....ఆ విసురు, ఆ దురుసు అన్ని పోతాయి. ఎలా అయితేనేం వెంకటరత్నంగార్ని నిన్ను పెళ్ళి చేసుకోవడానికి ఒప్పించేటప్పటికి నా తల ప్రాణం తోకకొచ్చిందంటే నమ్ము!"

"వెంకటరత్నంగారా...."

అప్రయత్నంగా మంజరి గుండె జల్లుమంది. గొంతు తడారిపోయింది. దగ్గర, దగ్గర అరవైపైన వయస్సు-తొమ్మిదిమంది పిల్లలు—ఆరుగురు మనవలు. కొద్దిక్షణాలు మవునంగా ఉండిపోయింది మంజరి.

"తెల్లబోతావేమ్మా? అవునులే! అసలు వెంకటరత్నంగారు ఒప్పుకోవడం అంటే మాటలా? ఏదో ఆయన నేను చెప్పబట్టి విన్నారు. అవునులెండి పిల్ల కాస్త పెద్దదే! మీకూ వయసుండిగా!....మీకు ఆడదక్షత కావాలయ్యే....మీలాంటివాళ్ళు ఆ పేదపిల్లను కరుణించకపోతే, ఇక ఆ పిల్లకి పెళ్ళయ్యేదెలా..." అని వాపోయాను. అక్కడితో ఆయన మనసు కరగి నా మాట కాదనలేక "సరె చూద్దాం!" అన్నారు—నేను ఆనందం పట్టలేక నీ దగ్గరకి పరిగెత్తుకొచ్చేసా..."

"అలాగే పరిగెత్తి ఇక్కడ్నించి వెళ్ళిపొండి దుర్గమ్మగారు. ఇంకొక్కక్షణం..."

మంజరి మాటలు పూర్తి కాకుండానే దుర్గమ్మ టక్కున లేచి తలుపు దగ్గర నిలబడింది. అక్కసును అణుచుకోలేక పోయిందావిడ. ఏం పోయేకాలమే! బంగారంలాంటి సంబంధం...ఇది వదులుకుంటే నీకు పెళ్ళి అవుతుందా?" అంది ఓ కాలు గడప అవతల పెడుతూ దుర్గమ్మగారు.

అప్పటిదాకా బిగపట్టిన కోపం మంజరిలో కట్టలు త్రెంచుకుంది. అంతే క్షణంలో మంజరి కళ్ళు ఎర్రబడ్డాయి. నాదగ్గరకు ఇంకెప్పుడు సంబంధాలు తీసుకు రాకు..."

"అవునులే పెళ్ళి కాలేదనే బెంగ నీకెందుకూ ...ఉన్న రోగిష్టి తండ్రి నీకేం పెళ్ళి చేస్తాడూ...సంబంధాలేం వెతుకుతాడూ....అని జాలిపడి సంబంధము తీసుకుని వస్తే గౌరవం కూడా లేకుండా నన్ను పొమ్మంటావా? బుద్ధులు ఎక్కడకి పోతాయి ...సుప్పనాతి బుద్ధులు ..." దీర్ఘాలు తీస్తూ అక్కడ్నించి కదలి క్షణంలో మాయమయ్యింది దుర్గమ్మ.

దుర్గమ్మ వెళ్ళగానే దుఃఖం అణచుకోలేకపోయింది మంజరి. తలుపులు గడియ వేసి పక్క గదిలో వున్న తండ్రికి ఏడుపు వినపడకుండా కొంగు నోటిలో కుక్కుకుంది.

తలుపు చప్పుడయ్యింది.

కళ్ళు తుడుచుకుని వెళ్ళి తలుపు తీసిందామె.

ఎదురుగా నుంచున్న ముప్పైఏళ్ళ యువకుడిని, అతడి చెయ్యి పట్టుకున్న ఆరేళ్ళ పాపని, ముద్దులు మూటగట్టే బాబును చూసి ఆశ్చర్యపోయిందామె అంతకుముందు ఎన్నడూ ఆ యువకుడ్ని ఎక్కడా చూసిన గుర్తు లేదు.

మంజరి తల రేగింది. చీర నలిగి ఉంది....కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అప్పటిదాకా ఏడ్వటంతో ముఖం దీనంగా ఉంది.

అతని కళ్ళు సానుభూతిగా చూశాయి.

అది గుర్తించిన మంజరి మనస్సులో రోషం మేల్కొంది.

"ఎవరు మీరు....ఏం కావాలి?"

"ప్లీజ్....కొంచెము లోపలకి రానిస్తారా!" సంస్కారంతో కూడిన అతని ప్రవర్తన ముందు కటువుగా ఉండలేకపోయింది మంజరి.

"రండి" అంది.

ఇంట్లో వున్న ఒకే ఒక్క కుర్చీలో అతడ్ని కూర్చోమని, తను మంచం మీద కూర్చుంటూ పిల్లలిద్దరి వైపూ చూసింది. రమ్మన్నట్లుగా సైగచేసి వాళ్ళను కూడ మంచంమీద తన పక్కన కూర్చోబెట్టుకుంది.

"మీ పేరు మంజరి కదూ"

"అవును"

"మీ నాన్నగారి పేరు దశరథరామయ్యగారు కదూ"

"ఏమిటిదంతా?"

"నా పేరు యశస్వి"

"అయితే"

నెమ్మదిగా అన్నాడు యశస్వి. "నేను మిమ్మల్ని స్వీకరించాలని వచ్చాను"

కాళికలా లేచింది మంజరి.

"షటప్....మీరు ఎవరో నాకు తెలియదు. అయినా మర్యాదిచ్చి కూర్చోబెట్టాను. తక్షణం ఇక్కడ్నించి వెళ్ళిపొం....డి"

కంగారుగా లేచాడు యశస్వి

"నేను ఎవరో మీకు తెలిసినట్లు లేదు . నేను ..."

"నన్ను స్వీకరిస్తారా? మీ ఎవరి దయాదాక్షిణ్యాలు అక్కర్లేదు"

"దయాదాక్షిణ్యాలు చూపించడానికి రాలేదు. మిమ్మల్నే అవి చూపించమని చెప్పటానికి వచ్చాను"

"నేనేమి పిల్లల తల్లిని కాదు. రెండో పెళ్ళివాడితో, పిల్లల తండ్రితో బ్రతుకు ముడేసుకోవలసిన ఖర్మ నాకేం లేదు"

ఏదో చెప్పాలని ముందుకు వంగిన యశస్వి ఈ మాటలతో ఉలిక్కి-

పడ్డారు. అతని ముఖం ఉదాసీనంగా మారిపోయింది. కాని మర్యాదగా "క్షమించండి వెళ్తాను" అన్నాడు.

యశస్వి ధోరణి ఆమెకు కొత్తగా, వింతగా ఉంది.

"రండమ్మా" పిల్లల్ని పిలిచాడు.

అప్పటికి పాప చెయ్యి మంజరి చేతిలోనే ఉంది. ఆ చెయ్యి నెమ్మదిగా విడిపించుకొంది పాప. పాప తన పక్కనే పెట్టుకున్న అట్టపెట్టె తీసి పద్మ చేతికిచ్చింది.

"ఏమిటిది?"

"చీర మీకోసం తీసుకొచ్చాను"

"మీరెవరు? ఇలా అకస్మాత్తుగా రావడమేమిటి? వస్తూ చీర తీసుకురావడమేమిటి? నేను అడ్డమైన వాళ్ళదగ్గరా, చీరెలు సారెలు తీసుకునేదాన్నని ఎవరు చెప్పారు మీకు?"

"అన్ని వివరంగా చెప్పాలని వచ్చాను. ఇప్పుడింక ఏమీ చెప్పాలని లేదు"

"ఎందుకు"

"మీలాంటి కన్యను నన్ను స్వీకరించమని అడగటం అన్యాయమే! స్వార్థం సరిగా ఆలోచించనియ్యలేదు"

విచిత్రంగా చూసింది మంజరి.

"మిమ్మల్ని బాధపెడితే క్షమించండి. తిరుగు బస్సుకి టైమయ్యింది. మేము వెళ్ళాలి" అంటూ లేచి నిలబడి మంచం దగ్గరికొచ్చి బాబును ఎత్తుకొని పాపను రమ్మన్నట్లుగా సైగ చేశాడు.

"ఈ చీర నేను తీసుకోను" అంది మంజరి గొంతు పెగల్చుకొని.

"పాపకు ఇచ్చెయ్యండి" చేతులు జోడించి బయటకు నడిచాడు యశస్వి. బాబుతో వెళుతున్న యశస్విని చూస్తూ ఆ పేకెట్‌ను పాప చేతిలో పెట్టింది మంజరి.

"దీంట్లో చీర ఉంది. నాకెందుకూ? నేను ఫ్రాక్ తొడుక్కుంటాను" అంటూ పాకెట్‌ను మళ్ళీ మంజరి దగ్గిరే పడేసి పరిగెట్టి తండ్రి దగ్గరకి వెళ్ళిపోయింది పాప.

తొందరపడ్డానేమోనని ఒక క్షణం బాధపడింది మంజరి. తలుపును దగ్గరగా వేసి మంచంమీద వాలుతుండగా కనిపించింది ఆమెకు పాప వదిలి వెళ్ళిన పాకెట్. జాగ్రత్తగా విప్పిందామె పాకెట్‌ను. కనకాంబరం రంగు పట్టుచీర వెక్కిరిస్తూ కనిపించిందామెకు.

ఇంతలో లోపల్నుంచి——

"మంజూ" దశరథరామయ్యగారు పిల్చారు.

"వస్తున్నా....నాన్నా" అంటూ ఆమె చీరెను ప్యాకెట్‌లో పెట్టి వేగంగా నడిచింది లోనికి.

"దాహంగా వుంది కాసిని మంచినీళ్లు ఇస్తావామ్మా"



"అలాగే నాన్నా ఒక్క క్షణం" వంట గదిలోనికి వెళ్ళి గ్లాసుతో నీళ్లు తీసుకొని వచ్చి ఆయన నోటికి అందించిందామె.

ఆత్రంగా అందుకున్నాడాయన గ్లాసును. "మంచి నిద్ర పట్టిందమ్మా...." అంటూ మాట్లాడుతున్న ఆయనకి అడ్డు వస్తూ "మందు వేసుకున్నావా నాన్నా" అంది మంజరి.

"లేదమ్మా" అంటూ కళ్ళు, కళ్ళన దగ్గసాగాడు ఆయన.

మంజరి ఆందోళనగా ఆయన గుండెమీద చెయ్యితో రాస్తూ "బాధగా ఉందా నాన్నా!" అంది.

"లేదమ్మా! ఏం లేదు....హాయిగా బిడ్డా, పాపలతో ఇల్లు దిద్దుకోవలసిన నువ్వు....ఈ వయస్సులో ఆ ముష్టి ఉద్యోగం చేసుకుంటూ ఈ ముసలాడితో యాతన పడుతూ... "

తండ్రి మాటలు పూర్తి కాకుండానే అసహనంగా అడ్డు తగిలింది మంజరి. "నిన్ను అలా మాట్లాడవద్దని ఎన్నిసార్లు చెప్పాను? ఇప్పుడు నాకేం తక్కువయ్యింది? హాయిగా వున్నాను. నన్ను చూసి జాలిపడాల్సిన అవసరం ఏమొచ్చింది"

దశరథరామయ్యగారు మాట్లాడలేదు. కూతురంటే ఆయనకి ప్రేమ మాత్రమే కాదు భయం కూడా.

"ఇదిగో ఈ మందు వేసుకో నాన్న" అంది మంజరి ఆయన దగ్గరకి వస్తూ.

"ఎందుకమ్మా మందులు....! త్వరగా నేను దాటిపోయే మందులుంటే ఇవ్వు...."

"నాన్నా! నేను నవ్వుతూ ఉంటే చూడలేక పోతున్నావా! నేను బావురుమని ఏడిస్తే కాని, నీ కడుపు చల్లబడదా? కాని నేను ఏడవను నాన్న, ఏడ్వటానికి పుట్టలేదు నేను"

నవ్వుతూ నిర్లక్ష్యంగా మాట్లాడుతున్న మంజరిని చూస్తుంటే ఆయనకి దుఃఖము పొంగుకు వచ్చింది.

"లేదు తల్లి....లేదు. అప్పుడప్పుడు పిచ్చిగా వాగుతూ వుంటాను. మందివ్వమ్మా....ఇవ్వు" నవ్వడానికి ప్రయత్నించాడు దశరథరామయ్యగారు. గ్లాసులో మందు కలపి ఆయనకిచ్చి, ముందర గదిలోనికి వచ్చింది మంజరి భారంగా.

అదే క్షణంలో వచ్చింది సుభద్ర.

ఆ పిల్లకి పట్టుమని పదిహేనేళ్ళుండవు. అన్నీ ముది కబుర్లే. ఆ పిల్లతల్లి ఆ అమ్మాయి ఎదురుకుండానే తన కూతురికి ఇంకా పెళ్ళి కాలేదనే ఆరాటం బయటపెడుతుంది. అక్కడితో ఆ అమ్మాయికి కూడా తను త్వరగా పెళ్ళి చేసుకోవాలనే తపన బయలుదేరింది.

"మంజక్క ఇందాకడ ఎవరు వచ్చారు"

"నాకు తెలీదు"

"బాగా డబ్బున్నవాడిలా వున్నాడు"

"మరేమో"

"చాలా బావున్నాడు కదూ!"

మంజరి విచిత్రంగా చూసింది.

"నిన్ను పెళ్ళి చేసుకోమని అడిగాడు కదూ"

"నీకెలా తెలుసు"

"చాటుగా విన్నాను"

సుభద్రనే కళ్ళప్పగించి చూస్తూండిపోయింది మంజరి.

"అక్కా! పోని ఆయన సంగతి మా అమ్మకు చెప్పకూడదూ"

"ఎందుకూ"

"నువ్వు ఎలాగు చేసుకోను అన్నావుగా పోనీ నాకు ప్రయత్నిస్తుంది"

నిర్ఘాంతపోయి చూస్తూండిపోయింది మంజరి.

సుభద్ర సిగ్గుపడుతూ మెలికలు తిరిగిపోయింది.

"ఫో అక్కా! అలా చూడకు నాకు సిగ్గేస్తుంది" అంటూ లేడిపిల్లలా పారిపోయింది.

క్రమ, క్రమంగా మంజరి ముఖంలో నవ్వు చోటు చేసుకోసాగింది.

"ఎవరమ్మా మంజు వచ్చింది" దశరథరామయ్యగారు అడిగారు.

"ఎదురింటి పరమేశ్వరశాస్త్రిగారి కూతురు నాన్న"

"అమ్మా! మంజు ఒక్కసారి ఇలా నా ప్రక్కన కూర్చో తల్లీ" ప్రేమగా పిల్చారు దశరథరామయ్యగారు.

"నాన్నా" అంది మంజరి మంచము మీద కూర్చుంటూ.

"పట్నంలో వున్న గోపాలం బాబాయికి ఉత్తరం వ్రాయాలమ్మా"

"రెండో రోజులు క్రితమే కదా నాన్న ఉత్తరం వ్రాయించావు. అప్పుడే ఎందుకు" అంది మంజరి.

"లేదమ్మా వ్రాయాలి తప్పకుండా వ్రాయాలి....లేకపోతే"

"ఏమవుతుంది నాన్నా, ఏమీ అవదు. నా పెళ్ళి సంబంధాలు గురించేగా వ్రాయమంటావు. వద్దు ఆ విషయమయితే అసలే వద్దు" అందామె చిరుకోపంగా

"అవునమ్మా! కన్నతండ్రిని కదా! కళ్ళు లేకపోయినాగాని, ఈ మంచంలోంచి లేవలేకపోయినా గాని, కన్నతండ్రిగా...నా బాధ్యతగా ఏదో ఒకటి చెయాలి కదమ్మా" అన్నారాయన.

"నీవు ఏమి చేయనక్కర్లేదు నాన్న. ఇలా మాట్లాడి నన్ను బాధపెట్టకుండా వుంటే చాలు" అంది మంజరి గాద్గదిక స్వరంతో.

"అవునమ్మా బాధపెట్టాను. ఇక నిన్ను బాధ పెట్టను తల్లి బాధపెట్టను...."

"ఎందుకు నాన్న అలా బాధపడతావు. అసలే నీ ఆరోగ్యం బాగాలేదు"

"రేపో, మాపో రాలిపోయే ఈ వృద్ధుడి కోసం పండంటి నీ జీవితాన్ని నాశనం చేసు..." మిగిలిన మాటలను దగ్గు మింగేసింది.

"ఎందుకు నాన్న ఆవేశపడతావు" అంటూ మంజరి ఆయన గుండెలను చెయ్యితో రాయసాగింది.

"మంజు...పెన్ను కవరు తీసుకురా తల్లి"

............

"ఈ ఒక్కసారికే చేసెయ్యమ్మా. ఇంకెప్పుడూ నిన్ను ఉత్తరం వ్రాయమని విసిగించను"

మంజరికి బాధగాను, విసుగ్గాను వుంది. కవరు, పెన్ను తీసుకు రావడానికి ముందర గదిలోనికి వెళ్ళిందామె.

"మంజూ పెన్ను, కవరు తీసుకు వస్తున్నావా" గట్టిగా పిల్చారు దశరథరామయ్యగారు.

"ఇదిగో" అంటూ ఆయన ప్రక్కన కూర్చుంది మంజు. కొద్ది క్షణాలు మవునంగా ఉండిపోయారాయన.

"మంజు నేను ఉత్తరం చెప్పటం ముగించేంతవరకు నువ్వు మాట్లాడవద్దు"

"అలాగే....చెప్పండి"

"ఊ..."

"నాన్న ఉత్తరం చెప్పండి" కొంచెం గట్టిగా అంది మంజరి. గొంతుకను సవరించుకున్నారు దశరథరామయ్యగారు.

"కొంచెము నెమ్మదిగా వ్రాయమ్మా"

## లవ్ ఈజె జర్నీ

ఎన్ని కోట్ల నిస్స్పృహా నిరీక్షణల
ఎడారి ఇసుక కణాలు గడిచి,
ఎన్ని తాత్కాలికానందాల ఒయాసిస్సులని
దిగవిడచి
నీ ప్రేమ మధ్యధరా వాతావరణాన్ని
చేరుకోవాలనుకున్నాను!
చూడు, నీరాణీత్వపు అంబారీని మోసి
నాబుజాలెలా ఒంటెల మూపుల్లా
వంగిపోయాయో
ఈ ఖర్జూరవృక్షం క్రింద
నీ అనురాగాన్ని చవిచూడాలని ఆశతో
నడచి వచ్చిన నాకాళ్ళెలా
ఒంటె కాళ్లలా మందగించాయో చూడు
అంతులేని ఆనందపు ఇంద్ర ధనుస్సులు
విదురవుతాయనుకున్న నేను
నీరుత్రావశక్యం గాని మరీచికల భ్రమలలో
పడి జాడలేకుండా కొట్టుకు పోయాను.

శ్రీ దేశెట్టి కేశవరావు

## గానం

కన్నడమూలం: డా॥ కె.వి. పుట్టప్ప.
అనువాదం : మార్కండపురం శ్రీనివాస

దూరానికి దూరానికి బహు బహు దూరానికి
ఎగిరెద గాన విమానములో;
మేఘపు దూరానికి, గగనపు దూరానికి,
శశిరవి తారల అవతల తీరానికి
మామికు, అందని భవ్య అపారానికి,
మనసుకు అందని దివ్య అతీతానికి,
దూరానికి దూరానికి బహు బహు దూరానికి,
ఎగిరెద గాన విమానములో!
ఎగురుతు ఎగురుతు భూర్భువ స్వర్గములను
ఆత్మవిలయములో కౌగిలించెద
ఎండకు ప్రసరించెడి మంచువోలె
లోకలోకాలు ప్రసరించెద!



"అలాగే నాన్న" వ్రాయడానికి ఉపక్రమించిందామె.

చెప్పటం ప్రారంభించారు ఆయన—

చిరంజీవి గోపాలానికి ఆశీర్వచనములతో దశరథరామయ్య వ్రాయునది. నా ఆరోగ్యం అంతంత మాత్రంగా వున్నది. నేను ఎక్కువ కాలం జీవించక పోవచ్చు. నీకొక ముఖ్య విషయం వ్రాస్తున్నాను. ఈరోజు మధ్యాహ్నం యశస్వి వచ్చి వెళ్ళాడు....

అంతే ఉత్తరం వ్రాస్తున్న మంజరి గుండె ఒక్కసారిగా ఆగిపోయి మళ్ళీ కొట్టుకోసాగింది వేగంగా. ఏదో అందామని నోరు తెరిచింది కాని మాట పెగల్లేదు.

అదే క్షణంలో కళ్ళు, కళ్ళుమని దగ్గసాగారు దశరథరామయ్యగారు. దగ్గు క్రమ, క్రమేపి ఎక్కువ కాసాగింది. ఆందోళనగా లేచింది మంజరి. ఉత్తరం, పెన్ను ప్రక్కనబెట్టి. గట్టిగా పట్టుకుందామె తండ్రిని.

ఉన్నట్టుండి దగ్గు ఆగిపోయిందాయనకు. ముక్కు వెంట నెత్తురు రాసాగింది. అలా ఎప్పుడూ ఆమె చూసి ఉండలేదు.

భయపడిపోయింది మంజరి.

మంచం మీద వెనక్కి వాలిపోయారు దశరథరామయ్యగారు.

"నాన్న....నాన్న... " ఆందోళనగా భయంగా పిలిచిందామె. ప్రక్కనే వున్న గుడ్డతో ముక్కుని తుడిచింది.

మెల్లగా విచ్చుకున్నాయి ఆయన పెదవులు. "బాబాయిని....బాబాయిని....రమ్మని వ్రా....నే...." అంటూండగానే దగ్గు తెర వచ్చి మిగతా మాటలను మింగేసింది.

"మాట్లాడకు నాన్న....కాస్సేపు విశ్రాంతి తీసుకో" అంది మంజరి ఏడ్పు గొంతుకతో.

"విశ్రాంతి....ఇలా బ్రతుకుతూ నిన్ను పెళ్ళి కాకుండా చూడటం నా దౌర్భాగ్యమమ్మా" అంటూ తలక్రింద ఉన్న దిండు క్రింద తడిమి ఒక చిన్న కాగితాన్ని బయటకు తీసారు

"ఏమిటి నాన్న అది!"

"నీ జీవితం తల్లీ .." ఇంకేదో అంటుండగానే ఒక్కసారిగా గుండె పట్టుకొని బాధతో మెలికలు తిరిగిపోయారు దశరథరామయ్యగారు. అదే క్షణంలో ఆయనలోని జీవుడు అనంతాల్లోకి దూసుకుపోయాడు.

పిచ్చిదానిలా చూస్తూండిపోయింది మంజరి.

నెమ్మదిగా తండ్రి ఇచ్చిన కాగితంకేసి చూసింది. 'యశస్వి అని మన బంధువులు కుర్రాడు. మంజరిని చూడడానికి ఎల్లుండి వస్తున్నాడు—గోపాలం వెక్కిరిస్తూ కనిపించాయామెకా అక్షరాలు.

నెమ్మదిగా లేచి నిలబడిందామె. తెరచి వున్న దశరథరామయ్యగారి నోటిని చెయ్యితో మూసింది. నెమ్మదిగా, అతినెమ్మదిగా యేడ్వసాగిందామె. క్రమక్రమేపి ఏడుపు తగ్గసాగింది. అంతే! ఒక్కసారిగా మంజరి నవ్వసాగింది.

## ఉదయ కిరణాలు

నానావర్ణ శోభితములై
అఖండజగతికి మిసిమిసి
హత్తింపజేస్తున్నాయి,
సచ్చిదానంద రూపమై
సకల జగత్తును
చొక్కింపజేస్తున్నాయి।
సౌభాగ్య దాయకమై
నిఖిల ప్రపంచానికి తెలివిని
చొప్పింపజేస్తున్నాయి!
అశేష శక్తులమయమై
సంపూర్ణ ప్రపంచాన్నే
చరచరా బిరబిరా
చౌకళింప జేస్తున్నాయి!
"లలితా దేవి"
కేశపాశపున్నాగసౌరభాలో
ఫాలతిలక చూర్ణ కణాలో
లోచనయుగ్మ భవ్యాలోకనాలో
నాసాభరణ ప్రభావలయాలో
తాటంక యుగళ చిత్రజ్వాలలో
పుక్కిటివిడెపు మాధుర్యశీకరాలో
మేని అరుణాంశుక వర్ణ విన్యాసాలో
పాదనూపుర రమ్యనాదాలో
ఏమో !
అవి !

## నీవెచ్చని కైదండతో చల్లనితలపుతో

నా
వినీల నేత్రయుగ్మ జ్యోతులే
మంగళ తూర్యాలై
నా
చిగురుటధరాల సరసపుమాటలే
శుభలేఖలై
నా
అమలిన మానసరాగమే
ఇంచి మంచిమై
నా
మృదులగాత్ర విద్యుత్తులే
పరిమళవీడియమై
పసందుగా
నిన్ను ఆహ్వానిస్తుండగా
కాలహరణందేనికి
స్వామీ !
శీఘ్రమే గ్రహియించి
నీ వెచ్చని కైదండతో
చల్లని తలపుతో
నన్ను పవిత్రం చేయి !
"కల్యాణిగ "
"మంగళ దేవతగా"
"సరస్వతిగా"
నన్ను-ప్రకాశింపజేయి!

## ప్రణయ బాధ !

మొగలిరేకుల గోర్లల్లో
సువర్ణ శరీరపు రేఖల్లో
హృదయ కవాటంలో
పెదవుల బరణిలో
కంటి చూపుల వలల్లో
కురుల మబ్బుల్లో
ఎక్కడ దాచి పెట్టినా
ఎక్కడ కప్పి పుచ్చినా
శరీరం నఖముఖాల్లోనూ
బహిరంగమవుతూ
పిడిస్తుంటుంది!
గుదివడ జేస్తుంటుంది!
దూపటిల్ల జేస్తుంటుంది!
"ప్రణయ బాధ" !
సౌమ్యమైంది, సౌఖ్యమైంది,
కాదది!
క్రూరమైంది, కఠినమైంది,
దుష్టమైంది
భయంకరమైంది !!

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు



డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

# 'ద్రావిడ' శబ్ద పునరాలోచన

'ద్రావిడ' అనే శబ్దం మూడు అర్థాలలో వాడబడింది. దేశ, జన, భాషా సూచకంగా. ద్రావిడ దేశమంటే మనకు చప్పున స్ఫురించేది తమిళదేశమే. అలాగే ద్రావిడులన్నా ద్రావిడమన్నా మనకు తమిళులు, తమిళ భాషలే స్ఫురిస్తాయి. అది పో ఒకటిన్నర శతాబ్దాలుగా పరిశోధకులు ఈ స్ఫురణ తప్పని 'ద్రావిడ' శబ్దం తమిళాన్ని మాత్రమే కాకుండా దక్షిణ దేశాన్ని, దాక్షిణాత్య ప్రజలను, భాషలను సూచించే విశాలార్థం ఉన్న 'మాట' అని అంటున్నారు. ఈ అభిప్రాయాన్ని సమర్థించే నిరూపణల కోసం వెదుకుతున్నారు. కూడినంతలో సేకరించిన విషయాల్ని ఆధారంగా ద్రావిడ సిద్ధాంత స్థాపనకోసం చాలా 'సిన్సియర్'గా ప్రయత్నాలూ చేస్తున్నారు. భారతీయ భాషలపై పరిశోధించే 'ఇండియన్ లింగ్విస్టిక్ అసోసియేషన్' లాగానే దక్షిణాది భాషలపై పరిశ్రమించే 'ద్రవిడియన్ లింగ్విస్టిక్ అసోసియేషన్' కూడా ఏర్పడింది. విశ్వవిద్యాలయాల స్థాయిలో తెలుగు కన్నడ మళయాళ తమిళాది భాషలు ద్రావిడ భాషలు అన్న విషయం శాస్త్రీయ సత్యంగా అంగీకరించబడుతోంది. పఠన పాఠన పరిశోధన రంగాలలోనే 'ద్రావిడ' సిద్ధాంతం ఇంకా ప్రచలితంగా వుంది.

సామాన్యజనుడికి అటు ఉత్తరంలోనైనా ఇటు దక్షిణంలోనైనా తాను 'ఆర్యుడి'నని కాని, 'ద్రావిడుడి' ననికాని స్ఫురణ ఉన్నట్లుగా దాఖలాలు లేవు. తమిళదేశంలో మాత్రం ఒక ఉద్యమస్థాయిలో 'ద్రావిడ' తత్త్వ ప్రచారం ఇప్పటికీ ముమ్మరంగా సాగుతున్నా భారతీయతా స్పృహను అధిగమించలేకపోతోంది. ప్రాంతీయతాధోరణిని రెచ్చగొట్టడంలో 'తమిళుకం' సాధించిన ప్రయోజనం ఏమీ లేదని చరిత్ర నిరూపించింది. ఏ దేశ ప్రగతి అయినా ఆ దేశ ప్రజలు సాధించే ఆర్థిక సామాజిక సాంస్కృతిక అభివృద్ధిలో భాగంగా వుంటుంది. ఇక్కడ మనం అంటున్న 'సంస్కృతి' జీవనసరళిని సూచించే మాట తప్పా జాతుల్ని వేరుచేసే సాధనం కాదు. అందుకే కన్యాకుమారినుండి కాశ్మీరం దాకా ఒక 'భారతజాతీయతా స్పృహ' మనలో వుంది. అదే మన 'జాతి'. అంతే తప్పా మనం ఆర్యులమూ కాము-ద్రావిడులమూ కాము.

అందేత ముందుగా ఒక అతి సామాన్యమైన సందర్భాన్ని చర్చిస్తాను.

"...వివాహము జరుగునట్లు ఆర్యులచే నిశ్చయించబడినది.
కావున తాము బంధుమిత్ర సకుటుంబ సపరివారముగా
విచ్చేసి వధూవరులను......"

అని శుభలేఖల్లో ఒకప్పుడు దేశమంతటా (ఇప్పటికీ రాయలసీమ పల్లెల్లో ఈ రైతి మిగిలి వుంది) ఉండేది. ఇక్కడ వున్న 'ఆర్యులు' ఎవరు! 'బ్రాహ్మణులు' అని మనకు అనిపిస్తుంది. ఎందుకంటే వాళ్ళే ముహూర్తాలు పెట్టే ఉద్యోగం చేస్తుంటారు కాబట్టి. అప్పుడు అలా ముహూర్తం పెట్టించుకున్నవాళ్ళు 'అనార్యులు' కావాలి. ఇక్కడ పరిశోధకుడు వెంటనే మనం 'ద్రావిడులం' అన్నమాట — అందుకే 'ఆర్యులచే' అని తనాటికీ మనం ఆర్య దాస్యభావంతో రాస్తున్నాం. అని నిర్ణయిస్తాడు. బ్రాహ్మణులు కూడా తమ శుభలేఖల్లో 'ఆర్యులచే' అని రాస్తున్నారు. ఇప్పుడేమనాలి! దక్షిణ దేశంలోని బ్రాహ్మణులు 'ఆర్య' బ్రాహ్మణులు కారు. 'ద్రావిడ' బ్రాహ్మణులు అని సమాధానం చెప్పుకోవాలి. ఇంతకీ ఆర్యావర్తమన్నా అంటే వింధ్య హిమాచలాల నడుమ వున్న భూమిని ఆర్యావర్తమంటారు. కృష్ణసారమృగం ఎందాకా తిరుగుతుందో అందాకా ఆర్యభూమి అని పండితులు సమాధానం చెబుతున్నా 'బ్రాహ్మణ' విషయప్రసక్తి వచ్చినప్పుడు ఆర్య-ద్రావిడ భేదం లేదు. పురుషసూక్తంలో చెప్పబడ్డ 'బ్రాహ్మణుడు' ఆర్యుడో! ద్రావిడుడా!

ఆర్య'వైశ్య'కులం-అంటుంటాము. వైశ్యులందరూ ఆర్యులనే తప్పా— ద్రావిడ వైశ్యులన్నా భిన్నులని కాదు. అసలు ఆర్యశబ్దానికున్న అర్థాల్ని పరిశీలిస్తే మనకు తెలిసే విషయాలు రెండు:

1) ఆర్యశబ్దం కుల-జాతి-సూచికాదు.
2) ద్రావిడేతరుడనే అర్థం కూడా ఎక్కడా రికార్డు కాలేదు.

* * *

బిషప్ కాల్డ్‌వెల్ 1856లో ద్రావిడ-దాక్షిణాత్య భాషల తులనాత్మక వ్యాకరణాన్ని రాశాడు. అంతకుముందే కొంతమంది దాక్షిణాత్యభాషల్ని ప్రత్యేక లక్షణాలు కల్గినవారిగా గుర్తించి ఉన్నారు. 'మలబార్' భాషలని కొందరు పిలిచి పిలిచారు. తొలిసారిగా 'ద్రవిడియన్' అనే పేరును వాడిన వారు మాత్రం కాల్డ్‌వెల్ మహాశయుడే.

ఆయన కూడా 'ఈ మాట (ద్రావిడ) అధికంగా తమిళాన్ని సూచించే మాట అయినా దాక్షిణాత్య భాషలలోని సామాన్య లక్షణాలకు సంకేతంగా ఈ మాటనే గ్రహిస్తు'న్నానని చెప్పారు.

కాల్డ్‌వెల్ కాలానికి దేశీయ పండితులలో 'ద్రావిడ' అన్న భాషా కుటుంబం భారతదేశంలో ఒకటి వుందని తెలియదు. వారికి తెలిసినవి రెండే: 1) సంస్కృతం 2) దేశభాషలు. మహారాష్ట్రి భాషనైనా తమిళాన్నైనా వారు దేశభాషలుగానే గుర్తించారు. ఈ జనసామాన్య అభిప్రాయాన్ని వ్యక్తీకరించే క్రింది మాటలను చూడండి.

"ఏ భాష ఆడేవారిని ఆ జాతివారు అంటున్నారు. ఈ భాషలు విచారించ వలసి వస్తే భాషలు యావత్తు దేశములదిగాని మతములది కాదు. ఈ దేశములకు ఉత్పత్తిస్థానం తెలుగు. కాండ్ల పేరే గీర్వాణులు. ఆది భాష వేదం, శాస్త్రాలు తన్మయముయి ఉన్నది కనుక ఆ భాషకు మాతృభాష అని, సమత్కృతం సంస్కృతం అని అంటున్నారు. కర్ణాటకం అంటే 'కర్ణానాం అటతీతి కర్ణాటకః'- అందరి చెవులలోనుంచి చొచ్చనటించేది కనుక కర్ణాటకం, తాత్పర్యం 'బహువిన కలిగినది', అనే యీ ప్రకారంగానే "ఎడిమాంజీ" యాభైయారు దేశాలకు ఉన్నవి...ఇందుకు కర్ణాటకస్థులు కర్ణాటకం, ఆంధ్ర దేశస్థులు ఆంధ్రం...ద్రవిళ దేశస్థులు ద్రవిళం...అనుటాయగాని యెవరు తమరంతా ఒకటి అని అనుకొని మతాన్ని గురించి వేరే భాషలు ఆడేది లేదు"

(కావలి వెంకట బొర్రయ్య: అతను వ్యవహార తంత్రం మెకంజీకై పేయత్తు (1802):2)

పై మాటల్లో 'మతం' ప్రసక్తి వుంది. ద్రవిళ దేశస్థులనే వాడుక వుంది. తప్పా ద్రవిళమతం-తమిళయాయులు మాట్లాడటం అనే అర్థంలో 'ద్రవిళ'-అనే భాష పేరు లేదని తెలుపుతున్నాడు ఆయన. సంస్కృతంనుండే భారతీయ భాషలన్నీ పుట్టాయన్నది సాంస్కృతికమైన అవగాహనకు సంబంధించింది. కాని సంస్కృత-ప్రాకృత భాషలలో లేని కొన్ని ప్రత్యేక లక్షణాలున్న భాషలూ ఉన్నాయని సంప్రదాయావగాహనలో వుండటానికి విభాష-ప్రతిభాష-ప్రతినియతభాష-అపభ్రంశం-వికృతి-శబ్దాలను వాడటం ద్వారా భిన్నశాస్త్రాల్లో ఈ 'దేశీయ' భాషా వైవిధ్యం గుర్తించబడి వుండటమే నిదర్శనం.

ఉదాహరణకు తెలుగుభాషకు వ్యాకరణం రాసిన వారందరూ శబ్దజాలం-తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యాలని నాలుగు విధాలని చెప్పారు. తత్-శబ్దానికి సంస్కృత ప్రాకృతాలని అర్థం. తత్సమ-భావాలు కాని 'దేశ్య' శబ్దాలున్నాయని గుర్తించటం జరిగినా-ఈ దేశభాషల కుటుంబం ఒకటి వుందని కాని - అది సంస్కృతం కన్నా భిన్నమని కాని-ఈ దేశభాషల సంస్కృతి-ఒకటి ప్రత్యేకమని కాని గుర్తించటం మాత్రం జరగలేదు.

సరిగా కాల్డ్‌వెల్ తులనాత్మక వ్యాకరణం పుట్టిన తరువాత జరిగిన పరిశోధనలు ద్రావిడ సంస్కృతి ప్రత్యేకమనీ-అది ఆర్య సంస్కృతికన్నా భిన్నమైందనీ నిరూపించడానికి ప్రయత్నించాయి. భాషల నిర్మాణంలోనూ, పదజాలంలోనూ కూడా ఈ భిన్నత కనిపిస్తోందని ప్రతిపాదించాయి.

* * *

ఉదాహరణకు 'శకటరేఫ' ధ్వని ఉన్న సంస్కృత ప్రాకృత పదం లేదు. అలాగే శకటరేఫకు, (ద్విరుక్త) టకారానికి నడుమ వ్యత్యయం (ఏఱు-ఏటి; చిఱు-చిట్టి; కఱచు-కాటు; చెఱగు-చేట) కూడా తెలుగు తమిళాది భాషల్లో కనిపిస్తోంది తప్ప ప్రాకృత భాషల్లో కాని, సంస్కృతంలో కాని ఈ మార్పు కనిపించదు.

ఈ వ్యాకరణ నియమాలు, ఈ విలక్షణ ధ్వనులు తెలుగులో ఉన్నాయని గుర్తించటం వరకే వ్యాకరణం చెయ్యగలిగిన పని. మీదు మిక్కిలి వ్యాకరణం కవులకు సుశబ్ద అపశబ్ద పరిజ్ఞానం కలిగించటం కోసం-అన్న దృక్పథం కూడా వైయాకరణులు శబ్ద-భాషా తత్త్వపరిణామాలను గురించి ఆలోచించకుండా చెయ్యటంలో బాగా పనిచేసి వుండాలి.

తెలుగు సాహిత్యం అంతా సంస్కృతాన్ని ప్రాణవాయువుగా కలిగి పుట్టింది. భారతదేశమంతటా సంస్కృత వాఙ్మయం పెద్ద మర్రిచెట్టులాగా గాఢమైన ఊడలు దిగి వ్యాపించింది. ఈ వ్యాపనం చేతనే దేశభాషలన్నీ సంస్కృతం నుంచే పుట్టాయి అన్న సాంస్కృతికాపగాహనను అధిగమించి తెలుగులో కనిపించే ఈ అదనమైన అంశాలు (శకటరేఫ ఇత్యాదులు) ఎలా రాగలిగాయి! అన్న మౌలికమైన సమస్యను గురించి దేశీయ పండితులు ఎప్పుడూ ఆలోచించలేదు.

భారతీయులకున్న పౌరాణిక దృష్టి చారిత్రిక వాస్తవాలను మరుగుపరచటంలో అమోఘంగా పని చేసింది. సంస్కృతం గీర్వాణమని-అంటే దేవతల భాష - అని అర్థం ఎప్పుడయితే చెప్పుకొన్నారో అప్పుడే భాషా మూలాలకు సంబంధించిన వాస్తవిక దృష్టి వారిలో మరుగున పడిపోయింది.

పాండిత్యమంటే సంస్కృత పాండిత్యం మాత్రమేనని ఎలా భావించారో అలాగే 'భాష' అంటే సంస్కృతం ఒక్కటేనన్న ధోరణిలో దేశభాషల్ని అంచనా వేశారు తప్ప మన దేశీయులకు పాశ్చాత్యుల సంపర్కం కలిగేదాకా విశ్లేషణాత్మక దృక్పథం (ఎనలిటికల్ ఔట్ లుక్) - చారిత్రకత (హిస్టారిసిటీ) దాదాపు మృగ్యమనే చెప్పాలి. [చూ. బ్రహ్మానంద 1983: అధ్యాయం 2. పు. 15–46]

ఈ దశలో దాక్షిణాత్య భాషల నడుమ నిర్మాణగతమైన సామ్యాలున్నాయన్న ప్రతిపాదన కూడా కొందరు (వీరే చాలామంది) దేశీయ పండితులకు కొరుకుడు పడ్డ విషయం కాకపోవటంలో ఆశ్చర్యం లేదు. చారిత్రకంగా అదే జరిగింది కూడా, భాషా విజ్ఞానం చెప్పే 'ద్రావిడ' సిద్ధాంతం అసాంప్రదాయికమైందనీ అనర్థదాయకమైందనీ పెదవి విరిచేవారు ఈనాటికీ మన పండితుల్లో అక్కడక్కడా కనిపిస్తారు.

పతన పాతనాల్లో కొందరు 'ద్రావిడం' ప్రత్యేకమని అంటుంటే, మరి కొందరు అంతా 'సంస్కృతమే' అంటున్నారు. వివిధ పీఠాధిపతుల్లాగా తమ తమ వాదాలకు అనుగుణమైన ఉపపత్తుల్ని సాధించుకోవటంతోనే పరిశోధనలు సమాప్తమై పోతున్నాయి.

అలాగని ఇలా పెదవి విరిచే పండితులు ఎవ్వరూ తెలుగులోని అసంస్కృత-అప్రాకృత లక్షణాన్ని గురించి ఏమీ రాయలేకపోయారు. శకటరేఫ ఇత్యాదులు సంస్కృతంలోనివే అని కూడా నిరూపించలేకపోయారు. అటు 'ద్రావిడ' సిద్ధాంతులూ మూలద్రావిడ భాషా తత్త్వాన్ని - నిర్దిష్టమైన దేశ కాల నేపథ్యాలలో నిరూపించలేకపోయారు.

ఈ సందిగ్ధ స్థితిలో చదువుకొని తయారయిన ఉపాధ్యాయునికి కూడా 'తెలుగు ద్రావిడ భాష' అంటే ఏమిటో పూర్తిగా అర్థమయినట్టు. ఈ ఆరు ఏడు విశ్వవిద్యాలయాల సమాధాన పత్రాలను పరిశోధన వ్యాసాలనుబట్టి తెలియటం లేదు. కాల్డ్‌వెల్ ఇలాగే చెప్పారు. మా ఆచార్యులూ అంగీకరించారు-అంచేత-అన్నట్టుగా వుంది ఈ వ్యవహారం.

ద్రావిడ భాషలమీద విస్తృతంగా పరిశోధనలు జరుపుతున్నవారు ఈ దేశంలోని పండితులతో ఏమీ సంబంధం లేనట్టుగా అదో రకమయిన 'మడి' కట్టుకొని 'ద్రవిడియన్' అన్న ఒక మహాధ్వజాన్ని పుచ్చుకొని అర్థంకాని దేశీయ పండితుల మీద విసురుతున్నారు. కాని పిచ్చుకమీద అంత పెద్ద బ్రహ్మాస్త్రం అక్కరలేదు. దేశీయ పండితులు ప్రశ్నలూ వెయ్యరు. సమాధానాలూ వెతకరు. ద్రావిడ సిద్ధాంతంమీద ప్రత్యయముంచి ప్రస్తావిస్తున్న మనమందరమూ కలిసి ఆలోచించాల్సిన మౌలికమయిన సమస్య ఒకటి వుంది. దాన్ని సూచిస్తాను.

మూలద్రావిడ మనబడేది భారతదేశ (పోనీ ప్రపంచ) చరిత్రలో ఏ ప్రాచీనతా దశకు సూచకం! ఆ దశలో ఇండియాలోనూ ప్రపంచంలో భిన్న దేశాలలోను ఉన్న మత-రాజకీయ-సాంఘిక చైతన్యం ఎలాంటిది! వీటికన్నా భిన్నంగా చెప్పిన సంస్కృత ప్రాకృతాలు, మూలద్రావిడం నుంచి పరిణమిస్తూ వస్తున్న ఈ దాక్షిణాత్య భాషలపై ఏయే దశల్లో తమ తమ ప్రభావాన్ని చూపెట్టాయి. లేదా సంపర్కాన్ని పొందాయి! సింధూ నాగరికతా శిధిలాలు సూచిస్తున్నది దాక్షిణాత్య సంస్కృతినేనా! అది ద్రావిడమా! ద్రావిడేతరమా! పోనీ ఆర్యేతరమా!-ఈ ప్రశ్నలకు సంతృప్తికరమయిన సమాధానాలు ఎవరు చెప్పగలిగారు! నిరూపించారు!

ఇంతవరకూ ఎవరూ చెప్పలేదు. నిరూపణల మాట తరువాత.

ఆర్యులు ఇండియాలోనివారు కారన్నది ఒక ఊహ! మరి ఎక్కడనుంచి వచ్చారు! ఇదొక ప్రశ్న. బైటనుంచి. ఇదొక సమాధానం. మధ్యఆసియా ప్రాంతం నుంచి-అని మరొకఊహ. ఇలా ఒక ఊహనుచేసి ఆ ఊహను బలపరుచుకోవటానికి మరొక ఊహను చెయ్యటం. ఇలా ఊహిస్తూ పోవటం. తమ ఊహకు సరిపడని దాన్ని 'అపోహ' అనుకోవటం. ఆ అపోహను ఖండించటం కోసమే జీవితమంతా ధారపోయటం. ఇవే పండితుడు చేసే జిమ్మిక్కులు-విచిత్ర ప్రాణాయామం.

* * *

ఆర్యులు ప్రవేశించిన నాటికి ద్రావిడులు ఉత్తర దేశంలోనే ఉన్నారు. వారికీ వీరికీ సంఘర్షణ జరిగింది. ద్రావిడులు ఓడిపోయారు. తరమబడ్డారు. వారు పారిపోయి దక్షిణాదివైపు వలస వచ్చారు. బ్రాహూయి మొదలైన తెగలు ద్రావిడ సంబంధులే. ఇంకా పాకిస్తాన్ ప్రాంతంలో ఇవి మిగిలి వున్నాయంటే అర్థం ద్రావిడులు ఒకప్పుడు అక్కడ ఉండి వుండాలనే-ఇలా సాగుతుంది ఒక ఊహ.

ప్రపంచంలో భిన్న ప్రాంతాలలో సమాంతరంగా కనిపించే మత ఆచార గతాంశాలు, భాషాపరాంశాలు ఎన్నో వున్నాయి. అలాగే ద్రావిడ భాషలకు-సిధియన్ మెడిటేరినియన్ భాషలకు సంస్కృతానికీ కూడా ఎన్నో సమాంతర ధర్మాలున్నాయి కాబట్టి ద్రావిడులు కూడా బయటనుంచే వచ్చి ఉండాలి. ఇది మరొక ఊహ.

ఇటు ఆర్యులూ-అటు ద్రావిడులూ కూడా లేకపోతే తొలిదశల్లో(?) ఇండియాలో ఎవరు ఉండి ఉండాలి! ఆస్ట్రోఏషియాటిక్-ముండాజాతి ప్రజలు ఉండి ఉండాలని మరొక ఊహ-దీనికి సమాధానం.

ఇవన్నీ ఎలా వున్నాయంటే దేశీయ పండితుడు జనని సంస్కృతంబు ఎల్లభాషలకు-అని నమ్మినట్టే వున్నాయి. అది సాంస్కృతికమయిన నమ్మిక. ఇది

# ఓరియంట్
# వినండి మా ఘనత– అనేకులనోట.



"మనం ఓరియంట్ ఫ్యాన్ కొనడానికి కారణం దాన్నే మా ఫాదర్ కూడా కొనడం."



"ఖూబ్ బోలో! ఒకే ఫ్యాన్‌లో రెండు బాల్ బేరింగులు దొరికాయండి."



"మా ఫ్యాన్ గొప్ప గుడ్ లుకింగ్ ఫ్యాన్, ఓరియంట్ గదా అది."



"మన ఫ్యాన్ మా అవిడ బుర్రని చల్లగా వుంచుతుంది. దాంతోబాటే ఎలక్ట్రిక్ బిల్లునీ తక్కువ చేస్తుంది."



"బల్లే, బల్లే! ఓరియంట్ గొప్ప స్పీడ్‌గా తిరుగుతుంది. అయితేనేం చప్పుడేం వుండదు."



"యు! నో! మా స్టాఫ్ హాయిగా పనిచేస్తారు. ఈ ఓరియంట్ లాగే."

ORIENT

ఓరియంట్ ఫ్యాన్‌లలో వోల్టేజి హెచ్చు తగ్గులను తట్టుకుంటూనే తక్కువ విద్యుత్ ఖర్చు అయ్యేలా చూసేలా కంప్యూటర్ డిజైన్ చేయబడిన మోటార్ వుంది. ఏమాత్రం సవ్వడి లేకుండా గ్యారంటీగా తిరిగేందుకు ప్రత్యేకమైన బాల్ బేరింగులున్నాయి. వీటిలో మరింత గాలి నిచ్చేందుకుగాను ఏరోడైనమికల్లీ బ్యాలెన్స్‌డ్ బ్లేడ్‌లు. ఎలక్ట్రో స్టాటిక్ పెయింట్ ఫినిష్ మరియు సొగసైన డిజైన్. అంతేగాక ఫ్యాన్‌లు అస్సలు బరువు లేకుండాను తుప్పు పట్టకుండాను వుంచేందుకు డై-కాస్ట్ అల్యూమినియమ్ బాడీ మరియు బ్లేడ్‌లు గలవి ఇవి.

ఓరియంట్ ఫ్యాన్‌లు-సాటిలేని శ్రేణిలో మోడల్స్. రకరకాల సైజులలో ఎలాంటి అలంకరణకైనా సరిపడే ఛాయలలో. ఓరియంటల్ సీలింగ్, టేబుల్ మరియు పెడస్టల్ ఫ్యాన్‌లు.

ORIENT

## ఓరియంట్
లోపల, బయటకూడా...
సాటిలేని నిర్మాణం.

సేకరించబడ్డ సామగ్రిని ఆధారంగా చేస్తున్న ఊహ (కంజెక్చర్). శాస్త్రంలో ప్రగతి దీనిమీదే ఆధారపడుతుంది. నమ్మకంకన్నా ఈ 'ఊహ' ఎంతో నయం. కాని ఇందులో కూడా పప్పులో కాలు వేసే ప్రమాదం లేకపోలేదు. ఎలాగంటే ఒక మౌలికమైన అంశం సత్యమని 'నమ్మితే'నే తక్కిన ప్రయాస అంతా. ఆ 'నమ్మకం' మీదే ప్రశ్న వేసుకొన్నామనుకోండి. పడిన ఇంత శ్రమకూ కారణం ఊహ/అపోహ అని తేలిపోతుంది. అంటే ఏ శతాబ్దంలోనైనా మానవుడు ఏదో ఒక సాంస్కృతిక వాసన (కల్చరల్ ఈథాస్)లో బ్రతుకుతూ ఉంటాడని అర్థం. వాస్తవికతలో బ్రతకడు. వాస్తవికతను ఎప్పుడూ ఈ మనిషి కోరడు. సరిగా భాషాతత్త్వ విషయాల్లోనూ మానవుడి చుట్టూ వున్న సాంస్కృతిక వాసన ఎంత పని చేస్తుందో 'ద్రావిడ' విషయమూ నిరూపిస్తోంది.

అలా 'ద్రావిడ' శబ్దం తమిళసూచకం మాత్రమే కాకుండా ఇంకా విస్తృతమయిన అర్థపరిధిని కల్గింది అని నమ్మటం కాల్డ్వెల్‌లో మొదలయింది. ఇలా పిలిస్తే బాగుంటుంది. అని ఆయన అభిప్రాయపడ్డాడు. ఆయనలో ఈ పేరు అంత శాస్త్రీయంగా లేదన్న 'స్కెప్టిసిజం' అయినా కొంతకు కొంత వుంది. కాని తరువాతివారికి ఆ పేరు(ద్రవిడియన్) మీద రెండో ఆలోచన కూడా లేదు.

దీనికి అకడెమిక్ కారణాలు కూడా వున్నాయి. కాల్డ్‌వెల్ వ్యాకరణం మద్రాసులో పుట్టింది. విద్యారంగంలోకి అలా చొచ్చుకు రాగలిగింది. అప్పటికే కేవల ఆచార పరతంత్రులుగా మిగిలిన బ్రాహ్మణుల అధిపత్యానికీ ప్రాజాపత్యానికీ వ్యతిరేకంగా 'శూద్ర' ఉద్యమం బయలుదేరి వుంది. దీన్ని 'శూద్ర' ఉద్యమం అనటం కన్నా మధ్యతరగతి అబ్రాహ్మణ మేధావి వర్గం అనటం బాగుంటుంది. అప్పటికే బ్రాహ్మణులకు సంస్కృతభాషా పరిచయం 'మంత్ర'ప్రాయమై పోయింది. సంస్కృతి, సంస్కృతం, ఆచారం-ఈ మూటికీ నడుమ భేదమే లేదన్న దశలో ఉన్న బ్రాహ్మణులకు వారి అపాండిత్యానికీ వ్యతిరేకంగా పుట్టింది. ఉద్యమం దీనిని కాల్డ్‌వెల్ సిద్ధాంతం అగ్నికి ఆజ్యంలాగా తోడయింది. 'ద్రవిడ మున్నేట్రకళగం' (కళగం) ఒక సాంస్కృతిక వ్యవస్థగా అనంతర కాలంలో రూపుదిద్దుకోవటానికి శాస్త్రనేపథ్యమై ద్రావిడ 'వేదమ'యింది కాల్డ్‌వెల్ రచన. ద్రావిడ-ప్రజల ఆత్మాభిమానం-(జాతి భాషా దురభిమానాలు) మాత్రమే ఈ వ్యవస్థకు ప్రేరణ అయింది. ఈనాడు క్రమంగా ఇదే సూత్రమే ఇతర రాష్ట్రాలకు కూడా క్రమక్రమంగా వ్యాపిస్తున్న విషయం గుర్తుంచుకోవాలి.

బ్రాహ్మణ వ్యతిరేకత, సంప్రదాయ తిరస్కారం, పాశ్చాత్యీకరణం, నవ్య దృక్పథాలు ఇవన్నీ కలిసి 'ద్రవిడియన్' అన్న మాటను గురించి పునరాలోచించకుండా చేశాయి. ఎవరో ఒకరిద్దరు ఆహాఁ! ఊహుఁ! అన్నా దేశం అట్టే పట్టించుకోలేదు. అదొక చాదస్తమని కొట్టి పారేశారు. ఇలా ఈనాడు 'ద్రావిడ' శబ్దాన్ని గురించి పునరాలోచించటమంటే ఒక శాస్త్ర విషయం మాత్రమే కాకుండా అంతకన్నా పెద్దదయిన రాజకీయ సాంస్కృతిక సమస్య అయిపోయింది. ఈ చారిత్రకదశలో ఈ పునరాలోచన. దీనికి రెండు ప్రయోజనాలు:

1 'ద్రావిడ' శబ్దం అవ్యాప్తి దోషాన్ని కలిగింది. అందుచేత అది దాక్షిణాత్య భాషలకు సూచకం కాదు.

2. దాక్షిణాత్య భాషావ్యవహర్తలు 'అనార్యులు' కావచ్చు. ఒకప్పుడు వారు భారతీయేతరులూ అయి ఉండవచ్చు. అయినా 'ద్రావిడ' అన్న పేరు వారి జాతిని సూచించదు.

* * *

## పూర్వరంగం :

ఇంతవరకు 'ద్రావిడ' శబ్దంమీద జరిగిన 'మీమాంస'ను ఇక్కడ సమీక్షిస్తాను. తరువాత విమర్శ. ఈ సమస్యకు సంబంధించి వచ్చిన ఇటీవలి గ్రంథం 'ది జెనసిస్ ఎండ్ గ్రోత్ ఆఫ్ ద్రవిడియన్' (ద్రవిడియన్ మూలాలు-పరిణామ చరిత్ర). ఇది 1984లో ముద్రించబడింది. చాలా వ్యయప్రయాసల కోర్చి మైసూరు విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులైన ఆచార్య ఆర్.సి.హిరేమఠ్‌గారు రచించిన గ్రంథమిది. వారు క్రోడీకరించిన తీరులోనే 'ద్రావిడ' శబ్ద పరిశీలనను ప్రదర్శిస్తాను.

1) 'తమిళి' అనే రూపం తమిళ సాహిత్యంలో కనిపిస్తూ వుండగా 'దమిళ' అన్న రూపం 'మహావంశ' పాళీగ్రంథాలలోను శ్వేతాంబరుల జైన సాహిత్యంలోనూ కనిపిస్తోంది.

శ—ద గా మారటం వుంది కాబట్టి *దమిడ అనే పూర్వరూపం నుండి 'దమిళ' అన్నది ఏర్పడి వుండవచ్చునని పునర్నిర్మించవచ్చు. మ—వ గా మారితే దమిళ,దమిడ రూపాలతోపాటుగా దవిళ, దవిడ అనే రూపాలు సిద్ధిస్తాయి. జైన ప్రాకృత సాహిత్యంలోను. సంస్కృత నాటకాల్లోను వాడబడ్డ ప్రాకృతంలోను ఈ రూపాలు వాడబడ్డాయి.

దమిళ, దవిడ రూపాలు సంస్కృతీకరించబడి ద్రమిళ, ద్రవిడ అన్న రూపాలుగా మారాయి.

ద్రమిళ—శబ్దం, బాదామివద్ద మహాకూటంలో మంగళేషుడు వేసిన స్తంభ శాసనంలో (క్రీ.శ. 597-608) వుంది. ప్రాచీన మళయాళ సంస్కృత పురాణాల్లో వుంది. తారానాథుడు (బౌద్ధచరిత్ర) ఈ రూపాన్ని వాడాడు.

ద్రమిడ-శబ్దం, తమిళ తిరువాయ్ మొళికి వ్రాసిన సంస్కృతసారంలో ప్రయుక్తమయింది. రామానుజులు ఒక బ్రహ్మసూత్ర వ్యాఖ్యాతను 'ద్రమిడు'డన్నాడు. క్రీ.శ. 6 వ శతాబ్దిలోని వరాహమిహిరుడు ఈ శబ్దాన్ని వాడాడు.

'ద్రావిళ' అన్న పేరుతో ఒక జైనగణం వుంది. 'తిరమిడ' అన్న తమిళ రూపాంతరం 'ద్రమిడ'కు వుంది.

ఈ రూపాలన్నిటికీ *తమిళ్ అన్నది మూలం. ఇదే అతి ప్రాచీనమైన రూపం. ఈ *ళ కారం బౌద్ధ జైన ప్రాకృతాల దశలో 'శ' గా మారింది. (త—ద గా కూడా మారింది). పాళీ అర్ధమాగధీ భాషలకు ఈ మార్పులు చాలా సహజమైనవి. వాటిలో శ్వాసహల్లులు నాదాలుగా మారుతాయి. 'ళ' అన్న మూర్ధన్యహల్లు ప్రాకృతాలతో లేదు. అంచేత 'తమిళ్' అన్నదే అతి ప్రాచీనదశలోని రూపం.

మ—వ గా మారటం కూడా ప్రాకృతాలలో సహజమైన పద్ధతే. దమిళ—దవిళ కావటం కూడా అంచేతే సాధ్యమయింది. ళ/డ ల వ్యత్యాయం కూడా చాలా సహజమైన మార్పే. ఋగ్వేద మంత్రాలలోనే డ/ళల వినిమయం వుంది.

అగ్నిమీళే/డే పురోహితం—అని వేదమంత్ర పాఠం దమిళ-దవిడ అన్న రూపాల పరిణామం రెండోదశలో జరిగింది.

ఈ రూపాల సంస్కృతీకరణం మూడోదశను నిరూపిస్తోంది. ళ—డ గా మారితే 'దమిడ' అనే రూపం ఏర్పడుతుంది. దమిడ అన్న రూపం ప్రాచీన సాహిత్యంలో ఎక్కడా కనిపించదు. [ఇది చాలా ప్రధానంగా గుర్తించాల్సిన విషయం]. ఈ రూపం సంస్కృతీకరించబడి 'ద్రమిడ'గానే కనిపిస్తుంది. (ఇలాగే ద్రమిళ, ద్రవిడ)

ద్రమిడ-ద్రమిళ-రూపాలకన్నా 'ద్రవిడ' అర్వాచీన రూపం. సంస్కృతంలో పదాది అచ్చు దీర్ఘీకరింపబడినా ఒకే అర్థం వచ్చే సందర్భాలున్నాయి. ధరణి-ధారణి; నరక-నారక; ప్రదేశ-ప్రాదేశ; ప్రపంచ-ప్రాపంచ అలాగే ద్రవిడ-ద్రావిడ అనే రూపాలు కూడా ఏర్పడ్డాయి.

కీర్తిశేషులు సునీతకుమార్ ఛటర్జీగారు ద్రావిడులు మధ్యధరా సముద్ర తీర ప్రాంతవాసులని, అక్కడినుంచి భారత దేశంలోకి వలస వచ్చారని నమ్మారు. [వారి గ్రంథం 'ది ద్రవిడియన్' 1968లో ముద్రించబడింది] అని నిరూపించటానికి చాలా ఉపపత్తులు సేకరించి ప్రదర్శించారు కూడా. ఇండో యూరోపియన్ భాషల్లాగానే ఇండోఏజియన్ భాషలని ద్రావిడ భాషల్ని పిలవవచ్చుని వాదించిన వారూ వున్నారు. ఏజియన్ అంటే మధ్యధరా సముద్ర తీర సంబంధమని అర్థం. హెలెన్‌పూర్వ మధ్యధరా తీరనాగరికతను 'ఏజియన్' అనే పేరుతో పిలిచారు.

ఏజియన్లు తమని తాము 'తెరమిలయ్' అని పిలుచుకొన్నారు. హెరిడోటస్ అన్న గ్రీకు చరిత్రకారుడీ విషయాన్ని రికార్డు చేశాడు కూడా. లైసియన్ శాసనాలలో లైసియనులు తమని తాము 'త్రిం మిలి' అని పిలుచుకొన్నారు. పాలెస్ జియన్స్; ఏజియన్స్, లైసియన్స్, క్రీటాన్స్ – వీరు ఎవ్వరూ ఇండో యూరోపియనులు కారు. సెమిటిక్కులూ కారు. వీళ్ళందరిదీ కలిసి మరో తెగ. తెర్మిలై–త్రిమిలి–రూపాంతరాలు కావచ్చు 'తమిళ' శబ్దం ఈ రూపాలనుంచి కాలక్రమంలో ఏర్పడింది కావచ్చునని ఛటర్జీ పండితుడి ఊహ.

ఇది చాల సమంజసమైన ఆలోచనగానే తెలుస్తోంది. మరొక ఆసక్తికరమైన అంశం వుంది. 'శివుడు' ద్రావిడ దేవుడు. ఆయన చేతిలో 'త్రిశూలం' వుంది. అలాగే 'తెర్మిలై' అన్నది ఆ తెగ దేవుడి పేరు కూడా. త్రిశూలంలాంటి ఆయుధం ఆయన చేతిలో కూడా వుంది. అందువల్ల ఛటర్జీగారు:

'తమిళ్—*దమిళ్—దమిళ—*ద్రమిళ—
—ద్రమిళ—ద్రమిడ—త్రెంమిళి—తెర్మిలై

అన్న వరుసలో 'ద్రావిడ' శబ్దాన్ని సాధించడానికి ప్రయత్నించారు. తమిళ్ కన్నా పూర్వరూపం ఒకటి వుందని ఆయన అభిప్రాయం. రేఫ యుక్త రూపాలుండటంవల్ల (త్రె~తెర్) బహుశా ఆయన ఈ అభిప్రాయాన్ని చెప్పి ఉండవచ్చు.

అలాగే ఆయన *దమిళి అనే ప్రాచీన రూపాన్ని తమిళ్-దమిళ. అన్న రూపాల నడుమ ఊహిస్తున్నారు. ఇది ఇండియాలో ఏర్పడ్డ చారిత్రకదశ అని ఆయన అభిప్రాయం. ఇటీవలి పరిశోధనలు మూలద్రావిడంలో పదాది సరళ స్పర్శలు కూడా వున్నాయి. అందువల్ల ఆయన దకారయుక్త రూపాన్ని మూల ద్రావిడ దశకు పునర్నిర్మించారు.

ఈ విషయాలను ప్రస్తావిస్తూ హిరేమఠ్‌గారు రెండు అంశాలను సవరించారు: 1) దమిళ-శబ్దానికి సంస్కృత రూపం ద్రమిడ. మధ్యధరా తీరంలోనో, ఉరల్ అల్టాయిక్ ప్రాంతంలోనో ఆర్య్-ద్రావిడులు కలిసి చాలా కాలం వున్నారు. ఇది చరిత్ర ప్రతిపాదించిన సత్యం. ఆ సమయంలో ఆర్యులీ రూపాన్ని తమ భాషానిర్మాణానికి సన్నిహితంగా ఉన్న ప్రాచీన రూపంతోనే దాన్ని సంస్కృతీకరించి వుండాలి.

2) *దమిళి' అనే మధ్యదశ-ప్రాకృత భాషా వ్యవహర్తలైన ఆర్యులతో చారిత్రకంగా సమన్వయిస్తుందనటంలో సామంజస్యం లేదు. 'ళి' అన్న ధ్వనిని ప్రాకృత భాషావ్యవహర్తలు నేర్చుకొని ఉంటారనటం అసంభవమైన విషయం. అందుకే ఈ దశతో నిమిత్తం లేకుండా దమిడ రూప పూర్వాపరాలను చర్చించటం జరిగింది.

[చూ. హిరేమఠ్: 1984; పు.7]

## ద్రావిడ శబ్దానికి పూర్వ ప్రయోగాలు :

ఆచార్య హిరేమఠ్‌గారి ప్రకారం కూడా ద్రావిడ శబ్దానికి తమిళమనే సంకుచితార్థమూ, ద్రావిడ భాషలనే విశాలార్థమూ రెండూ ఉన్నాయి. వారి నిరూపణలు ఇవి: [పుటలు 8-10]

1. ప్రాచీన సాహిత్యంలో సంకుచితార్థమే ప్రముఖంగా వుంది.

అ) క్రీ.పూ. 5వ శతాబ్దికి చెందిన ఒకానొక బౌద్ధ త్రిపిటకానికి చెందిన మౌఖిక సంప్రదాయంలో మూడు ప్రధాన భాషలు ఉన్నాయని చెప్పబడ్డది. 1) మాగధి 2) అంధక 3) దమిళ. ఇక్కడ అంధక = ఆంధ్రం(తెలుగు); దమిళ = తమిళం. ఇక్కడ కేవలం తమిళమనే అర్థం మాత్రమే ఉంది.

ఆ) క్రీ.శ. 5వ శతాబ్దిలో త్రిపిటకాలమీద ధమ్మపాలుడు వ్యాఖ్యానం రాశాడు. ఆయనకూడా పై మూడు మాటలనే గుర్తించి ఉన్నాడు.

ఇ) క్రీ.శ. 7వ శతాబ్దికి చెందిన కుమారిలభట్టు (తంత్రవార్తికంలో) ద్రావిడాంధ్రభాష (ద్రావిడాదిభాష అని పాఠాంతరం) అని ప్రయోగించాడు. మొదటి పాఠాన్ని గ్రహిస్తే సంకుచితార్థం, రెండోపాఠాన్ని గ్రహిస్తే విశాలార్థం చెప్పవచ్చు.

ఈ) క్రీ.శ. 8వ శతాబ్దిలోనివారైన ఆదిశంకరాచార్యులు 'ద్రావిడ శిశు' అనే ప్రయోగాన్ని చేశారు. ఇది ఒక తమిళ సన్యాసిని సూచిస్తుంది.

ఉ) నాగేశభట్టు (8వ శ.) స్పష్టంగా తమిళభాష అనే అర్థం మాత్రమే వచ్చేలా 'ద్రావిడ భాష' అని అన్నాడు.

ఊ) 10వ శతాబ్దికి చెందిన నాగవర్మ తన ఛందోంబుధి అనే గ్రంథంలో ఇలా రాశాడు:

"సంస్కృత ప్రాకృతం అపభ్రంశం
పైశాచక మెంబ మూరువరె భాషెగళోళ్ పుట్టువ
ద్రావిడాంధ్ర కర్ణాటాది షట్పంచా
శత్ భాషె గళోళ్......"

సంస్కృత ప్రాకృత అపభ్రంశాలు మూడున్నర భాషలు. వీటినుంచి ద్రావిడ, ఆంధ్ర. కర్ణాటాది యాభైఆరు భాషలు పుడుతున్నాయి. ఇక్కడ ద్రావిడమంటే 'తమిళం' మాత్రమే.

ఎ) 'ద్రావిడ మున్నేట్ర కళగం' అనే మాటలోని 'ద్రావిడ' కూడా కేవలం తమిళాన్ని మాత్రమే సూచిస్తుంది.

2. 'ద్రావిడ' శబ్దానికి విశాలార్థం క్రింది ప్రయోగాల్లో ఉంది.

ఎ) మహాభారతంలో రెండుచోట్ల వృషలులుగా మారిపోయిన క్షత్రియ జాతులను గురించిన ప్రస్తావన ఉంది. వృషలులంటే శూద్రులని అర్థం. అలాంటివారు పౌండ్రక, ఓడ్ర, ద్రావిడ, కాంభోజ, యవన, శక, పరద, పహ్లవ, చీన, కిరాత, దర్ద, ఖర జాతులు. వీరు అనాగరికులు. ఇండియా లోపల బయట అంతటా విస్తరించి ఉన్నారు. దక్షిణ భారతానికంతా సంబంధించిన(?) ఒకే తెగ చెప్పబడింది. అది 'ద్రావిడ' ఇక్కడ ద్రావిడ అంటే ఒక్క 'తమిళం' మాత్రమే కానేరదు. ఎందుకంటే మహాభారతంలో ఈ శ్లోకాలు చేరేటప్పటికి తమిళులు ఆర్యీకరణాన్ని పొందిఉండకపోవచ్చు, అందుచేత ఒకప్పుడు ఆర్యులుగా పేర్కొనబడి వుంటేనే వారికి క్షత్రియార్హత పోయే ప్రసక్తి వుంటుంది. అంచేత ఇక్కడ వాడబడ్డ 'ద్రావిడ' అనే మాట కర్ణాటక ఆంధ్రాదిదేశ సూచకమైనట్టిదే.

బి) మనుస్మృతిలో కూడా పై మూడుజాతులూ పేర్కొబడ్డాయి. అక్కడ కూడా 'ద్రావిడ' అన్న మాటకు విశాలార్థమే ఉంది.

సి) క్రీ.శ. 14వ శతాబ్దికి చెందిన లీలాతిలకం అనే మలయాళ వ్యాకరణం 'ద్రావిడ' శబ్దంచేత తమిళ, మలయాళ కర్ణాట ఆంధ్రభాషలను సూచించింది.

డి) ఇండియాలోని బ్రాహ్మణులను మధ్యయుగాలలో రెండు వర్గాలుగా వర్గీకరించారు. 1) పంచగౌడ-గౌడ, సారస్వత, కాన్యకుబ్జ, ఉత్కళ, కాశ్మీరాది



ఆర్యభాషలను మాట్లాడే బ్రాహ్మణులు ఒక తెగ. ఇక్కడ 'గౌడ' ఒక దేశాన్ని సూచించేది. అయినా విశాలార్థంలో ఒక తెగ బ్రాహ్మణులకుపలక్షకంగా వాడబడింది. 2) పంచద్రావిడ— గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర, ద్రావిడ, ప్రాంతాలలోని ఆర్య ద్రావిడ భాషలను మాట్లాడే బ్రాహ్మణులను పంచద్రావిడులు అంటారు. ఈ సందర్భంలో కర్ణాటక–ఆంధ్రలు ప్రత్యేకంగా చెప్పబడ్డాయి. మలయాళం తమిళంలోనే గతార్థం కావచ్చు. పోగా 'ద్రావిడ' శబ్దం ఈ 5 ప్రాంతాలను సూచిస్తుందన్నమాట, ఇది విశాలార్థమే. [ఛటర్జీగారు (ద్రవిడియన్. పు.3) పంచగౌడ/ద్రావిడ వర్గీకరణ క్రీ.శ. 1000కి ముందే ఉండేదని ఊహిస్తున్నారు]

ఇ) మన జాతీయగీతంలో రవీంద్రుడు చేసిన ప్రయోగం చూడండి:

"పంజాబ్ సింధ్ గుజరాత్ మరాఠా
ద్రావిడ ఉత్కల బంగా"—

ఇక్కడ స్పష్టంగా దక్షిణాదిలోని నాలుగు రాష్ట్రాలను సూచిస్తూ 'ద్రావిడ' అనే మాట వాడబడింది. [పై అంశాలన్నింటిమీదా చూ. హిరేమఠ్ 1984; 4–10] కాబట్టి ఆయన 'ద్రావిడ' అనే మాటను విశాలార్థంలోనే గ్రహించారు.

## ద్రావిడమూలాల సిద్ధాంత సమీక్ష:

హిరేమఠ్ (1984: 34-41) తనకు ముందు వచ్చిన పదికొండు సిద్ధాంతాలను చర్చించారు. ద్రావిడ జాతి భాషలతో మౌలిక సగోత్ర సంబంధమున్న జాతి భాషాకుటుంబ మీమాంస ఇది.

1) భారతదేశంలోకి ద్రావిడులు వాయవ్య ప్రాంతంలోని కనుమల గుండా ప్రయాణం చేసి వచ్చారు. టిబెటో బర్మన్ కొలేరియన్ జాతులు ఈశాన్య దిశ నుంచి వచ్చారు. ద్రావిడజాతితో వారు మధ్య ఇండియాలో ఘర్షణ పడ్డారు. బలవంతులు కాబట్టి కొలేరియనులను అధిగమించి ద్రావిడులు దక్షిణంవైపు సాగిపోయారు. ఇది సర్ విలియం హంటర్ (ది ఇండియన్ ఎంపైర్. పు. 105) అభిప్రాయం.

2) అక్కాడియన్ ప్రాంతంలోని ఈలం జాతికి భారతదేశంలోని ద్రావిడ జాతికి సాంస్కృతికమైన ధర్మాలు కొన్ని వున్నాయి. రెగోజిన్ (వేదిక్ ఇండియా పు. 303-309) ద్రావిడులు, అక్కాడియనులు తురేనియన్ మూలంనుంచీ పరిణమించారని ఊహిస్తున్నారు.

3) కొందరు సుమేరియన్ మూలాన్ని ప్రతిపాదిస్తున్నారు. [ఆర్.ఎస్. వైద్యనాథయ్య, హెచ్.ఎస్. డేవిడ్, ఎ. సదాశివం, ఎఫ్.హన్నా మొదలైనవారు]

4) ద్రావిడులకు ఉరల్ ఆల్టాయిక్ జన్య సంబంధాన్ని కొంతమంది ప్రతిపాదించారు. [ఎం. మిల్లర్, బిషప్ కాల్డ్‌వెల్, ఇ. వెబ్, సి. షెవెల్, ఎఫ్.ఓ. ష్రేడర్, ఎ.ఎఫ్. త్యాగరాజు, ఇ.హెచ్. టటిల్, డబ్ల్యు. హెవెసీ, వి. బొన్నిరెజె, టి. బరో, పి. మేయే, కె. బోండా, వి. రామచంద్రరావు, ఎం. ఆంద్రనోవ్. కె. మెంజెస్, పెంట్టి ఆల్టో లు]

5) ప్రపంచంలో తొలి నాగరికత ఈజిప్షియన్ నాగరికత అని, ద్రావిడ నాగరికత అందులో ఒక శాఖ అని ప్రతిపాదిస్తున్నవాళ్ళు వున్నారు. వీళ్లు పుర్రె, దేహకాంతి, వెంట్రుకల తీరు, కళ్ళరంగు, దేహసౌష్ఠవం మొదలైన లక్షణాల నాధారంగా ఈ అభిప్రాయానికి వచ్చారు.

6) మధ్యధరా సముద్రతీర మూలాన్ని హాల్, ఎఫ్.జె. రిచర్డ్స్, కార్నెల్, ఎస్.కె. ఛటర్జీ, లాహోవరీ, నీలకంఠశాస్త్రి, ఊహిస్తూండగా, సి.పి. బ్రౌన్ మిటన్ని భాషలతో ద్రావిడ భాషలకు గల సంబంధాన్ని ఊహిస్తున్నాడు.

7) ఆఫ్రికన్ భాషలతో సంబంధాన్ని ఊహిస్తున్నవాళ్లు లేకపోలేదు జె.టి. కార్నెలియస్, ఇ.హెచ్. టటిల్, కాల్డ్‌వెల్, ఇ.హెచ్. సెనెఫర్, లాహోవరీ, జె. మేయర్, ఎల్. హంబర్గర్ ప్రభృతులు ఈ సిద్ధాంతాన్ని చెబుతున్నారు,

8) ఆస్ట్రేలియన్ సంబంధాన్ని ప్రతిపాదిస్తున్న వాళ్లు మరికొంతమంది కాల్డ్‌వెల్, బ్లెక్, నోరిస్, ట్రాంబెట్టిలు ఈ ఊహ చేస్తున్నారు.

9) 'మూయేర్' అన్న సంస్కృత విద్వాంసుడు పై సిద్ధాంతాలను కొట్టి పారవేస్తూ ఆర్యులు ఇండియాలోకి ప్రవేశించిన తరువాత వాళ్ళనుంచి పుట్టిన ఉపశాఖే ద్రావిడులని అంటున్నాడు. ఇంకా కొందరు ఇండో యూరోపియన్ దశలోనే మూలద్రావిడానికి దానితో సగోత్ర సంబంధాన్ని కూడా ప్రతిపాదిస్తున్నారు. పోప్, స్వామినాథయ్యర్, చిలుకూరి నారాయణరావు, ఎస్. జ్ఞానప్రకాశర్‌లు ఈ పని చేశారు. గ్రోవర్ శేషగిరిశాస్త్రి మొదలైనవారు ఈ సిద్ధాంతానికి కొన్ని సమర్థనలూ చూపారు.

10) ఇంకా కొంతమంది ద్రావిడులే ఇండియాలోని ఆదిమజాతి ప్రజలనీ, వీరి నాగరికతే ప్రపంచంలోని ఇతర ప్రాంతాలకు ప్రాకింది అని నమ్ముతున్నారు, హాల్ అనే పండితుడు 'కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా' అనే గ్రంథంలో ద్రావిడులే సుమేరియన్ నాగరికతను ప్రారంభించారని అన్నవాడు, కొంత కాలానికి తన అభిప్రాయాన్ని విరుద్ధదిశలో సవరించుకొని సుమేరియనులే ఇండియాలోని ద్రావిడ నాగరికతకు బీజాలు వేశారని అన్నాడు. ఇంకా సర్ జాన్ ఇవాన్స్ దక్షిణ భారతదేశంలోనే తొలుత మానవజాతి పుట్టి ఊయల లూగిందని చెప్పాడు.

జార్జ్ అలివర్ మరీ విలక్షణంగా ద్రావిడులు ఏ తెగకు చెందరని, వారిది ఒక ప్రత్యేకమైన భౌగోళిక తెగ అని వారు ప్రాదేశిజాత్యులైన భారతీయులే అని నిశ్చయించేశాడు కూడా.

11) గోవిందాచార్య స్వామివంటి తమిళ విద్వాంసులు మరో విషయాన్ని చెప్పారు. హిందూ మహా సముద్రంలో ఒకప్పుడుండి తరువాత మునిగిపోయిన లెమూరియన్ అన్న ద్వీపంలో తొలి నాగరికత పుట్టిందని, అదే దక్షిణ భారత దేశానికి ద్రావిడ నాగరికతగా వ్యాపించిందని (చూ. గోవిందాచార్యస్వామి: ఇండియన్ యాంటిక్వేరీ 1911:118) వీరి అభిప్రాయం.

ఈ లెమూరియన్ సిద్ధాంతాన్ని కొందర్త్రోవ్ అనే రష్యన్ వైజ్ఞానికుడు సమర్థిస్తున్నాడు, ఆ మునిగిపోయిన ద్వీపమే గోండవాన్ అనే ఖండమని దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియాలకు లంకెగా ఈ ఖండముండేదని వీరు అభిప్రాయపడుతున్నారు.

ద్రావిడులు దక్షిణ ఇండియాలోనే కాకుండా ఒరిస్సా, మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, బీహార్, బెంగాల్, నేపాల్, కాశ్మీర్, పంజాబ్‌లలో కూడా వ్యాపించి వున్నారు. ఇండియా బయట బలోచిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లలో కూడా కనిపిస్తున్నారు. ద్రావిడులు ఇండియాలోని వారేనా! కాదా! (అంటే విదేశాలనుంచి వచ్చారా!) అన్న విషయాన్ని తేల్చాలంటే సింధూలోయ నాగరికతను గురించి మనం వివరించి తీరాలి అని అభిప్రాయపడుతూ ఆచార్య హిరేమఠ్‌గారు (1984:44–88) సింధూలోయ నాగరికత ద్రావిడ నాగరికతే అని నిర్ధారించారు. ఆయన ద్వితీయ ఖండాంతంలో స్పష్టంగా ఇలా చెప్పారు:

"ఆర్యులు ఇండియాలోకి రాకముందునుంచీ ఈ దేశంలో రెండు తెగలున్నాయి. ద్రావిడ, ఆస్ట్రోలాయిడ్, టిబెటో–బర్మన్ తెగలు! సింధూలోయ ప్రజలు వీరే ... ఋగ్వేదంలో పేర్కొనబడ్డ అసురులు, దస్యులు, రాక్షసులు వీళ్ళే ఆర్యుల ఆక్రమణవల్లా, ప్రాకృతిక కారణాలవల్లా సింధూలోయ నాగరికత నష్టమైపోయి ఉండవచ్చు (పు.88)

ఈ సింధూలోయ నాగరికతకు మెసపొటేమియా నాగరికతతో చాలా సంబంధముంది. అందుచేత (పు.185), ద్రావిడులు మెసపొటేమియా–మధ్యధరా సముద్ర తీరప్రాంతంనుండి ఇండియాలోకి వలస వచ్చినవారే. క్రీ.పూ. 5000 సంవత్సరాల క్రితమే ఆర్య ద్రావిడుల నడుమ సంపర్కం మొదలై ఉండాలి, (పు.186)






# Because

- Bajaj Irons have three separate layers of plating
- The heating element is made of Ruby Mica and imported Nikrome wires
- They are made to strict ISI specifications
- The Auto Irons have an accurate thermostatic control and
- The name Bajaj is the one you can trust

We have a wide range of Bajaj Irons
And the widest range of appliances in India
Backed by a network of over 1000 dealers

That's why Bajaj Irons are a hot favourite!






BUY BEST. BUY BAJAJ.

**Authorised Wholesalers in A.P.: M/s Mahavir Combines, Kanchanjunga Complex, King Kothi Road, Hyderabad - 1: Authorised Sales & Services Centres: M/s Ram Enterprises, J.N.Road, Hyderabad; M/s Aarifi & Company, Dwarakanagar, Visakhapatnam: M/s Shankar Agencies, 417, Brodipet, Guntur.**

మధ్య ఆసియా తూర్పు యూరోప్ ప్రాంతంలో ఉరల్ అల్టాయిక్ పర్వత సానువుల దక్షిణ మైదానంలో క్రీ.పూ. 5000 సంవత్సరాల ముందు మూడు తెగల మానవులు కలిసి జీవించారు.

1. మంగోలియనులు- తూర్పు ప్రాంతాలలో నివసించినవారు.

2. సిథియనులు- వీళ్ళు మధ్య ప్రాంతానికి చెందినవారు. వీరికి ఎత్తైన గడ్డపు ఎముక, అణగిన ముక్కు, బిరుసైన పెదవులు, పెద్దమూతి, బ్రౌన్ శరీరం, వెంట్రుకలు ఏటవాలైన నల్లటి కళ్లు ఉంటాయి.

3. ఇండో యూరోపియనులు- పొడవైనవారు. తెల్లటి దేహం, నిడివైన ముఖం, కోసిముక్కు, నీలికళ్లు, బంగారురంగు కేశాలు.

ఆ ప్రాచీనదశలోనే ఈ మూడుతెగల నడుమ సంపర్కం జరిగింది. మంగోలియనులే తూర్పువైపుజరిగి చైనా నాగరికతను నిర్మించారు. రెండవతెగ ప్రజలు క్రీ.పూ. 5000 సంవత్సరాల ప్రాంతంలో ద్రావిడులలో కలిసిన సిథియన్ తెగవారు, ఉత్తరంగానూ, నైఋతిగాను పయనించారు. పచ్చికమైదానాలు ఎక్కడ కనిపిస్తే అవైపుగా సాగిపోయారు. వ్యవసాయమే వారి ప్రధానవృత్తి కాబట్టి వారు తూర్పుదిశగా మాత్రం పోలేదు. ఆ దిశంతా పర్వతాలమయం అవటంచేత ఆవైపుగా వారు పోలేదు. మధ్యఆసియా ప్రాంతాన్ని మొత్తం వారే ఆక్రమించారు. మరికొంతదూరం జరిగి యూరప్ తూర్పు పశ్చిమ మధ్యప్రాంతాల్ని ఆక్రమించారు. దక్షిణంలోని బాల్కన్, గ్రీసు, ఇటలీలనుకూడా వారు ఆక్రమించారు. తురేనియనులలో కొందరు ఇంకా దక్షిణప్రాంతమైన మధ్యధరా సముద్రతీరాన్ని తాకారు. వారే ఏజియన్ సంస్కృతిని పెంపొందించింది. వీరిలో ద్రావిడులైన ఒక ఉపశాఖీయులు వ్యవసాయంలో నిష్ణాతులైనారు, నగర నిర్మాణం తెలుసుకొన్నారు. అముదర్య నదికి కాస్పియన్ సముద్రానికి నడిమిప్రాంతాన్ని వాళ్ళు ఆక్రమించుకొన్నారు. తర్వాత వారు ఇరాన్‌లోని జాగ్రోస్ ప్రాంతానికి వెళ్ళారు. అక్కడ వ్యవసాయమే చేస్తూ బ్రతికారు. ఇంకా మంచి జీవనంకోసం ఓబాయిడ్ ప్రాంతంచేరారు. అక్కడే టైగ్రిస్ యూఫ్రటీస్ నదులు ప్రవహిస్తున్నాయి. అక్కడి సముద్రతీరం వర్షాధుమట్టి మయమైపోగా అక్కడినుండి సుమేరుకి వెళ్ళారు. సుమేరియన్ నాగరికతకు పాదులుతీసిన సుమేరులుకూడా ఉత్తర ప్రాంతాలనుంచి వలసవచ్చిన సిథియనుల్లోనివారే. ఉరల్ అల్టాయిక్ మూల దుంపనుండి సుమేరియన్ ద్రవిడియన్ నాగరికతలు పుట్టిపెరగటంవల్లనే ఈరెంటి నడుమ సంబంధాలు కనిపిస్తున్నాయి.

ఉరల్ అల్టాయిక్ మూలకుటుంబంలోని ఉపశాఖఅయిన ఫిన్నోయుగ్రియన్‌తో ద్రావిడకుటుంబం ముడిపడింది. సుమేరియన్ ద్రవిడియన్‌ల సడిమిత్రాతి సంబంధం అంత ప్రాచీనమన్నమాట. అందుకే మెసపొటేమియా నాగరికతకు ద్రావిడులే కారకులయ్యారని చరిత్ర గుర్తించటం. ఈదశలో మధ్యధరా తీర నాగరికత స్పెయిన్, పోర్చుగల్, గ్రీస్, బ్రిటెన్‌దాకా విస్తరించటంలో ద్రావిడ తెగల ప్రాబల్యం చాలావుంది. వీరు కాకసస్ పర్వతశ్రేణులదాకా విస్తరిస్తూ వెళ్ళారు. అందుకే ద్రావిడ బాస్క్—కాకసస్ సంబంధాన్నికూడా పూర్వ పరిశోధకులు గుర్తించక తప్పలేదు. ఇలా ఏషియామైనర్, మెసపొటేమియాలగుండా ద్రావిడులు తూర్పుగా వస్తూవస్తూ ఇరాన్‌దాటి ఇండియాలోకి ప్రవేశించారు. నడుమ వారు ఆఫ్గనిస్తాన్, బలూచిస్తాన్‌లమీదగా పయనించారు. అందుకే బ్రాహుయీభాష ఈప్రాంతంలో మిగిలివుంది. సుమారు క్రీ.పూ. 3,000 సంవత్సరాల ప్రాంతంలో ద్రావిడులు ఇండియాలోకి ప్రవేశించి 2,500 సంవత్సరాల ప్రాంతంలో సింధూలోయ నాగరికతను నిర్మించారు. అంతకుపూర్వమే బలూచిస్తాన్-కుల్లి- ప్రాంతాలలో సింధూనాగరికతకు సంబంధించిన ఒక పురాతన నాగరికతను వీళ్ళు స్థాపించినట్టుగాకూడా చరిత్ర చెబుతోంది.

సింధులోయ నాగరికత (క్రీ.పూ. 2500-1500) కాలానికి ద్రావిడులు ఉత్తరభారతాన్ని మొత్తం ఆక్రమించారు. దక్షిణాదివైపు చొచ్చుకొని వస్తున్నారు. క్రీ.పూ. 3000 సంవత్సరాల ప్రాంతంలో మూల ఇండోయూరోపియన్ తెగ ప్రజలు ఉరల్ పర్వతాల దక్షిణదిశనుంచి ఇండియావైపు రావటం మొదలుపెట్టారు. వారు మిక్కిలి స్ఫురద్రూపులు, దృఢకాయులు. చురుకైన బుద్ధి ఉన్నవారు. వారి భాషలనూ వ్యవస్థలను సుస్థిరపరచుకోవటంలో అసాధారణమైన ప్రతిభ ఉన్నవారు. అప్పటికే వారి భాషా సంస్కృతులకు సంబంధించిన ఒక 'ముద్ర' ఏర్పడి వాసికెక్కివుంది. వారు అప్పటికి ఇంకా స్థిరనివాసంలేని 'జంగములే' అయినా వారి భాష మూల ఇండోయూరోపియన్ దశలోనే ప్రమాణరూపాన్ని పొంది సాహిత్య సంప్రదాయాల్లో ఒక ఒరవడి; ఎంత విస్తారమైన శాస్త్ర వాఙ్మయాన్ని అయినా మౌఖికంగా తరతరాలకు మోసుకొనిపోయే అభిలాషలు ఉన్నజాతి అది. భౌతికశక్తితో బౌద్ధిక చాతుర్యంతో ఎక్కడెక్కడ సిథియనులు విస్తరించారో ఆయా చోట్లను ధ్వంసంచేస్తూ వారి సాహిత్య-వైజ్ఞానిక సంప్రదాయాలను నాశనంచేస్తూ వారిని తమలో కలుపుకుంటూ విస్తరించటం మొదలుపెట్టారు. ఇలాగే ఇండియాలోకూడా ఇతరజాతి సంస్కృతుల్ని తమలో లీనంచేసుకొనే పనే అత్యద్భుతంగా చేశారు.

మాక్స్ ముల్లర్ కాలంలో మధ్య ఆసియాలోని తమ నివాసస్థానంనుంచి తూర్పు ఇరాన్, అక్కడినుంచి మెసపొటేమియా, అక్కడినుంచి ఇండియా చేరారని ఒక అభిప్రాయం ఉండేది. కాని ఇటీవలి పరిశోధనలు ఆర్యుల గమనాన్ని వేరే మార్గాలద్వారా నిరూపిస్తున్నాయి.

(1) పశ్చిమంగా గ్రీసుగుండా (2) కాకసస్ పర్వతాలద్వారా మెసపొటేమియా ఉత్తరప్రాంతంలో నిలిచి పర్షియా ఆఫ్గనిస్తాన్‌లద్వారా ఇండియాలోకి వచ్చారన్నది. అందుచేత ఇండోయూరోపియన్ తెగవారు సిథియనులను వెన్నాడుతూ, తరుముకొంటూ విస్తరించారన్నది నిస్సందేహంగా చారిత్రకసత్యం.

ఆర్యులు ఇండియాలోకి ఎప్పుడువచ్చారో, అప్పటికే సింధులోయలో ఉజ్జ్వలమైన నాగరికతా నిర్మాణం చేసిన ద్రావిడులను ఎదుర్కోవాల్సివచ్చింది. ద్రావిడులు తమ శాయశక్తులా ఆర్యులపై గట్టిదెబ్బనే తీశారు. భౌతికశక్తిలో కాని, సాంస్కృతిక అభివృద్ధిలోకాని ద్రావిడులు తమకేమాత్రం తీసిపోరని ఆర్యులు గుర్తించారు. ఈ ఉభయతెగల యుద్ధం 5 శతాబ్దుల పాటు సాగింది. ఆర్య భాషాసంస్కృతులు ఈ సందర్భంలో ఎంతగానో ద్రావిడ ప్రభావానికి లోనయ్యాయి. వేదకాలానికే ఇండోయూరోపియన్ మూలాలులేని అనేక భాషాంశాలు ద్రావిడభాషా సంపర్కంతో సంస్కృతంలో ప్రవేశించాయి. అసలు ఆర్య సంస్కృతి ద్రావిడ సంస్కృతిలోనే లీనమైపోయింది. నమ్మకాలు, ఆచారాలు, మతం, కళారూపాలు, జీవనసరళి, జీవితదృక్పథం—వీటన్నిటిలోను ఆర్యులపై ద్రావిడప్రభావం ప్రసరించింది. మెసపొటేమియాలో వృద్ధిపొందించుకొని వచ్చిన అంశాలనే ఆర్యులలో ద్రావిడులు ప్రవేశపెట్టారు. ఇలా ఆర్యసంస్కృతి అని ఏది చెప్పబడుతోందో అదంతా స్పష్టంగా ద్రావిడ సంస్కృతి అన్న పునాదిపై నిర్మించబడ్డది.

క్రీ.పూ. 1000 సంవత్సరాల ప్రాంతంలో ఆర్య ద్రావిడుల ఘర్షణ ఒకవైపు సాగుతుండగా ఆర్యులు హరప్పా నాగరికతను ధ్వంసంచేశారు. ద్రావిడులు ఉన్నట్టుండి మెగాలిథిక్ సంస్కృతిని, మతాన్ని, ఇనుప ఆయుధాలను పుచ్చుకొని బలిష్ఠులై వడివడిగా దక్షిణాదివైపు తరలివచ్చారు. వీరిలో కొంతమంది తూర్పువైపు బర్మా, మెడగాస్కర్‌లకు వ్యాపించగా ఇంకాకొందరు ఆఫ్రికన్ తీరానికి కూడా వ్యాపించారు. కొందరు శ్రీలంక అక్కడినుంచి మలయాద్వీపం, తద్వారా సుమత్రాలకుకూడా వ్యాపిస్తూపోయారు. ఇంతగా విస్తరించిన వలసజాతి మరొకటిలేదు, మలయాద్వీపంనుండి ఆస్ట్రేలియా, తూర్పుగా చైనా, ఫిలిప్పైన్స్, ఫార్మోసాలవరకు విస్తరించారు. ఇంకా దక్షిణకొరియా, జపాన్‌ల వరకు కూడా వారు సాగినట్టు నిరూపణలు లభిస్తున్నాయి. ఉత్తరకొరియాను తురేనియన్ శాఖీయులే మరోమార్గాన ఆక్రమించారు. అందుకే ద్రావిడ-కొరియన్ భాషలనడుమ చాలా సామ్యాలు కనిపిస్తాయి. ఈకారణంగానే జాపనీస్ భాష మూలాల్ని గురించి శోధిస్తున్నవారు ద్రావిడభాషల్లో చాలా కీలకాలు దొరుకు

తున్నాయని అంటున్నారు. పసిఫిక్ మహాసముద్రంలోని ద్వీపాలలోను, చైనా, జపాన్ కొరియాలలోను వ్యాపించిన హిందూ బౌద్ధమతాలు దక్షిణాదిలోని మహాబలిపురం నుండి వ్యాపించినవే. కంబోడియా, మలేషియా, ఇండోనేషియాలలో మనం ద్రావిడ భాషాసంస్కృతుల ప్రభావాన్ని చూడవచ్చు. బర్మాలోవాడే లిపి తెలుగు కన్నడాలలాగానే గుండ్రంగా ఉంటుంది.

ఇలా ద్రావిడం అత్యంతన్నా కనీసం 2000 సంవత్సరాలు ప్రాచీనతరమైనది. (చూ. హిరేమఠ్ 1984; 203-208)

• • •

## పునరాలోచన :

మొత్తంమీద పై విమర్శనంతా చదివితే పండితులలో 'ద్రావిడ' మూలాల విషయంగా శబ్దవ్యుత్పత్తి సంబంధంగా ఎంత అలజడిఉందో అర్థమవుతుంది.

ఒకవిషయం చాలా ముఖ్యంగా మనల్ని ఆకర్షిస్తోంది. ఆర్యులే కాదు ద్రావిడులుకూడా బయటివారేననటం. నేను మొదట్లో హిరేమఠ్‌గారే ఉన్న ఆధారాల్ని అనుసరించి ద్రావిడుల-ఇండోయూరోపియన్‌ల అతిప్రాచీన సాహచర్యాన్ని నిరూపించారని అనుకొన్నాను.

కాని ఇటీవల ఏదో ఒక సందర్భంలో ఆచార్యబిరుదు రాజురామరాజుగారిని కలిశాను. అప్పుడు చిల్లరిగె శ్రీనివాసరావుగారి 'ఆంధ్రదేశపు చరిత్రము' అనే గ్రంథానికి కేతుమళ్ళ రాజగోపాలరావుగారు రాసిన పీఠిక చదవండి అని ఆయన ఆ గ్రంథాన్ని ఇచ్చారు. ఆ గ్రంథం ఆంధ్రసరస్వతీ గ్రంథమాల వారి 30వ ప్రచురణం (1933). రాజగోపాలరావుగారి పీఠిక 104 పేజీల నిడివి కలిగింది. పుస్తకంలోని విషయాలకన్నా నిజంగా చాలా విలువైన పీఠిక అది.

అందులో ఆయన నాల్గు అంశాలమీద రాశారు :

1. మన ఆదిమభూమి పాశ్చాత్యశాఖలు (1-20)
2. తెలుంగ జాతుల ప్రాచీన బాంధవ్యములు 1 (21-44)
3. " " 2 (45-75)
4. తెలుంగజాతి ఒక దేవజాతి (76-104)

ఆయన పీఠికా వ్యాసంలో చెప్పిన అతి ప్రధానమైన విషయాన్నిమాత్రం ఇక్కడ స్మరిస్తాను:

"తెలుగుజాతుల ఆదిభూమి ఆసియాఖండమునందలి మధ్యభూమి... ప్రియవ్రతుని తనయులు తొమ్మండ్రు ఇలా వృతవర్షము నుండి వెడలి జంబూ ద్వీపము నాక్రమించుటచే వారి పేర్లతో నాయా వర్షములు ఒప్పుచున్నవని హిందూ వేదవేదాంగములు. కషిప్ప (కశ్యపః)ను మునిసంతతివారు సుమేరువునుండి వెడలి దేశముల నాక్రమించిరని పశ్చిమ ఆసియాఖండంలోని బిరేనియనుమతీయుల వేద వేదాంగములు.... ఆసియానుంచి పదివేల ఏండ్లకు పూర్వము కొందరు మానవులు పశ్చిమమునకును, మరికొందరు దక్షిణమునకును వలసపోయినట్లు పండిత సిద్ధాంతములు. అట్లు పశ్చిమమునకు వెడలిపోయినవారు ట్యూటనులు. వీరే నేటి ఆంగ్ల భాషాదుల పూర్వరూప భాషను మాట్లాడినవారు. ఈ ప్రాచీనదశలో ఈ భాషలన్ని ఒకదానికొకటి అర్థమయ్యేదశలో ఉండేవట. ఈ భాషలకును, ఆంధ్రభాషకును అత్యంత సంబంధమున్నది... ఈ సాన్నిహిత్యం కేవలం ప్రమాదజనితం కాదు. వీరందరూ ఒక్క తెగవారు, వీరు సాంస్కృతికులకులిన్నులని, సాంస్కృతికులు భరతవర్షంలో ప్రవేశించకమునుపే ఇందుండిరనియు నంగీకరింపబడినది. వీరు ఈ తెగలకు 'ద్రవిడియన్ రేశన్' అని నామకరణము చేసిరి. కాని దాక్షిణాత్య శాఖలనుట సమంజసము. 'ద్రవిడియన్' అనుశబ్దము అరవదేశములో అరవవారి ప్రోత్సాహముచేత, అరవమే దాక్షిణాత్య భాషలన్నింటికి మార్గదర్శకమను భ్రమతో కాల్డువెల్లు దొరగారు తెలుగు తమిళ్ళగు భాషల సముదాయమున కంతకును పెట్టిన పేరు. ద్రవిడశబ్దము సంస్కృతమున అరవములకును, అరవదేశమునకునే వర్తించుచున్నది. ద్రవిడశాఖలనగా అరవశాఖలుగాని ఆంధ్రశాఖలు కావు. ద్రవిడ భాషలనగా అరవభాషలుగాని ఆంధ్రభాషలు కావు. ఒక్క దొర పేరుపెట్టినారు. అందరు దొరలును దానినే పట్టుకొందురు. అందువలన తెనుగునకుకూడ ద్రావిడ భాషయని పాశ్చాత్యులు నామకరణముచేయుచున్నారు. దీనికి అరవవారు చేతులు కొట్టుకొనుచున్నారు. నిజమైన నామకరణము వలయునేని వీనిని దాక్షిణాత్య భాషలనవలెను. ఇవి తెనుగుజాతి భాషలనుట సర్వసత్యము: తెలుంగు జాతి భాష అనుట యత్యుత్తమ సంప్రదాయము. కాని మనకంత యోగ్యతలేదు. అరవమును దాక్షిణాత్య భాషయనియే మనము తలంతము" (చూ. పుటలు 1—33)

## విమర్శ :

ఇప్పుడు రెండు ప్రశ్నలు పుడుతున్నాయి. ఆర్యుల్లాగే ద్రావిడులనబడే వారుకూడా యురల్ ఆల్టాయిక్ పర్వతశ్రేణుల్లో నివసించినవారే అయితే వారి నడిమి సంబంధం జ్ఞాతిసంబంధమా! మిత్రసంబంధమా! అన్నది ఒకటి. ప్రాకృతాలని సంస్కృతీయులు పిలిచిన భాషల ప్రాచీనచరిత్ర ఏదన్నది మరో ప్రశ్న. ఈ రెంటికీ ఇంతవరకూ రాసినవారెవ్వరూ సంతృప్తికరంగా సమాధానం చెప్పలేదు.

కాని పుస్తకాన్నిపసక్తంగా ప్రాకృతాలకు ద్రావిడులకు నడుమ చాలా సామ్యాలున్నాయని రాసిన పండితులు చాలామంది ఉన్నారు. వారందరి మీదా తరువాతి వ్యాసాల్లో విస్తృతంగా చర్చ జరుగుతుంది.

రాజగోపాలరావుగారు అది జ్ఞాతిసంబంధమే అన్నట్టుగా రాశారు. హిరేమఠ్‌గారు మాత్రం అది జ్ఞానసంబంధమని నిర్ధారించేరుసుమా! అని వారించారు. (పు. 173) అంటే ఈ రెండు భాషాతత్త్వ నిర్మాణ సంబంధాలు అంత గుప్తమైన సగోత్రతను ప్రతిబింబిస్తున్నాయని అర్థం.

కాని ద్రావిడులను ప్రాకృతాలని అంగీకరించటంలో ఉన్న సమస్య ఏమిటీ అన్నది ఇంకా సమాధానం దొరకని ప్రశ్నే: ప్రాకృతభాషలలో కనిపించే అనార్య ధర్మాలను ద్రావిడభాషల ప్రభావంతో ఏర్పడ్డవని అన్నారు. ఒక పదంఇచ్చి ఇది మూలద్రావిడమా! ప్రాకృతికమా! అని అడిగితే సమాధానం తేల్చగల పరిశోధకు డింకా ఎవరూ కనిపించటంలేదు.

ఈ చారిత్రక దశలోనే స్వామినాథయ్యర్, చిలుకూరి నారాయణరావు ప్రభృతులు పుట్టారు. వారివారికి సత్యమనిపించిన విషయాలను సిద్ధస్పృహతో ప్రచారంచేశారు. వారి పరిశోధనల ప్రకారంకూడా 'ద్రావిడ' మనేపేరు 'అరవ' సూచకమేతప్ప-దానికి విశాలార్థంలేదు.

హిరేమఠ్‌గారు చూపించిన విశాలార్థాలన్నిటిమీదా ఖండనలు ప్రతిపాదించటానికి వీలుంది. ఆప్రయత్నం తరువాతి వ్యాసాల్లో చూస్తారు.

దాక్షిణాత్య భాషలు అని పిలిచినతరువాత సంస్కృతం - ప్రాకృతం - అపభ్రంశం-విభాష-ప్రతిభాష-ప్రతినియత భాష - ఇలాంటి పేర్లమీద మనకు సరైన అవగాహన అవసరమవుతుంది. వికృతి - అపభ్రంశం అనే పరిభాషల్ని వాడి ప్రాచీన వ్యాకర్తలు ఏ భాషాపరిణామాల్ని నిర్దేశించారు! ఇలాంటి ప్రశ్నలకు సమాధానం తరువాత చూద్దాం.

తెలుగు-త్రిలింగ లాగానే తమిళ-ద్రావిడల నడుమ కూడా సహజీవనం ఉండేది. ఆ సహజీవనమే ఈనాడు చాకలి-రజక అనే మాటలనడుమ కనిపించేది. ఒకటి ప్రాకృతికం. మరోటి సాంస్కృతికం.





రతన్ కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయ్...విపరీతమైన ఆకలిగా వుంది...రాత్రి కూడా భోజనం సరిగా చేయలేదు. ప్రొద్దున వచ్చేటప్పుడు కషాయంలా వున్న గ్లాసెడు టీ నీళ్ళు తాగొచ్చాడు. అవెప్పుడో భస్మమై పోయాయి. మిట్ట మధ్యాహ్నమవుతుంది. ప్రొద్దుటినుంచి ఒక్క బేరం కూడా కుదరలేదు.... "ప్రొద్దున్న లేచి ఎవ్వల మొకం సూసినో....ఒక్క గిరాకి వస్తలే" తనలో తనే గొణుక్కున్నాడు. టవర్ ప్రక్కన రిక్షా పెట్టి గిరాకీ కొరకెదురు చూస్తున్నాడు....చూచి చూచి కళ్ళు కాయలు కాస్తున్నాయి. అయినా లాభం లేదు.... రోడ్డుపై పోతున్న వాళ్ళ నుద్దేశిస్తూ "రిక్షా కావాలా సార్! రిక్షా కావాలా అమ్మా" అడుస్తూనే వున్నాడు .. ఒక్కరూ అతని ముఖం చూడటం లేదు. ప్రొద్దు గడుస్తున్నకొద్దీ కడుపులో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయ్. రిక్షా కొంత దూరంలోనే నోరూరించే మిరపకాయ బజ్జీల బండి, అరటిపళ్ళ బండి, ఎదురుగా ఢిల్లీవాలా స్వీటు హౌస్....చూస్తూ గుటకలు మింగుతున్నాడు రతన్... స్వీటు పోనీ, అరటిపండు పోనీ, ఒక్క మిరపకాయ, కనీసం టీ నీళ్ళతోనైనా ఆత్మారామున్ని సంతృప్తి పరుద్దామంటే జేబులో ఒక్క పైసా లేదు. "ఒక్క గిరా కొచ్చినా బాగుండు" అనుకున్నాడు, లొటపెట పెదవులనెదిరి చూసే నక్కలా ఎదిరి చూస్తూనే వున్నాడు. కాని అతనిపై ఎవరికీ కనికరం కలగడం లేదు. రిక్షా బయటకు తీసి రోడ్డుపై నాలుగు దిక్కులా తిప్పాడు....నడచిపోతున్న వ్యక్తుల

# ఘర్మజలానికి.... ఖరీదు కట్టే షరాబు...?

## కాటవశ్రీ

దగ్గర స్లోచేసి "రిక్షా కావాలా సార్..." అనడిగాడు. అయినా దొరకటం లేదు. నీరసంవల్ల కాళ్ళు నొప్పెడుతున్నాయి. రిక్షా తెచ్చి టవర్ పక్కనుంచాడు. కాళ్ళు గుంజుతుండే బయటకు చూస్తూ రిక్షాలో ఒరిగాడు....ఆలోచనలో పడ్డాడు.... అతని మనసు గత జీవితపుటల వెంట పరుగిడుతుంది.

* * *

రతన్‌ది కరీంనగర్ జిల్లాలోని ఓ కుగ్రామం స్వంత వూరు. ముప్పైఏళ్ళ క్రితం లంబాడీ కులంలో పుట్టాడు. అతని తాతలు తండ్రులు పాలేర్లుగానే బతికారు. ఏ భూవసతీ లేని రతన్‌కు కూడా పాలేరుండటం తప్పలేదు... పదిహేనేళ్ల వయసునుండి దాదాపు పదేళ్ళు పాలేరుగానే బ్రతికాడు. కాయకష్టం చేశాడు' శక్తి వంచన లేకుండా పని చేసాడు. ఒళ్ళు హూనం చేసుకున్నాడు....పనికి రాత్రి పగలు తేడా లేదు... అయినా యజమాని మెప్పుకంటె తిట్లనే ఎక్కువ పొందాడు. పోగా యజమానిచ్చే ఏడాదికి రెండువేల జీతం సరిపోయేది గాదు. తన సంపాదన, భార్య కూలిచేసి సంపాదించినా కుటుంబం గడవడం కష్టంగానే వుంది. ఇద్దరు పిల్లలు కలిగారు ...తర్వాత ఖర్చులు మరింత పెరిగాయి. పొట్ట గడవటమే కష్టంగా వుంది, జీతం పెంచమంటే యజమానికోపం. ఇక ఆ వూళ్ళో బ్రతకడం కష్టమనుకున్నాడు. పోగా పిల్లలను చదివించుకోవాలన్న కోర్కె రతన్‌కుంది... పాలేరు బతుకుతో తమకే పొట్టలు నిండకుంటే పిల్లలను చదవించేదెలా అనుకున్నాడు. ఊరు విడిచి పోవడానికే నిర్ణయించుకున్నాడు. పట్నం వెళ్ళి ఏ హమాలిగానో, కూలిగానో, రిక్షావాడిగానో స్థిరపడితే ఇంతకంటె ఎక్కువే సంపాదించుకోవచ్చనుకున్నాడు. ఊళ్ళో ఉన్న చిన్న పెంకుటిల్లు నమ్మాడు. ఊరు బయట వున్న అరెకరం చెలుక నమ్మాడు. భార్యా పిల్లలతో కరీంనగర్ చేరుకున్నాడు. కార్ఖానాగడ్డలో అరగుంట భూమి తీసుకున్నాడు. చిన్న గుడిసె వేసుకున్నాడు. ఉన్న డబ్బయిపోయింది. స్వంత రిక్షా కొనుక్కునే శక్తి లేదు. బాడుగకు తీసుకొని రిక్షా నడుపుతూ కాలం గడుపుతున్నాడు.

త్వరలోనే పట్టణ జీవితంలోని చేదు అనుభవానికొచ్చింది రతన్‌కు. పందుల గుహలా వున్న చిన్న గుడిసె...చుట్టూ మురికి .... జుయ్‌మంటూ ఈగలు, దోమలు... గబ్బు వాసన...జాలర్ల కంపు...పొద్దంతా రిక్షా లాగి లాగి ఏ అర్ధరాత్రికో ఇంటికొచ్చి పడుకుంటే నిద్రపట్టదు.

పిల్లలను బడికి పంపుదామంటే ప్రభుత్వ పాఠశాలల్లో సీట్లు దొరకవు... ప్రైవేటు పాఠశాలల్లో ఫీజు భరించడం అతనివల్ల కాదు...

తనపై తనకే జాలేసింది రతన్‌కు.

ఏడేళ్ళనుంచి చేస్తున్న తన వృత్తిలో పొందిన అనుభవాలు జ్ఞాపకమొస్తున్నాయి రతన్‌కు....

రిక్షావాళ్ళు తమనేదో మోసం చేస్తున్నట్టు కొసరి కొసరి బేరం చేస్తుంటారు. ఎన్నో దుబారా ఖర్చులకు నూర్లు, వేలు వృధా చేసే పెద్ద మనుషులు కూడా రిక్షావాడితో రూపాయి, అర్ధరూపాయి విషయంలో కూడా కొసరుతుంటాడు... కాళ్ళు పీక్కుపోతుండగా, డొక్కలు లోపలికి పోతుండగా నిక్కుతూ. నీలుగుతూ ఆయాసంగా రిక్షా తొక్కినా ఎవరికీ దయా దాక్షిణ్యాలుండవు. ఇచ్చే రెండు మూడు రూపాయలు అనవసరంగా ఇస్తున్నట్టు పోజు పెడుతూ ఇస్తారు. ప్రొద్దుటి నుంచి రాత్రివరకు శ్రమ పడితే మంచి గిరాకీ వున్న రోజు ఇరవై ఇరవై ఐదు రూపాయల వరకు దొరకొచ్చు. ఒక్కోరోజు పది దొరకడం కష్టమే. మరో సారయితే రిక్షా కివ్వాల్సిన బాడుగ ఐదు రూపాయలు దొరకడం కూడా గగనమే. ఈ సంపాదనతో బ్రతకడం కష్టంగానే వున్నా తప్పదు. ఆరోగ్యం మంచిగ లేకున్నా, ఇంట్లో భార్యా పిల్లల ఆరోగ్యం బాగా లేకున్నా పనికిపోవడం తప్పదు. పోనిరోజు దాదాపు పస్తులే ...ఏ రోజు దొరికిన డబ్బుతో ఆ రోజు బియ్యం, నూనె, పప్పులాంటి నిత్యావసర వస్తువులు కొనుక్కోగా మిగిలేది దాదాపు శూన్యమే. ఐదూ పది అప్పుడప్పుడు మిగిల్తే బట్టలు కొనుక్కోడానికవుతాయి. జబ్బుపడితే డాక్టర్ దగ్గరి కెళ్ళడానికైనా డబ్బుండదు... అత్యవసర సమయంలో నూటికి నెలకు పది వడ్డీ చొప్పున సింగ్ దగ్గర అప్పు తెచ్చుకోవాలి...ముక్కలు ముక్కలు చేసుకొని సంపాదించిన డబ్బుతో వడ్డీ కట్టడానికి సతమతమవాలి...

"ఇక్కడి బ్రతుకక్కంటే పల్లెటూరు బ్రతుకే నయం..." ఎన్నోసార్లు అనుకోకుండా ఉండలేకపోయాడు రతన్.



రకరకాల వ్యక్తులు రిక్షా ఎక్కుతుంటారు. ఒకరు కసురుకుంటారు. ఒక్కొక్కరు తిడతారు కూడా. కొందరు చులకనగా మాట్లాడుతారు....అయినా ఓపికగా భరించాలి. భరించకుంటే బేరాలు వదులుకోవాల్సి వస్తుంది. అవసరానికి మించిన పోటీ వున్న సమయంలో అణకువ లాంటిదవసరం ...కొంతమంది రిక్షా వాళ్ళు దాదాగిరి చేసినా అలాంటివాళ్ళు చాలా తక్కువ...కొందరు ప్రయాణీకులు రిక్షాలోనే కూర్చొని సరసాలాడుకుంటారు...నవ్వుతూ తుళ్లుతుంటారు... ఏవేవో మాట్లాడుతుంటారు ...రిక్షావాడు వినీవిననట్టు నటించాలి.

ఏం బ్రతుకులు! మనసులో తానే గొణుక్కున్నాడు రతన్.

ఓరోజు రాంలాల్ సేఠ్‌తో జరిగిన ఘర్షణ జ్ఞాపకమొచ్చింది రతన్‌కు. ఉప్పుబస్తాలాంటి ఆకారంతో క్వింటాల్ పైన్నే బరువున్న రాంలాల్ గడియారం దగ్గర రిక్షా ఎక్కాడు. ఆయాసపడుతూ ఎన్.ఆర్.ఆర్. కాలేజీ దగ్గరకు తొక్కుకు పోయాడు రతన్. రిక్షా దిగి చేతిలో రెండు రూపాయలు పెట్టాడు.

"సేఠ్‌జీ ఇంకో రెండ్రూపాయలివ్వండి" అన్నాడు రతన్.

"ఒక్క మనిషికి నాల్గు రూపాయలా? ఎక్కడ నేర్చుకున్నవు గంతే పో పో" అని నడవసాగాడు రాంలాల్.

"సేఠ్ సాబ్! గడియారం నుంచిక్కడికి చాలా దూరముంది...రెండ్రూపాయలివ్వండి" అని అడ్డంపోయి నిల్చున్నాడు రతన్.

"పోరా పో! రొండ్రూపాయలే ఎక్కువ ...." కసిరాడు సేఠ్.

"మర్యాదగా మాట్లాడుండ్రి సేఠ్. ఇక్కడికి నాల్గు రూపాయలు రోజు వస్తనే వున్న" అన్నాడు రతన్.

"ఏందిర నీతోని మర్యాదగ మాట్లాడేది? రొండు రూపాయలకన్న ఒక్క పైసెక్కో ఇయ్య....ఏం జేసుకుంటవో చేసుకో పో ..." అని నడవసాగాడు రాంలాల్.

ఇలాంటివాడితో మొదటే బేరం చేయాల్సింది అనుకున్నాడు రతన్. "నా రొండ్రూపాయలతోని ఇల్లు గట్టుకో పో" అని తిరిగొచ్చాడు రతన్...ఇలాంటి వారెంతోమంది ఎదురయ్యారు రతన్‌కు.

ఎవరైనా బేరంకంటె అర్ధరూపాయో, రూపాయో ఎక్కువిస్తే రిక్షావాళ్ళ కళ్ళల్లో వెలుగు ...కృతజ్ఞతాభావం ...అలా ఇచ్చేవాళ్ళుండరు కాని అప్పుడప్పుడు ఎవరో ఒకరు తటస్థపడుతుంటారు.

రతన్ కూతురు తల్లితో పాచిపనులు చేయడానికి కెళ్తుంది...."ఏదేళ్ళ కొనుకునైనా చదివేస్తే బాగుండును" అనుకున్నాడు రతన్.

* * *

తన జీవితం గూర్చి ఆలోచిస్తూ వెనక సీట్లో ఒరిగిన రతన్ "ఏయ్ రిక్షా... " అన్న పిలుపుతో ఈ లోకంలో కొచ్చాడు. గబగబా లేచి రిక్షా తొక్కుతూ కొంచెం దూరంలో వున్న పిలిచిన మనిషి దగ్గరికెళ్ళాడు....

"ఎక్కడికి కెళ్ళాలి సార్... " అడిగాడు రతన్!

"మంకమ్మ తోటకు వస్తావా?" అడిగాడా వ్యక్తి.

"మా వస్తా సార్ ఎక్కండ్రి"

"ఏం దీసుకుంటవో చెప్పు"

"ఎంతమంది సార్"

"ఇద్దరు పెద్దోళ్లం...ఒక్క బాబు ..."

టవర్ దగ్గర్నుంచి మంకమ్మ తోటకు ఇద్దరికయితే నాలుగు రూపాయలు మామూలు బాడుగ... బాబున్నాడు కాబట్టి ఇంకో రూపాయి కలుపుకుంటే ఐదు రూపాయలు . ఎలాగూ బేరంలో ఓ రూపాయి తగ్గిస్తారని

"ఆరు రూపాయలివ్వండ్రి సార్" అన్నాడు రతన్.

"ఏంద మేం కొత్తోళ్ల మనుకుంటున్నవా? ఎన్నిసార్లెక్కతలేం?" అన్నాడా వ్యక్తి.

"ఎంతిస్తరో చెప్పండ్రి సార్"

"మూడు రూపాయల కంటెఒక్క పైసెన్నెక్కో ఇయ్యం..."

"ఇద్దరికే నాల్గు రూపాయలిస్తరు సార్...ఐదు రూపాయలియ్యండ్రి"

"మూడు రూపాయలకంటె ఒక్క పైసెన్నెక్కో ఇయ్యం...నీ ఇష్టం" అని పోబోయాడా వ్యక్తి.

ప్రొద్దుట్నుంచీ ఒక్క బేరమూ లేదు... వచ్చిన ఈ ఒక్క బేరాన్నిలా వదలి పెట్టుకోవడం ఇష్టంలేదు రతన్‌కు... మధ్యాహ్నం భోజనాని కింటికెళ్లేవర కొక్క బేరమన్నా సంపాదించుకొంటే బాగుండనుకున్నాడు....సరే పొయ్యేదేముంది నా రెక్కల కష్టమే కదా అనుకొని

"ఐదు రూపాయలు వాజిబే కాని నాల్గు రూపాయలియ్యండ్రి సార్..." అన్నాడు.

"మూడున్నరిస్త నీ ఇష్టం" అంటూ పోబోయేవాడాగాడు.

"సరే ఎక్కండ్రి" అని టాప్ తీసివేసాడు రతన్.

ఆ వ్యక్తి అతని భార్య ఎనిమిదేళ్ళ వాళ్ళ బాబు ముగ్గురూ రిక్షా ఎక్కి కూర్చున్నారు. రతన్ కూడా ఎక్కి మంకమ్మతోట దిక్కు నడిపిస్తున్నాడు రిక్షాను. కడుపులో నకనకలాడుతూ ఆకలి...నీరసం... రిక్షా కదలడం లేదు.

"పోనీయవోయ్ తొందరగా పోనియ్" అరిచినట్టన్నాడా వ్యక్తి.

"పోనిస్తూనే వున్నా కదా సార్" అని బలం కూడదీసుకొని తొక్కుతున్నాడు.

పైన నిప్పులు కక్కుతూ ఎండ ...చెమట ధారాపాతంగా కారుతుంది... చెమట నీటితో వేసుకున్న బనీను తడిసి ముద్దయింది. కాళ్ళకు చెమటొచ్చి పెడల్స్ జారుతున్నాయి. రిక్షా తొక్కుతూనే కడుపులో ఏదైనా పడితే బాగుండేది అనుకుంటున్నాడు ...కాని ప్రస్తుతం ఆ అవకాశమే లేదు...రిక్షా ఆపి టీ తాగుదామన్నా డబ్బు లేదు...గిరాకీ నడుగుతే కసురుకుంటారు...డబ్బు చేతిలో పడ్డ తర్వాత హోటల్ కెళ్ళి టిఫిన్ చేయాలని అనుకుంటూ రిక్షా తొక్కుతున్నాడు.

"టిఫిన్ చేస్తే కడుపేం నిండుతుంది....? ఇంటికెళ్ళి అన్నం తినాలి..." మళ్ళీ అనుకున్నాడు రతన్.

"ఇంట్ల బిడ్డ జ్వరమొచ్చి పన్నది....డాక్టర్ దగ్గరకు తీసుకుపోవాలె... సర్కారు దావఖానకు తీసుకపోతే రంగునీళ్లిస్తరు. దాంతోని జ్వరం తగ్గది.... ప్రైవేటు డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాలె...ఓ పదిరూపాయలన్న వస్తె బాగుండు" ఆలోచిస్తూ రిక్షా నడిపిస్తున్నాడు....దమ్మొస్తుంది... ఎగపోస్తుంది...ఎదురుగా వస్తున్న లారి రిక్షాకు నాలుగంగుళాల దూరంనుంచి సర్రుమని దూసుకపోయింది. గజగజా వణికాడు రతన్ ...ఇంకొంచెం ఇటైతే తన పని అంతే... అనుకున్నాడు. రిక్షాలో కూర్చున్నవాళ్ళు అటూ ఇటూ ఊగారు....

"ఏందోయ్ తాగినవా... ? కొంచెమయితే లారి కిందికి పొయ్యేది.... సూసుకుంట పోనియ్యి ఏం రిక్ష దొరికిందిరా బాబు... " అన్నాడతను.

రిక్షావాళ్ళంటే తాగుబోతులన్న అభిప్రాయం చాలామంది కుంటుందని రతన్‌కు తెలుసు...తాను ప్రొద్దుటినుంచి గుక్కెడు టీ నీళ్ళు తప్ప ముట్టలేదని చెప్పాలనుకున్నాడు. లాభం లేదని ఊరుకున్నాడు.

"లేస్సార్ ఆ లారోడే పూర్తిగా రాంగ్ సైడచ్చిండు... వాళ్ళకు కండ్లు కనపడయి...." అన్నాడు రతన్.

"సరిగని పోనియ్ ...." కసిరాడతను...

ఆయాసపడుతూ రిక్షా తొక్కుతున్నాడు రతన్...ఎత్తుగడ్డొచ్చింది.... రిక్షా కదలడం కష్టంగా వుంది ...సీటుపైనుండి లేచి తొక్కుతున్నాడు....అయినా కదలడం లేదు.. ఇక లాభం లేదని రిక్షా దిగాడు. కాళ్ళను భూమికి నొక్కిపెడుతూ పండ్లు బిగబట్టి బలంగా రిక్షాను చేతుల్తో నడిపిస్తున్నాడు...కొంత

దూరం అలాగే అతికష్టంగా తీసుకెళ్ళాడు. మళ్ళీ రిక్షా ఎక్కి నడిపిస్తున్నాడు.... కూచున్న తోలు సీటు చెమట నీళ్ళతో తడిసింది...చేతకాకున్నా తొక్కుతూనే వున్నాడు....ఓ పండ్ల దుకాణం సమీపించగానే—

"ఏయ్ రిక్షా ఆపు... అన్నాడు రిక్షాలోని పెద్దమనిషి. ఆపాడు రతన్.

"ఓ డజన్ అరటిపళ్ళు తీసుకరాపో"అని ఐదురూపాయలనోటు రతన్ చేతి కిచ్చాడు. అరటిపళ్ళు మిగిలిన ఒకరూపాయ చిల్లర తెచ్చిఇచ్చాడు రతన్. రిక్షా ఎక్కి తొక్కుతున్నాడు. ఎదురుగా ఓ కాలేజీకుర్రాడు యమస్పీడుగా సైకిల్ తొక్కుతూ వస్తున్నాడు. గంట మ్రోగించాడు రతన్... ఎటోచూస్తూ సైకిల్ నడుపుతున్న కుర్రాడు గంట ధ్వని విన్లేదు.... అదేవేగంతో దూసుకొస్తున్న సైకిల్‌ను తప్పించడానికి పూర్తిగా ఎడమవైపుకు పోయాడు రతన్.... రోడ్డు దిగింది రిక్షా.... ఓ చిన్నగుంటలో ఠపీమని దిగింది. గొణుగుతూ రతన్‌ను తిట్టారు భార్యాభర్తలు.... వాళ్ళను దింపి గుంటనుండి రిక్షాను పైకిలాగి మళ్ళీ కూర్చోమన్నాడు.... కూర్చోగానే నడిపిస్తున్నాడు.

కడుపులో పేగులు నులిపెడుతున్నాయి.... తన కష్టమయ జీవితమంతా జ్ఞాపకమొస్తుంది.... తన మార్గంలో తాను పోతున్నా నిర్లక్ష్యంగా సైకిళ్ళు నడిపి యాక్సిడెంట్లుచేసి తనను వేధించిన కుర్రాళ్ళు తనకి జ్ఞాపకమొచ్చారు... పల్లె జీవితాన్ని వదిలిపెట్టి పట్నానికొచ్చి తానేం బావుకున్నాడో రతన్ కర్థంకావడం లేదు.... పల్లెల్లోవున్న ఆత్మీయత పట్టణాల్లో కనబడటంలేదు రతన్‌కు.... అంతా కృత్రిమత్వం....

రిక్షా ఫైర్‌స్టేషన్ దాటి సాగిపోతుంది... తలనుండి, ముఖంపైనుండి చెమట నోట్లోకిజారి ఉప్పగాతగులుతుంది.... ఎడమచేత్తో ముఖాన్ని తుడుచుకున్నాడు... లాభంలేదు.... ఇంకా చెమట కారుతూనేవుంది.... ఎడమచేత్తో హాండిల్‌పట్టుకొని రిక్షా నడిపిస్తూ కుడిచేత్తో జేబులోవున్న దస్తీ బయటకుతీశాడు.. ముఖం తుడిచాడు.... దస్తీ చెమటకంపుతో వాసనొస్తుంది.... దస్తీ పిండితే కాస్తేంత తడిగావుంది... దాని శక్తిని మించి వాడడం జరిగింది.... రిక్షా తొక్కుతూనే కుడిచేత్తో పిండి ముఖంతుడిచాడు.... ముఖమంతా తడిగావుంది.... దస్తీ తిరిగి జేబులోపెట్టుకున్నాడు....పాంటుజేబు తడమి. అదితొడకు చల్లగాతగిలింది.. రిక్షా సాగిపోతూవుంది...

ఓసారో వ్యక్తి తాను రిక్షాలో బ్యాగు మర్చిపోయానని తనను పోలీసు స్టేషన్ కప్పగించి కొట్టించిన విషయం జ్ఞాపకమొచ్చి నిట్టూర్చాడు రతన్.... తన శరీరంలోని ఒక్కొక్క రక్తపుబొట్టును చెమటగామార్చిసంపాదించిన ఇరవై రూపాయలు ఎస్. ఐ. చేతిలో పెట్టి బయటకొచ్చాడు....

రిక్షాతొక్కుతూనే తన జీవితంలోని ఎన్నో సంఘటనలను మననం చేసుకుంటున్నాడు. రిక్షాలోవున్న దంపతులు ఏదో మాట్లాడుకుంటున్నారు. వారిద్దరి మధ్యవున్న బాబు రతన్‌నే చూస్తున్నాడు.... అతడాయాసపడుతూ రిక్షా నడపడం గమనిస్తున్నాడు... 'పాపం రిక్షా అబ్బాయి' అనుకున్నాడు.

రిక్షా మెల్లగా నడుస్తుంది—

"పోనియ్ తొందరగ పోనియ్.... గిట్ల నడిపిస్తే బాగనేసంపాయిత్తవు.." కసిరినట్టుగా అన్నాడు రిక్షాలోని పెద్దమనిషి.

ఓసారి వెనుకకు తలతిప్పి చూసి మౌనంగా రిక్షానడుపుతున్నాడురతన్.... "పాపం. రిక్షాబ్బాయికి చెమటలస్తున్నయి... ఏమినకు డాడీ...." ముద్దుముద్దుగా అన్నాడు బాబు.

"అన్నీ నీకేకావాలి... చప్పుడుజేకుండు..." కసురుకుందాబాబు తల్లి.... బాబు దిక్కోసారి కృతజ్ఞతాభావంతో చూసి తన పని కానిస్తున్నాడు రతన్.... అతికష్టంగా ఆయాసపడుతూ రిక్షాను గమ్యస్థానం చేర్చాడు. రిక్షాదిగి చెమట తుడుచుకుంటూ వేగంగా శ్వాసపదులుతున్నాడు రతన్... దంపతులు బాబు రిక్షాదిగారు... జేబులో చెయ్యిపెట్టి ఐదురూపాయలనోటు తీసాడతను. ఐదు రూపాయల నోటుచూసి

"చిల్లర లెవ్వుసార్" అన్నాడు రతన్....

"గిట్లనే సకురాల్జేత్తరు... ఉంచుకోని లెవ్వంటరు.... తియ్యితియ్యి...." అన్నాడతను.

"ఒక్క పైసగూడ లేదుసార్...." అని జేబుల్లో చేతులుబెట్టి ఖాళీ చేతులు పైకితీసాడు రతన్....

మాసిన గడ్డం, ఈడ్చుకుపోయిన ముఖం మాసికలుపడ్డ పాంటు షర్టుతో నిల్చున్న రతన్ చెమటలో స్నానంచేసినట్టుగా వున్నాడు...

"లోపలికిపోయి చిల్లర తీసుకొత్తుండు..." అని లోపలకుపోబోయాడావ్యక్తి.

"డాడీ! పాపం రిక్షాబ్బాయికి ఆకలేస్తున్నట్టుంది... బాగ చెమటలుకారుతున్నయి... బాగ కష్టపడ్డడు... ఐదురూపాయలియ్యి.... పాపం..." అన్న కుర్రాడి మాటలతో అలాగే ఆగిపోయాడు.

"వేలెడంతలేదు వీనికన్నీ కావాలి..." అంటూ ఆ బాబును చేయిపట్టుకొని లోపలకు తీసుకెళ్ళిందతని తల్లి...

లోపలికెళ్ళి కొంతసేపట్లో ఓ రెండురూపాయల నోటు, రూపాయినోటు, అర్ధరూపాయ చిల్లరతెచ్చి రతన్ చేతిలోపెట్టి వెళ్ళాడావ్యక్తి.

తన జీవితంలాగానే తన మురికిబట్టల్లాగానే నల్లగా మాసి మడతలుపడి జీర్ణావస్థలోవున్న నోట్లను భద్రంగా మలిచి జేబులోపెట్టుకున్నాడు రతన్....

కడుపు వెన్నుకంటుకుపోగా, కాళ్ళు గుంజుకుపోగా.... కడువలకొద్దీ ఘర్మ జలాన్ని ధారబోసి పనిచేసే రతన్‌లాంటివారి చెమట విలువ.... అలాంటివారి ఘర్మజలానికి... ఖరీదుకట్టే షరాబులెవరు...? రతన్‌కుమాత్రం ఎనిమిదేళ్ళ ఆ బాబులో ఆ షరాబు కనిపించాడు. ఆ బాబుతరంవాళ్ళైనా శ్రమజీవుల ఘర్మ జలానికి, ధర్మజలానికి నిజమైన ఖరీదుకట్టే షరాబులవుతారేమో....బాబురూపాన్నే మననంచేసుకుంటూ రిక్షాను వెనుకకు త్రిప్పాడు రతన్.... □






డా॥ జి. చలపతి

# పెద్ద చప్పలి శిలాశాసనం

ఈ శాసనం పెద్ద చప్పలి గ్రామసమీపంలోని వరి పొలంలో ఒక నల్లరాతి స్తంభం మీద రెండువైపులా చెక్కబడి వుంది. పెద్ద చెప్పలి కడప జిల్లాలోని కమలాపురం తాలూకాలోనిది. ఇది ఒక సంపూర్ణ శాసనం. లిపి అందంగా వుంది. క్రీ.శ. పన్రెండవ శతాబ్దానికి సంబంధించిన తెలుగు-కన్నడ లిపిలో వున్న ఈ శాసన భాష కన్నడం. శాసన కాలంనాటి లిపి సంప్రదాయానికి చెందిన అక్షర క్రమంతో అందంగా కనిపించే ఈ శాసనంలో లిపికి సంబంధించిన ప్రత్యేకతలేవీ లేవు, లేఖన పద్ధతిలో 'శ' ధ్వని 'స' ధ్వనిగా మార్పు చెందినట్లు కనిపిస్తుంది. శంభవే అన్న రూపం సంభవే అని, ఉత్తరేశ్వర అన్న రూపం ఉత్తరేస్వర అని వ్రాయబడ్డాయి.

ఈ శాసనం కల్యాణి చాళుక్యరాజైన భూలోకమల్లుని తొమ్మిదవ రాజ్య సంవత్సరంలో వేయబడింది. శాసనకర్త మూడవ తైలపుడు. భూలోకమల్లుని అసలు పేరు మూడవ సోమేశ్వరుడు. ఇతడు కల్యాణి రాజధానిగా పాలిస్తున్నప్పుడు మూడవ తైలపుడు యువరాజు. ఆంధ్రదేశం మీద పెత్తనం చెలాయించిన పశ్చిమ చాళుక్యుల పతనానంతరం ములికినాడు, సిందవాడి ప్రాంతాలు అంటే కడప కర్నూలు మండల ప్రాంతాలు, కల్యాణి చాళుక్యుల పలుకుబడిలోకి వచ్చాయి. ఈ ప్రాంతాలను పాలిస్తూ వుండిన తెలుగుచోడులు వీళ్ళకు సామంతులయ్యారు. మూడవ సోమేశ్వరుని కాలంలో ములికినాడు ప్రాంతాన్ని కల్యాణి చాళుక్య సామంతుడుగా త్రైలోక్యమల్ల మల్లిదేవుడు పాలించాడు. ఇతనికి మహామండలేశ్వరుడని బిరుదు గూడా వుండేది. 'త్రైలోక్యమల్ల' అనేది చాళుక్యవంశపు రాజులు ధరించే బిరుదు. ఇతడు వారి సామంతుడు గాబట్టి వాళ్ళను గౌరవించినట్లుండడానికి ఆ బిరుదును ధరించాడు. మూడవ సోమేశ్వరుడు క్రీ.శ. 1126లో సింహాసనమెక్కినట్లు చరిత్ర నిరూపించింది.[1] ఈ శాసనం అతని తొమ్మిదవ రాజ్య సంవత్సరంలో వేయబడింది గాబట్టి దానికి సరిపోయే క్రీ.శ. సంవత్సరం 1135. ఈ తొమ్మిదవ సంవత్సరానికి సరిగా ఆనంద సంవత్సరం, ఆ సంవత్సరంలో వచ్చిన సూర్యగ్రహణం శాసనంలో ఇవ్వబడ్డాయి. ఈ వివరాల ననుసరించి ఈ శాసనపు ఖచ్చితమైన తేది 16-1-1135 బుధవారం.

శాసనంలో 37 పంక్తులున్నాయి. 'నమస్తుంగ శిరశ్చుంబి...' అన్న ప్రార్థనా శ్లోకంతో ప్రారంభమయ్యే ఈ శాసనంలో పెద్ద చెప్పలిలోని ఉత్తరేశ్వర స్వామి దేవాలయానికి మూడవ తైలపుడు సమర్పించిన దాన వివరాలున్నాయి; ఉత్తరేశ్వరస్వామి పూజ, నైవేద్య, అఖండ దీపాలకుగాను ఒక చెఱువును, రెండు మరుతర్ల మాగాణి పొలాన్ని, ఒక తోటను సూర్యగ్రహణ సందర్భంగా సమర్పించడం ఈ శాసనంలోని విషయం. ఇతడు సింహాసనమెక్కక పూర్వమే అంటే యువరాజుగా ఉన్నప్పుడే చేసిన దానమిది. క్రీ.శ. 1130 నుండి గూడా ఇతనికి పరిపాలనతో సంబంధం వుంది[2]. ఇతని తండ్రి భూలోకమల్లుడు. ఇతనిని యువరాజుగా నియమించి కొన్ని ప్రాంతాలమీద పరిపాలన పర్యవేక్షణాధికారం ఇచ్చాడు. భూలోకమల్లుని ఏడవ రాజ్యసంవత్సరంలో (క్రీ.శ. 1133) వేయబడిన కరకంరపుర శాసనంలో[3] ఇతడు యువరాజుగా పేర్కొనబడినాడు. ఇతర శాసనాల్లో ఇతనికి 'నూర్మడితైల', 'త్రైలోక్యమల్ల', జగదేకమల్ల ఇత్యాది బిరుదులున్నాయి. ఈ శాసనంలో 'భుజబల వీరయువరాజ కుమార ఆహవమల్లదేవర' అని ఇతని ప్రశస్తి వుంది. 'ఆహవమల్ల అనేది ఈ శాసనంలో కనిపించే ఇతని మరొక బిరుదు.

మూడవ తైలపుని దానక్రమాన్ని వివరించే ఈ శాసనంలో రెండు ముఖ్యమైన విశేషాలున్నాయి. ఒకటి కల్యాణి చాళుక్యుల సామంతుడుగా వ్యవహరించిన త్రైలోక్యమల్ల మల్లిదేవుడనే తెలుగు చోళరాజుకు సంబంధించిన విషయం, రెండు శాసనం చివర్లో శాపోక్తికి సంబంధించిన గుర్తులు చెక్కి వుండటం. త్రైలోక్యమల్ల మల్లిదేవుడు 'తత్పాద పద్మోపజీవి'గా పేర్కొన బడినాడు. ఈ విశేషణం చాళుక్యులతో ఇతనికి గల సంబంధాన్ని తెలుపుతుంది. ఇతడు మూడవ



**శాసనం మొదటి ప్రక్క**



శాసనం రెండవ ప్రక్క

సోమేశ్వరుని కాలంలో ములికినాడును పాలిస్తూ వుండినట్లు తెలుస్తుంది. చిలమకూరు శాసనం ద్వారా[4] ఇతడు ములికినాడు నుండి సిందవాడికి పరిపాలనా ప్రతినిధిగా మార్చబడినట్లు కనిపిస్తుంది. క్రీ.శ. 1133లో భూలోకమల్లుని సామంతుడుగా సిందవాడిని పరిపాలిస్తున్నట్లు పెద్ద తంబుళం శాసనం[5] చెబుతూ వుంది. ఈ సందర్భంలో పెద్దతంబుళంలోని పంచలింగదేవునికి ఇతడు కానుకలు గూడ సమర్పించాడు. కర్నూలుజిల్లా ఆలూరు తాలూకాలో దొరికిన రామదుర్గ శాసన[6] విషయాన్ని బట్టి సిందవాడి ప్రాంతాన్ని ఇరుంగోళ చోళమహారాజు కల్యాణి చాళుక్యుల సామంతుడుగా పరిపాలించినట్లు విశదమౌతుంది. ప్రస్తుత శాసనం ప్రకారం క్రీ.శ. 1135లో త్రైలోక్యమల్ల మల్లిదేవుడు మళ్ళీ ములికినాటి అధికారాన్ని పొంది భూలోకమల్లుని చివరి రాజ్య సంవత్సరం వరకు (క్రీ.శ. 1138) కొనసాగినాడు. పుష్పగిరి శాసనం[7] ప్రకారం క్రీ.శ. 1139 వరకు అంటే రెండవ జగదేకమల్లుని రెండవ రాజ్యసంవత్సరం వరకు ఇతడు ములికినాడు ప్రాంతాన్నే పాలించినట్లు కనిపిస్తూంది, అంటే ఇతడు భూలోకమల్ల, జగదేకమల్లుల అధికారానికి లోబడి వుండినట్లు స్పష్టం. పై విషయాలనుబట్టి చక్రవర్తి తన సామంతులను తన ఇష్టానుసారం ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి పరిపాలనా సౌకర్యార్థం మారుస్తూ వుండేవాడని అర్థమౌతుంది. ఇది నేటి ప్రభుత్వ విధానంతో సరిపోతుంది.

ఈ రాజశాసనంలో దేవునికి దానం చేయబడిన చెరువు, భూమి, తోటలు పాశుపతాచార్యుడైన అగస్తిరావుళ పండితునికి చెప్పలి గ్రామంలోని వేయిమంది మహాజనుల సమక్షంలో సమర్పించబడ్డాయి. ఈ అగస్తిరావుళ పండితుడు ఆ వూరిలోని మఠాచార్యుడై వుండవచ్చు.

శాసనం చివర్లో శాసనాన్ని చెరపకుండా వుండేందుకు, భయభక్తులతో కాపాడేందుకు శాసనరచయిత కొన్ని శాపోక్తులను చేరుస్తుంటాడు ఈ శాసనంలో చెరిపినవాడు వారణాసి కురుక్షేత్రాది తీర్థాలలో వేయి గోవులను చంపిన పాపం పొందుతాడన్న వాక్యాలు వున్నాయి. అంతేగాకుండా ఈ భావాన్ని సూచించే బొమ్మ కూడా శాసనం చివర చెక్కి ఉండటం ముఖ్యమైన విశేషం. ఒక అవు, ప్రక్కనే పాలు త్రాగుతూ వున్న దూడ, అవు వెనుక ఒక ఖడ్గం బొమ్మలు శాసన ప్రతిబింబాన్ని పరిశీలిస్తే చివర్లో స్పష్టంగా కనిపిస్తాయి. శాసనాన్ని చెరిపినవాడు ఈ కనిపించే ఖడ్గంతో దూడకు పాలిస్తూన్న ఆవును గంగాతీరాన చంపిన పాపం పొందుతాడన్నది ఈ బొమ్మద్వారా మన కర్థమౌతుంది.

## శాసనపాఠం

### మొదటిప్రక్క

1 నమస్తుంగ శిరశ్చుంబి చంద్ర చామ
2 ర చారవే తు[8] త్రైలోక్య నగరారంభ
3 మూల స్తంభాయ సం (శం) భవే॥ స్వస్తిస [మ*]
4 స్త భువనాశ్రయ శ్రీ ప్రిథి (థ్వీ) వల్లభ
5 మహారాజాధిరాజ పరమేశ్వర పరమ
6 బ (భ) ట్టారకం సత్యాశ్రయ కుళ తిలకం
7 చాళుక్యాభరణం శ్రీమత్సర్వ్వ [భువ*] నై [క*] చ
8 క్రవర్త్తి భూలోక మల్లదేవరు విజయ
9 రాజ్య ముత్తరోత్తరాభి వ్రిద్ధి ప్రవర్ద్ధ మా
10 న మాచంద్రార్క్క తారంబరం కల్యాణ
11 ద నెలవీడినొళ్ సుఖ సంకతా (థా) వినోద
12 దిం రాజ్యం గయ్యుత్త మిరె తతుపాద[9] పద్మో
13 ప జీవిగళప్ప సమస్త ప్రస (శ) స్తి సహి
14 తం శ్రీమన్మహా మండలేశ్వరం త్రైళో
15 క్య మల్ల మల్లిదేవ మహారాజరు ము
16 ళ్కి ముం నూఱఱ రాజధాని వల్లూర పట్టణదలు
17 సుఖ సంకతా (థా) వినోదదిం రాజ్యం గెయ్యుత్త
18 విరలు భుజబళ వీరయువరాజ కుమా
19 ర ఆహ్వ (హవ) మల్లదేవరు చెప్పళి యల్లిద్దున్ అ
20 ల్లియ యుత్త రేస్వ (శ్వ)ర దేవర్గ్గె నైవేద్య పూజ పు
21 నస్కార దీపం సహితం నడెయిసు వంతాగి
22 చాళుక్య భూలోకమల్ల కాలద 9 నెయ ఆ
23 నంద సంవత్సర సూర్య్య గ్రహణ నిమిత్త
24 వాగి పాస్ప (శుప) తా చార్య్య అగస్తిరావుళ పండిత
25 ర్గ్గె దేవర యుత్తర భాగద కెఱియుం ఇమ్మ
26 త్తరు కెయ్యుం తోంటముం ధారా పూ
27 ర్వకం మాడి చెప్పళిగెయ సాసి

### రెండవప్రక్క

28 ర్వ [ర*] మహాజన ప్రముఖ వాగి కొ
29 ట్టరు [11*] మాచయ అత్యంణ నె
30 త్తి సిద దేవాలయం [11*] ఇదత్తియం
31 నారో ర్వ్వరు కెడిసిదవరు వారణా
32 సి కురుక్షేత్ర గంగెయలుం సాసి
33 ర కవిలెయ నళిద పాతక ముక్కుం [11*]
34 స్వ దత్తం పరదత్తం వాయోహ
35 రేతి వసుంధరా [1*] షష్టి వ్వర్ష
36 సహ్రసాణి విష్టాయం జయ
37 తే క్రిమి [11*]

**సూచికలు :**

1 హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా - నీలకంఠశాస్త్రి పుట 206
2 మైనర్ డైనాస్టీస్ ఆఫ్ సౌత్ ఇండియా - బి.ఆర్.గోపాల్. పుట 42
3 ద.హి.శా. 9. (1) 226
4 -అదే- 227
5 -అదే- 228
6 -అదే- 230
7 -అదే- 233
8 'తు' అవసరం లేదు.
9 తత్పాద అని చదువుకోవాలి.
10 ఈ శాసనపాఠం తయారు చేయడంలో ఎంతగానో సహాయపడిన డా॥ శివలంక శ్రీరామచంద్రమూర్తి, (రీడర్ ఇన్ ఎపిగ్రఫీ. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం) గారికి కృతజ్ఞతలు —రచయిత

శ్రీ

# దేవీస్తవం

1. సర్వము నీ వే యయ్యును
సర్వస్వము కుక్షి యందు సాకల్యముగా
పర్యాలిడ దాచి యుంచిన
సర్వాంతర్యామి! శుద్ధ చైతన్య ధునీ!

అచైతన్యం దర్శించడానికి విజ్ఞాని పడుతూన్న పాట్లు.

2. రోదసి గహ్వర రోదిస్సు గుర్తించు
అరుదైన పదునైన పరికరములు
దృగ్గోచరము కాని తీక్ష్ణ తరంగాల
పరికింపగల సూక్ష్మ పరికరములు.
సృష్ట్యాది జన్మించి క్షీణింపకున్నట్టి
పరమశక్తి గ్రహించు పరికరములు
ఖండ ఖండాలుగా కాలాన్ని విభజించి
పసిగట్టగల రమ్య పరికరములు
లెక్క లేనన్ని నిర్మించి రేబవళ్ళు
పంచభూతాల రచన శోధించువారు
అణువణువునందు వ్యాపించి అలరునట్టి
చిద్ఘనానంద మెట్లు దర్శించగలరు!

3. అణువుతో విక్షిప్తమై నేలు కొల్పిన
సంహార మొనరించు శక్తి నీవు
లెక్కకు మారిన రిక్కల గుంపుల
సరళముగా త్రిప్పు శక్తి నీవు
రవిచుట్టు గ్రహములు భ్రమణం బొనర్పగా
శాసించి పాలించు శక్తి నీవు
వేగతమంబైన విద్యుత్తరంగాల
సర్వదా వెదజల్లు శక్తి నీవు
అణువు నందున పరమాణుకణములందు,
రప్పలందున, వృక్షపత్రముల యందు,
కీటకము పుల్గు మృగ జంతుకోటియందు
మానవుని యందు నీశక్తి మనుట నిజము!

4. శక్తి మంతమైన శతయంత్రరాజితో
మట్టితునుక పగుల గొట్టినారు
కొట్టుచున్న కొలది కోకొల్ల లుగపుట్టె
సూక్ష్మ కణ చయమ్ము చోద్యమొదవ.

5. విశ్వనిర్మాణమందు ఆవిశ్వకర్మ
ఇటుక లెట్టి వి వాడెనో యెరుగనెంచి
చేసిన ప్రయత్నములలోన జీవరహిత
ద్రవ్య కణముల నాట్యమే దర్శనమిడె!

6. పరమాణువు పరమాణువు
కరములు చేకొనగ అణువు కలిగెడుత్పటిలో
వరలు రసాయన శక్తిగ
విరతము దీపించు చుండ నేర్తువు జననీ!

7. ఎండు కర్రలు రాపాడుచుండ పుట్టి
ప్రజ్వలించెడు అగ్ని ఘర్షణముకాదె
కర్రరాపిడి మాత్రాన కాలదలదె?
ఘర్షణపు శక్తివై కట్టె కాల్చె దీవు.

8. పూవుల రేకులం జిదిపి పుప్పొడి యంత్రములోన జూచి,ఆ
పూవెటు పూయునో తెలియబూనెడు వాడు మహాబలియడె
వి విభవంబు కన్గొనగ నిలగునమ్మ? సుమంబుముక్కలై
పోవు టెకాని జావకవి భూతి రవంత గ్రహింప నేర్పునే?

9. ముత్రిరెట్టు ప్రదర్శించు మహిమచూడ
విత్తుకే త్రానసాటి, అవిర్భవించు
వృక్షగతి చూడవలె గాని, విత్తుచిదిపి
యంత్రమున చూడగోచరమౌనె మహిమ!

10. భూత పంచకమందొక్క భూతమైన
సాహసించి విజృంభించసాగునేని
దాని వరికట్టగల శక్తి మానవాళి
కున్నదా? దేవి? నీ రక్ష యుండకున్న!

11. భూప్రకంపములతో భూతలం బ్రద్దలై
ఘోర శిలాద్రవం పారునపుడు
ప్రళయ ఘోషలతోడ ప్రభవించి మిన్నంటు
తంగము లందగ్ని ప్రజ్వలునపుడు
అహోవర్ష శోభతో భయదుగ్రజవముతో
అగ్ని కీలలు నభమంటునపుడు
ఝుం ఝూం వినో ద్భూత ఝూంకారవమ్ముతో
పెనుగాలి రయ్యన వీచునపుడు,

జాతితీవ్రత నుండి కాపాడు కొనుట
కింత వరకును మనిషి నిర్మించినట్టి
యంత్రతతియెల్ల నిష్ప్రయోజనములయ్యె
అమ్మ! జగదంబ! నీ కటాక్షమ్ము లేక!

12. ప్రకృతి పరిశోధనమున నీ ప్రకృతియెట్లు
బోధపడునమ్మ? ఎంతటిబుద్ధికైన?
ప్రకృతిలో నిన్ను చూపు యంత్రములు లేవు
పరమమౌ శక్తి యంత్రగోచరముకాదు.

13. లో నున్న నిన్ను చూడగ
మానస మను దర్పణమ్ము మలినరహితమై
జానుగ నుండిన చాలును,
ధ్యానింపత్వదీయ దివ్యదర్శనము బ్బున్

14 మానవాతీతుడై మహాజ్ఞాని వరకు
పెరగ వలసిన మనిషి నిర్వీర్యుడగుచు,
కామలోభాల జిక్కి నిహాకారణముగ
పతన మగుచుండె, వాని కాపాడు మమ్మ

శ్రీ వసంతరావు వేంకటరావు

# కలగూరగంప

## కమ్యూనిజానికీ, ఫాసిజానికి గల సంబంధం.

కమ్యూనిస్టు తిట్లల్లో ఫాసిస్టు అనేది తీవ్రపుతిట్టుగా కమ్యూనిస్టులు భావిస్తారు. కాని కమ్యూనిజానికీ, ఫాసిజానికీ చాలా పోలికలు ఉన్నాయి.

హిట్లరు, ముస్సొలీనిల సిద్ధాంతమే ఫాసిజం. హిట్లరు నాయకత్వం వహించిన ఫాసిస్టు పార్టీ పేరు నేషనల్ సోషలిస్టుపార్టీ (సంగ్రహ పరచగా నాట్సీపార్టీ అయింది) ముసులోని నాయకత్వం వహించిన పార్టీపేరు ఫాసిస్టుపార్టీ ఈ రెండూ ఒకే ఒక సిద్ధాంతాని ప్రతిపాదిస్తాయి. హిట్లరు జర్మనీ పరిపాలకుడయ్యి 1933 దగ్గరనుంచి 1945 దాక ఫాసిజాన్ని అమలు పరిచాడు. అల్లాగే ముస్సొలోని ఇటలీ పరిపాలకుడై. 1945 దాక ఫాసిజాన్ని అమలు పరిచాడు! ఫాసిస్టు రాజ్యాంగానికి మూలసూత్రాలు ఏమిటంటే.

1) ఫాసిస్టు ప్రభుత్వము నిరంకుశము. ప్రజాస్వామ్య ప్రభుత్వంలోలాగా వాక్కు, రచన, సభా వార్తాపత్రికల స్వాతంత్ర్యం ఉండదు. వార్తా పత్రికలు ప్రభుత్వము ఏదిచెపితే అది రాయాలి. కమ్యూనిజానికి ఫాసిజానికి, ప్రభుత్వ నిరంకుశవిధానం సమానము. దీనిని వీరుచెప్పే సిద్ధాంతాలు భిన్నంగా ఉంటయ్యి, కమ్యూనిస్టులు శ్రామిక నియంతృత్వ విధానాన్ని అమలుజరపుతున్నామని చెప్పుతారు. ఫాసిస్టులు, భిన్న భిన్న వ్యక్తుల అభిప్రాయాలు, జాతి అభిప్రాయానికి లొంగి ఉండాలి (అంటే ప్రభుత్వ అభిప్రాయానికి లొంగిఉండాలి అంటారు.) కాని చివరకు నిరంకుశ ప్రభుత్వాన్నే కమ్యూనిస్టులు, ఫాసిస్టులుకూడా బలపరుస్తారు.

2) కమ్యూనిస్టులు' పెట్టుబడిదారి సమాజంలో కార్మికుల హక్కులను సమర్థిస్తారు. కాని కమ్యూనిస్టువిప్లవం వచ్చాక, హెచ్చు ఉత్పత్తి కొరకు పాటుపడాలని మాత్రమే చెప్పుతారు. కార్మికులు హక్కులకోసం నోరుమెదపరు. అల్లాగే ఫాసిస్టులుకూడా పెట్టుబడి దారీ సమాజంలో కార్మికులను సమర్థించి ఫాసిస్టు ప్రభుత్వమువచ్చాక, ఆ ప్రభుత్వము చెప్పినట్లు వినాలని కార్మికులను కోరతారు.

3) కాని ఆర్థిక విషయాల్లో మాత్రం కమ్యూనిస్టులకూ ఫాసిస్టులకు మధ్య తేడా ఉంది. కమ్యూనిస్టులు, పెట్టుబడి తత్వాన్ని సమూలంగా నిర్మూలనచేసి ప్రభుత్వమే అన్ని పరిశ్రమలను చేపట్టాలంటారు. కాని ఫాసిస్టులు పెట్టుబడిదారులను ఒప్పుకొంటారు పెట్టుబడిదారులకు, కార్మికులకూ మధ్య, ఒకరినొకరు మోసం చేయకుండా ప్రభుత్వం జాగ్రత్తగా చూస్తుందనీ ఫాసిస్టులు చెపుతారు.

4) కమ్యూనిస్టులూ ఫాసిస్టులుకూడా, యుద్ధానికి కాలు దువ్వుతారు. కమ్యూనిస్టు పీడిత ప్రజలను రక్షిస్తాము అంటూ, స్వతంత్ర్య రాజ్యాలుమీద యుద్ధానికి ఆయత్త పడితే. (ఉదాహరణకు ఆఫ్‌గనిస్థాన్) ఫాసిస్టులు యుద్ధము పురుషుల కర్తవ్యము అంటూ బోధచేస్తారు. కమ్యూనిస్టు రాజ్యాలూ, ఫాసిస్టు రాజ్యాలుకూడా తమ సరిహద్దులను దాటటం కోసము యుద్ధమును ఆమోదిస్తారు.

1919లో ప్రథమ ప్రపంచ సంగ్రామము ఆఖరు అయిన తర్వాత, యూరపు రాజ్యాలల్లో ద్రవ్యోల్బణము, నిరుద్యోగము పెచ్చుపెరుగి, అనేక విప్లవాలు జరిగయ్యి. ట్రాట్‌స్కీ, లెనిన్, స్టాలిన్ మార్క్సు సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికి రష్యాలో విప్లవము లేవదీస్తే, ఇటలీలోనూ, జర్మనీలోనూ పెరిగిపోతున్న కమ్యూనిస్టుపార్టీ ప్రభావాన్ని అరికట్టటానికి, ముసోలినీ, హిట్లరు నాయకత్వంలో ఫాసిస్టు పార్టీలు తల యెత్తయ్యి. ఇటలీ నియంత ముసోలిని ప్రారంభంలో సోషలిస్టు మార్క్సు గ్రంథాలను ఆ మూలాగ్రంగా చదివాడు. అటుతర్వాత అతడు ఫాసిస్టు పార్టీని స్థాపించాడు. హిట్లరు ఆస్ట్రియా పౌరుడు. 24 ఏళ్ళ వయస్సులోనే జర్మనీలో ఉన్న మ్యూనిచ్ పట్టణానికి వచ్చేశాడు. అతని ఉద్దేశ్యం చిత్రకళను నేర్చుకుందామని. చిత్రకళను అభ్యసించటం అయ్యాక తీరుబడి సమయాల్లో హిట్లరు పుస్తకాలు తెగచదివేవాడు. అందులో ముఖ్యంగా కారల్ మార్క్సుపుస్తకాలను చదివేవాడు. అతను పాప్ దంపతులున్న యింట్లో ఉండేవాడు. 1914 లో ప్రథమ ప్రపంచయుద్ధం మొదలైంది. హిట్లర్ జర్మను సైన్యంలో చేరాడు, అంతటితో అతని గ్రంథపఠన తాత్కాలికంగా ఆపు అయింది. అటుతర్వాత, అతను యుద్ధం నుంచి వచ్చి, నేషనల్ సోషలిస్టుపార్టీ (నాట్సీపార్టీ) ని స్థాపించాడు. ఆ సందర్భంలో అతను ఒక విప్లవాన్ని నడిపాడు, అప్పుడు 1924 లో జర్మనీదేశ ప్రభుత్వము అతన్ని కారాగారములో ఉంచింది, కారాగారంలో మళ్ళీ కారల్ మార్క్సు గ్రంథాలను చదవటం మొదలు పెట్టాడు. ఒకప్పుడు అతను అన్నాడుగదా, "కారాగారమే నాకు విశ్వవిద్యాలయం అయింది" అన్నాడు. అతని పుస్తకం "నా పోరాటం" అన్నది కూడా కారాగారంలో జర్మనీ భాషలో వ్రాశాడు—

హిట్లర్‌కి జర్మన్ జాతిమీద వల్ల మాలిన అభిమానం ఉండేది జర్మన్ జాతి అత్యుత్తమజాతి అనీ, ఆ జాతిలో ఆర్యజాతికి చెందిన అత్యుత్తమ లక్షణాలు ఉన్నయ్యనీ అతను భావించేవాడు. రష్యా, పోలండ్, రుమేనియా మొదల్గుగా గల దేశాలు స్లావ్‌జాతికి చెందినవి. స్లావ్‌జాతి అంటే హిట్లరుకు చులకన భావం ఉండేది రష్యన్లుస్లావ్ జాతికి చెందినవారనీ, వారికమ్యూనిజంగూడా సమర్థతలేకుండా, బలహీనంగా ఉంటుందనీ, జర్మనులు తలపెట్టిన ఏ ఉద్యమమైనా స్లావ్‌జాతి ఉద్యమాల కంటె ఎక్కువ సమర్థతతో ఉంటుందని తలపోసేవాడు, నిజానికి కమ్యూనిజమంటే అతని భావన ఆ ఉద్యమం మెతకగా, అసమర్థమైనదనీ, జర్మనీ జాతి అయితే, ఆ కమ్యూనిజం తీవ్రంగా అమలుపరుస్తుందనీ అతని ఉద్దేశ్యం.

హెర్మన్ రాష్నింగ్ జర్మనీదేశస్థుడు. హిట్లర్ సమకాలికుడు. మొదట్లో నాట్సీ అభిమాని. తరవాత నాట్సీజం కమ్యూనిజంకంటే తీవ్రతరమైనది, ఎక్కువ ఉపద్రవకరమైనదీ అని భావించి, 1936 లో జర్మనీని వదలిపెట్టి అమెరికా వలస వెళ్ళాడు. అతను "హిట్లర్ చెప్పేది" లో హిట్లరుని భయంకరంగా వర్ణించి, హిట్లర్ సిద్ధాంతాలు కమ్యూనిజంకంటే తీవ్రమైనవని, కమ్యూనిజం కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడివుంటే, నాట్సీజం ఇంకా ఎక్కువ విశృంఖలంగా ఆచరణే ప్రధానంగా ఉండే సిద్ధాంతమనీ, చెప్పాడు. హిట్లరు రాష్నింగ్‌తో అన్నాడుగదా, "గ్రంథకర్తలు పుస్తకాలు రాస్తారు. కాని నాట్సీ పార్టీకి చెందినవాళ్ళు. ఆ పుస్తకాలలో ఉండే వాటిని తీవ్రంగా అమలు జరుపుతారు. అవి పుస్తకాలల్లో ఉందోలేదో అని వాళ్ళు చూడరు. అందువల్ల కమ్యూనిస్టులు ఉత్తమ నాట్సీ సభ్యులుగా రూపొందుతారు. "హిట్లర్ అతనితో" నేను మ్యూనిచ్‌లో ఉన్నప్పుడు, కమ్యూనిస్టులను అంటరాని వాళ్ళనుగా పరిగణించలేదు. నాదగ్గరకు కమ్యూనిస్టులు వచ్చేవారు" నిజానికి హిట్లర్ 1934 అతనితో చెప్పాడు "జర్మనీ, రష్యాలు ఒకదానికొకటి పరస్పరం ఇచ్చి పుచ్చుకొనే స్థితిలో ఉంటయ్యి. కమ్యూనిజం ఒకరకమైన నాట్సీజం కింద అభివృద్ధి చెందుతుంది. ఎందుకంటే, కమ్యూనిజానికీ నాట్సీజానికి పోలికలే ఎక్కువ భేదాలకంటే" (ఇది 1942లో హిట్లర్ అమలు జరిపాడు, రష్యా జర్మనీ సంధి చెయ్యడం ద్వారా) హిట్లరు పదే పదే చెప్పుతూ ఉండేవాడు "సోషలిస్టులకంటే. కమ్యూనిస్టులే నాట్సీపార్టీకి తగినవాళ్ళు" హెర్మన్ రాష్నింగ్ వ్రాసిన "హిట్లర్

చెప్పేవి" అనే గ్రంథం, సాధారణంగా అనుకున్నట్లు నాజీజం ఒక జర్మన్ జాతీయ ఉద్యమంగాకాక, కమ్యూనిజంలో దానివేళ్ళు ఉన్నయ్యని అని చెప్పింది.

హిట్లర్ మంత్రివర్గ సభ్యుడు ఆల్బర్ట్ స్పీర్ అన్నట్టుగా హిట్లర్ దేన్నయితే రహస్యంగా అసూయపడలాడో పైకి అంతగా ద్వేషించేవాడు. అతను యూదుల్ని స్టాలిన్నూ, కమ్యూనిస్టులను రహస్యంగా అసూయపడి పైకి అంత ద్వేషించేవాడు. హిట్లర్ అనుచరుడు భావి జర్మను ప్రచారశాఖ మంత్రి, గోబెల్స్ 1920 లో వ్రాస్తూ "ప్రతిమంచి నాజీపార్టీ సభ్యుడూ, రష్యాని గౌరవభావంతో చూస్తాడు. ఎందుకంటే, పాశ్చాత్యుల అవినీతిని బట్టబయలు చేసిన రష్యా జర్మనీకి తగిన స్నేహితుడు. ఏ రష్యను చక్రవర్తి రష్యా ప్రజల్ని లెనిన్ అర్థం చేసుకున్నట్లుగా చేసుకోలేదు లెనిన్ పేదరైతులకు భూమినిచ్చి, స్వేచ్ఛనిచ్చాడు."

ఏతా వాతా తేలిందేమిటంటే నిరంకుశ కమ్యూనిజాన్ని దెబ్బ తియ్యాలి అంటే కమ్యూనిస్టు నిరంకుశత్వాన్ని ఇంకొక తరగతి నిరంకుశత్వంతో ఎదుర్కోవాలని హిట్లర్ అనుకున్నాడేమో!

శ్రీ. ఎమ్. రామకృష్ణ

# మినీ కవిత

"మినీ కవిత్వానికి సైజు ప్రధానంకాదని మినీ కవితాభిమానులు బుకాయిస్తున్నా దానికి పట్టేలక్షణం 'సైజు మాత్రమే' అని," కవిత్వం ఏసైజులో ఉన్నా కవిత్వమే గాని శ్రీ చేకూరి రామారావుగారు వ్రాసినమాటలు (కవిత్వమూ పరిమితీ ఫిబ్రవరి 1985 'భారతి') సత్యసమన్వితాలు. ధ్వని, చమత్కారం, విశేషోక్తిక వంటివి మినీ కవిత్వానికి మాత్రమే పరిమితం కాదని, అవి ఆ కవిత్వ ప్రత్యేక లక్షణాలు కావని వారు చక్కగా నిరూపించారు.

ఛందస్సులను, యతిప్రాసలను, వ్యాకరణ కార్యాలను కాలదన్ని, పంజరంలో నుండి బయట పడిన గువ్వలా కవిత్వం ఏ బంధానికీ లొంగకుండా స్వేచ్ఛగా సాగిపోవాలనే తపనతో కవిత్వాన్ని సృష్టిస్తున్న ఈనాటి కవులు మళ్ళీ దానికి మినీకవిత అని, నానీకవిత అని పేర్లుపెట్టి వాటిని లక్షణాల పంజరాల బంధించ బూనటం సమర్థనీయమా? ఆ లక్షణాల గూర్చి చర్చోపచర్చలు జరపటం సమంజసమేనా? ప్రాచీన సాహిత్యానికి లక్షణ గ్రంథాలను రచించిన అనేకులు తాము చెప్పిన లక్షణాలనే కొన్నిటిని తమ గ్రంథాలలో పాటించలేక పోయారు. అలాగే మినీకవితలకు లక్షణాలను నిర్దేశించిన వారే ఆ లక్షణాల నన్నిటిని పూర్తిగా తమ కవితలో చూపలేకపోవటాన్ని నేనిదివరకే "భారతి" పాఠకులకు చూపించినాను. ('భారతి' మార్చి 1982) ఇక ఈ లక్షణ చర్చలు దేనికి? వీటి ప్రయోజన మేమిటి? వీటికన్న మినీకవిత ఇంతవరకు సాధించిన, ఇకముందు సాధించవలసిన ప్రయోజనములను గూర్చిన చర్చలు ఆహ్వానించదగినవి, అవశ్యకమైనవి.

పురాణాలు పంచలక్షణాలతో ఉండాలని, ఇతిహాసాలు ప్రసిద్ధ రాజవంశ కథాన్వితాలుగా ఉండాలని, ప్రబంధాలు అష్టాదశవర్ణనాదులుండాలని ఇటువంటి కొన్ని నియమములు ప్రాచీన సాహిత్య విభాగములకు ఉన్నట్లుగానే ఆధునిక కవిత్వానికి కూడా సామాజికస్పృహ, ప్రగతిశీలత, దోపిడీ వర్గంపై తిరుగుబాటు వంటి కొన్నిలక్షణాలు నిర్దేశించ బడ్డాయి ఇవి ప్రధానంగా కవితావస్తువుకు సంబంధించినవి రచనావిధానానికి సంబంధించినవికావు.

ఆధునిక కవులు అక్షరఛందస్సులోకన్న మాత్రాఛందస్సులోనూ, దానికన్న వచనంలోను కవిత్వాన్ని రచించటానికి ఎక్కువగా ఆసక్తి చూపుతున్నారు. కవిత్వము ఏరూపంలో ఉన్నా కవిత్వమే అది ఏ ప్రయోజనాన్ని సాధించాలన్నా సుబోధకమై, సుస్పష్టమై పాఠకుడిని ఆకర్షించకో గలిగి ఉండాలి కథాప్రధాన రచనలలో కవిత్వం సాధించగలిగే ప్రయోజనం అల్పం. అందులోని ప్రతిపదం పాఠకుడిని కదిలించవలసినవసరంలేదు కాని ప్రగతిశీలక, సమాజ విశ్లేషణాత్మక కవిత పాఠకునికి సద్యఃస్ఫూర్తిని కలిగించ గలిగేలా అతనిని ప్రభావితం చేయ గలిగేదిగా ఉండాలి. స్తబ్దంగా ఉన్నమానస సరస్సులలో ఆలోచనా తరంగాలు లేపగలిగేదిలా ఉండాలి. నీరసహృదయాలలో అనుభూతి రసాన్ని నింపగలిగేదిగా ఉండాలి. దీనిని సాధించటానికి ముందుగా ఆ కవిత పాఠకునికి అర్థమయేటిగా ఉండాలి.

శ్రీకృష్ణదేవరాయలు అంతంత మాత్రపు పాఠకులకు నోరుతిరక్కుండా ఒక్క సమాసంగా వ్రాసిన 'కాంకాన్‌పైన్నవుడు... పటత్కాజమున్' అనేపద్యాన్ని సాధారణ పాఠకుడు పూర్తిగా అర్థంచేసుకోలేకపోయినా 'వైష్ణవుడు ఒక మల్లె చెట్టును చూచాడు' అనే ఆ పద్యభావాన్ని అతడు గ్రహించటానికి శ్రమించనక్కర లేదు కాని అన్నిపదాలు అర్థమవుతూ, భావం అర్థంకాని కవితలెన్నో ఈనాడు మనకు కనిపిస్తున్నాయి. మతవిషయాలతో, శాస్త్రమర్యాదలతో, శబ్దశ్లేషలతో వ్యాఖ్యానం లేకుండా అర్థంకాని ప్రాచీనకవిత్వానికి; చమత్కారమని, ధ్వని అని, లోతైనభావాలని, చెపుతూ పత్రికలతో పరభాషా పదబాహుళ్యంతో సాధారణ పాఠకు ని (భారతివంటి సాహిత్య పత్రికలను క్రమంతప్పకుండా చదివేవ్యక్తి) అర్థంకాకుండా వస్తున్న ఈనాటి కవిత్వానికి తేడాఏమిటి? కవిత్వాన్ని అభిమానించే సాధారణ పాఠకునికి ప్రాచీన, ఆధునిక కవిత్వాలలో రెంటిలోనూ అర్థం అయ్యేవీ కానివీ ఉంటుంటాయి. కవిత్వాన్ని అర్థంచేసుకోవటానికి పాఠకునికి ఒకస్థాయి అవసరమనే మాట, కవిత్వం సాపేక్షకమని చదివేవారి స్థాయినిబట్టి అది అర్థమౌతుందనే మాట సత్యమైనదే. అందుకనే ప్రాచీన కవిత్వం చదవాలనే తపన ఉన్నవారు ఛందోవ్యాకరణనిఘంటువుజ్ఞానాన్ని సంపాదించు కొనటం అవసరమయింది అజ్ఞానాన్ని పోగొట్టే ఆ కవిత్వాన్ని చదివేవారు పరిమితసంఖ్యలోనే ఉంటున్నారు ఛందోవ్యాకరణాది బంధాలను తెంచుకొన్న ఆధునిక కవిత్వంకూడా పరిమితసంఖ్యలోనే పాఠకులను ఆకర్షించుకో గలగటం విచారకరమైన విషయం. దీనికి ముఖ్యకారణం ఈనాడు వెలువడే కవిత్వం సాధారణ పాఠకుడు అర్థంచేసుకోగలిగేస్థాయిని మించి ఉండటం.

"భారతి" లోనే ఒక ఆరునెలల కాలంలో సాధారణ పాఠకునికి అర్థంకాని కవితలు సుమారు 62 శాతం ప్రచురించబడ్డాయని ఇదివరకు పరిశీలనలు చూపించారు. ('భారతి' నవంబరు 80). ఇంత అధికశాతం కవితలు అర్థంకాకటం లేదని చెపుతున్నప్పుడు వాటిని అర్థమయేలా పాఠకులకు వివరించే ప్రయత్నాలు తగినంతగా జరగకపోవటం నిరాశను కలిగిస్తున్నది. ఈనాటి కొన్ని మినీకవితలు కూడా ఈ అర్థంకాని కవితల జాబితాలో చేరటం నిజంగా దురదృష్టకరం. ఉదాహరణకు తిరుమలరావుగారు రచించిన,

ఆకాశం
ముక్కలు రవికెను చించి
వెన్నెల బాహువుక్క
చంద్రుణ్ణిపికి
నీలం లంగా
నలుపోణీ లాగిపారేస్తేగాని
రేపుకాదు.

కవితను 'భారతి' పాఠకులు ఎలా అర్థముచేసికొన్నారో గమనిద్దాం.

శ్రీ జింబోగారు (భారతి సెప్టెంబరు 80) "ఒకరేప్ దృశ్యాన్ని నేపథ్యంలో నడిపిస్తున్నట్లు, రాత్రిపోయి తప్పక ఉదయం వస్తుందన్నట్లు ఒకే కాలంలో పరిత రెండువిషయాలు అర్థంచేసుకుంటాడు" అంటారు. ఈ రెండువిషయాలకు గల పరస్పర సంబంధాన్ని చర్చిస్తూ శ్రీ షమాగారు (భారతి జనవరి 81) "రేపు (చీకట్లోంచి వెలుగులోకి వెళ్తున్నాం గనుక, చీకట్లు తొలగి సూర్యుడుదయిస్తాడు గనుక( ఆశని రగిలించే భవిష్యత్తు యొక్క బంగారు బాటని సూచించేమాట అది ఆహ్వానించదగ్గ పరిణామం. మరి 'రేప్' కూడా అంతేనా? కాదుగదా' మరి యిక్కడీ మినీకవి యేంచెప్పాలనుకున్నాడో యేం చేప్పేటో పాఠకుడికి యేం తెల్సింది? రేపు రేప్‌లాగా అసహ్యకరవిషయమనా? లేక రేప్ రేపులాగా ఆహ్వానించ

దగ్గ పరిణామమనా? యెలా అర్థంచేసుకోవాలిదీన్ని." అనే సందిగ్ధంలో పడ్డారు.

శ్రీ చేకూరి రామారావుగారు (భారతి ఫిబ్రవరి 85) ఈ వివాదాంశమే చర్చించకుండా "ఇందులో ఉపయోగించిన రూపవైచిత్ర్యం సంగతి పడిలేద్దాం. 'రేప్' 'రేపు' అనే ఇంగ్లీషు తెలుగు మాటలు స్ఫూర్తినిప్పించిన చమత్కారం కవితారచనలో చివరి భాగంలో చూపే భిన్నత్వమూ ఆ రచనా ప్రక్రియను గురించే వివరించారు కాని దాని భావంజోలికి పోలేదు.

శ్రీ ముదిగొండ ఈశ్వర చరణ్‌గారు (భారతి మార్చి 85 "వ్రాయక ముందు ఆయన ఏమనుకున్నాడో తీరా వ్రాశాక అదెలా తయారయిందో ఆలోచనాశీలికి ఆవేదన కలిగిస్తున్నది. నాతిని చేయపోతే కోతి తయారయింది.... వినడానికి సొంపుగా ఉంది. ఆలోచిస్తేనే కంపు! ఆయన 'రేపును' ఆహ్వానిస్తున్నాడు ఆ 'రేపు' తెలుగుదైతే అందరికీ ఆనందమే... కాని ఆయన తెలుగు 'రేప్' లో ఇంగ్లీషు 'రేపు' ను కూడా కలిపాడు. అంటే రేపులకు వలెనే 'రేప్' లను కూడా ఆయన ఆహ్వానిస్తున్నాడా? ఏ సామాజికస్పృహ, ఏ మార్క్సు వాదము సమర్థించనని ఈ అనర్థం కవికిలోపించిన అవగాహనా ఫలితం" అని అభిప్రాయ పడ్డారు.

ఇంత చర్చకు గురయిన రచనపై రచయిత తను ఏ భావాన్ని ప్రతిపాదించదలచి ఆ కవితను వ్రాసాడో విశదీకరించకపోవటం విచారకరం. రచయిత తన అభిప్రాయాన్ని వివరిస్తే ఇతరులు ఆ కవితకు కువ్యాఖ్యానాలు చేయరుగదా! ఈ విషయములో తన కవితలో తాను ప్రతిపాదించని విపరీతార్థాలను విమర్శకులు 'పీకు' తున్నప్పుడు, తానా కవితను 'స్థూలమైన అర్థస్ఫురణ' కోసమే వ్రాశానని ప్రకటించిన రచయిత శ్రీ విహారి గారభినందనీయులు (భారతి డిసెంబరు 1980)

సాధారణ పాఠకుడు అర్థంచేసుకోలేని మినీ కవిత్వాన్ని వెలువరించే కవులు వాటిని సవ్యాఖ్యానంగా అవశ్యం ప్రకటించాలి. అప్పుడే ఆ కవితకు ప్రయోజనం. తమ కవిత్వానికి తామే వ్యాఖ్యానం చెప్పుకోవటం క్రొత్తేమీకాదు. మినీకవితను ఒక విప్లవంగా భావించేవారు. దానిద్వారా ఒక ప్రయోజనాన్ని ఆశించేవారు ఇకనైనా లక్షణ చర్చలు మాని దానిని నిజమైన ప్రజాకవిత్వంగా రూపొందించేందుకు కృషిచేయాలి. ఈ నాటి మినీకవిత్వానికి ఒకనాటి రూపాలైన శతకాలు, చాటువులు ముక్తకాలు ఎంత స్పష్టంగా. సూటిగా ప్రజాహృదయాలను చేరాయో మినీ కవితా రచయితలు గమనించాలి. సాధారణ పాఠకుడిని కవితాసౌధాన్ని ఎక్కించేందుకు మినీకవితలు మొదటి మెట్టు కావాలి. అక్కడే అతనికి ఎదురుదెబ్బతగిలితే అతడు మళ్ళీ ఆ మేడ ఎక్కడానికి ప్రయత్నించడు. మినీకవితా రచయితలు ఈనాటి సాధారణ పాఠకునికి ఆదురవస్థ కల్పించరని ఆశిస్తాను.

**శ్రీ సూర్యదేవర రవికుమార్**

---

## శతకకర్తలకు విజ్ఞప్తి

**నేను 1960 సం.ము తర్వాత వచ్చిన శతక సాహిత్యముపై పరిశీలన చేస్తున్నాను. క్రమక్రమంగా తెరమరుగున పడుతున్న శతక వాఙ్మయముపై సమగ్ర పరిశీలనాత్మక వ్యాసం రాస్తున్నాను. కావున శతకకర్తలు తమ తమ శతకముల ప్రతి నొకటిని దయచేసి నాకు అందించి నా కృషితో తోడ్పడగలరని కోరుతున్నాను.**

**టి. శ్రీరంగస్వామి యం.ఏ.,**
**ఇ.నెం. 5-11-114/4, విద్యారణ్యపురి**
**వరంగల్లు**

---

# ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు కులాల అభివృద్ధికై ప్రభుత్వ ప్రణాళికలు ఒక పరిశీలన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మొత్తం జనాభా 1981 సంవత్సరపు ఉజాబా లెక్కల ప్రకారం 535.50 లక్షలు. ఇందులో షెడ్యూల్డు కులములకు చెందిన వారు 79.61 లక్షలు. అనగా రాష్ట్రంయొక్క మొత్తము జనాభాలో వీరి సంఖ్య 14.76 శాతము. సంఖ్యాత్మకంగా ప్రాధాన్యతకలిగి ఉన్నప్పటికీ సాంఘికంగాను విద్యారంగంలోనూ, ముఖ్యంగా ఆర్థికంగానూ షెడ్యూల్డు కులముల వారు బాగుగా వెనుకబడిఉన్నారు. దేశం స్వాతంత్ర్యం పొందినతరువాతకూడ వీరి స్థితిగతులలో చెప్పుకోదగిన మార్పు రాలేదు. కావున ఇటీవల ప్రభుత్వంవారు షెడ్యూల్డుకులముల వారి అభివృద్ధికొరకు అనేక పథకములను చేపట్టిఉన్నారు.

అయితే షెడ్యూల్డు కులముల ఆర్థికాభివృద్ధి పథకాలకు ఋణసదుపాయములను కల్పించుటకు వాణిజ్య బ్యాంకులు తదితర ఆర్థిక సంస్థలు ముందుకు రాలేదు దీనికి కారణం వీరు తమకు ఇవ్వబడిన ఋణములను తిరిగి చెల్లించలేరనుభయమే. ఎందుకనగా వారి ఏ విధమైన స్థిరాస్తులు లేవు. ఇతరులవద్దనుండి వీరుఋణములు హెచ్చువడ్డీకి అనగా నూటికి రూ. 2/- లేక 3/- చొప్పున తెచ్చుకొని ఋణభారంచేత బాధపడుచున్నారు.

ఇట్టి క్లిష్టపరిస్థితులనుండి షెడ్యూల్డు కులములవారిని ఆదుకోవడానికి వాణిజ్య బ్యాంకులు మరియు ఇతర ఆర్థిక సంస్థలద్వారా వారి స్తోమత పెంచుటకునూ, ఆర్థికాభివృద్ధిని, సాంఘిక న్యాయమును చేకూర్చుటకునూ ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డుకులముల సహకార ఆర్థికసంస్థ స్థాపించబడినది. ఈ సంస్థ 1964 సంవత్సరపు సహకారచట్టంక్రింద దివి.6-2-1974వ తేదీన నమోదుచేయబడినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, యీ సంస్థను స్థాపించినది, ఈ సంస్థ ప్రధాన కార్యాలయము హైదరాబాదులో ఉన్నది. ఈ సంస్థకు జిల్లాకు ఒక్కొక్కటి చొప్పున ప్రతి జిల్లాలోను అనుబంధ సంస్థలు ఉన్నవి. వీటికి జిల్లా షెడ్యూల్డు కులముల సేవా సహకార సంఘములనిపేరు. జిల్లా కలెక్టర్లు యీ సంఘములకు అధ్యక్షులుగా వ్యవహరిస్తారు. షెడ్యూల్డు కులముల వారి ఆర్థికాభివృద్ధికి కేంద్ర సంస్థ రూపొందించిన పథకములను అమలుపర్చుటయే వీటి ప్రధాన కర్తవ్యం. ఈ పథకములను అమలుపరచుటకు కావలసిన నిధులను కేంద్ర సంస్థనుండియు, వాణిజ్య మరియు సహకార బ్యాంకులనుండియు పంచాయతి సమితులు, జిల్లాపరిషత్‌లు ప్రత్యేకముగా కేటాయించిన 15 శాతం నిధులనుండియు, జిల్లా సంఘములు సమకూర్చుకొనుచున్నవి.

సంస్థయొక్క లక్ష్యములు :- రాష్ట్రములోని షెడ్యూల్డు కులాల ఆర్థికాభివృద్ధికి తోడ్పడుటయే ఈ సంస్థయొక్క పధాన లక్ష్యం. వారి ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచుకొనుటకును, తమ జీవనస్థాయిని పెంపొందించుకొనుటకును, వీలుగా వీరు వ్యవసాయము, పశుపోషణ, లఘుపరిశ్రమలు గ్రామీణ పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు, మార్కెటింగ్, ప్రాసెసింగు, సరఫరా, నిలువ, వర్తకం వంటి కార్యక్రమములను చేపట్టునట్లు ప్రోత్సహించుట, లేదా తన సభ్యులకు మంచి సంపాదన వచ్చునట్టి మరే కార్యక్రమమునైనను రూపొందించి అమలుపర్చడం, మరియు సహాయపడుటము.

పైన పేర్కొన్న ఉద్దేశ్యములను నెరవేర్చడానికి అవసరమైన సాంకేతిక సహాయమును, నిర్వహణ సహాయమును, ఆర్థిక సహాయమును, మరేదైన ఇతర సహాయములను అందచేయడం ద్వారాను సభ్యులకు కావలసిన ఋణములకు హామిగా ఉండుటద్వారాను, ఉపాధి అవకాశాలు కల్పించగల వ్యవసాయ పరిశ్రమలు- కుటీర, లఘు, గ్రామీణ మొదలైన పరిశ్రమలు భారీఎత్తున ప్రారంభించే కార్యక్రమములు చేపట్టుట. ఆర్థిక సహాయ కార్యక్రమములకై కేటాయించిన

నిధులను సమీకరించుటలోను, కార్యక్రమములకొరకు నిధులను వినియోగించుటలోను ఈ సంస్థ ఒక సమన్వయ కర్తగాను, వేదికగాను పనిచేయుచున్నది. సంస్థయొక్క ప్రస్తుతపు అనుమతించబడిన వాటా ధనము రూ. 5 కోట్లు. ఈ వాటా ధనమును బోర్డువారు రూ. 9 కోట్లకు పెంచుటకు నిర్ణయించిరి. ఈ వాటా ధనము కేంద్ర సహాయక నిధులనుండియు తమ స్వంత నిధులనుండియు 49:51 నిష్పత్తిలో రాష్ట్ర ప్రభుత్వము పూర్తిగా సమకూర్చినదని చెప్పవచ్చును. ఈ సంస్థ స్థాపించినప్పటి నుండి 31-12-1980 తేదీవరకు కేంద్ర ప్రభుత్వంనుండి రూ. 663,27 లక్షలు, రాష్ట్ర ప్రభుత్వంనుండి రూ. 1739.80 లక్షల నిధులను సమకూర్చుకొనెను. ఈ సంస్థ షెడ్యూల్డుకులాలవారికి నేరుగా ఆర్థికసహాయము చేయదు. తమ అనుబంధ సంస్థలైన జిల్లా షెడ్యూల్డుకులముల సేవా సహకార సంఘములద్వారానే అర్హులైనవారికి సహాయముచేయును. సంస్థయొక్క ఆర్థిక సహాయం పొందుటకు ఈ క్రింది అర్హతలు కలిగియుండవలయును

1) దరఖాస్తుదారులు షెడ్యూల్డు కులములకు చెందినవారై ఉండాలి.
2) వారి సాలుసరి ఆదాయము రూ. 6,000/-లకు మించరాదు.
3) వారు జిల్లా సంఘంయొక్క సభ్యులై ఉండవలెను.

ఒక రూపాయి వాటాధనమును 25 పైసల ప్రవేశరుసుమును చెల్లించి నిర్ణీతమైన దరఖాస్తుఫారమును నింపి జిల్లా సంఘంలో సభ్యుడుగా చేరవలెను.

ప్రస్తుత వ్యాసంలో కరీంనగర్ జిల్లా షెడ్యూల్డుకులముల సేవా సహకార ఆర్థిక సంస్థ పనిచేయు తీరును పరిశీలించడమైనది.

కరీంనగర్ జిల్లా సేవా సహకారసంఘం 11-9-1974 నుండి పనిచేయుట ప్రారంభించినది. ఈ జిల్లాలో 1981 జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనాభా 24.36 లక్షలు వీరిలో షెడ్యూల్డు కులములవారు 4.59 లక్షలు ఉన్నారు అనగా జిల్లా మొత్తం జనాభాలో 16 48 శాతం ఈ సంఘం ప్రారంభమయినప్పటి నుండి 27,251 మంది సభ్యులు 1,05,504 రూపాయల వాటా మూలధనముతో ఉన్నారు.

ఈ సంఘంయొక్క ముఖ్యోద్దేశము ఏమనగా అర్హులైన షెడ్యూల్డు కులముల కుటుంబాలను ఎంపికచేసి వారియొక్క ఆర్థికపరిస్థితులను మెరుగపర్చుటకు, వివిధరకాల ద్రవ్య సంస్థలనుండి పరపతి సౌకర్యమును కలిగించుట, అంతేకాక తక్కువ వడ్డీరేటుతో మొత్తం వ్యయంలో 20 శాతం ఈ సంఘం మార్జిను ద్రవ్యరూపంలో పరపతి సౌకర్యమును కలిగిస్తుంది. ఈ జిల్లాలో మొత్తముమీద 116 వాణిజ్య మరియు సహకారబ్యాంకులు చెప్పుకోదగిన రీతిలో సేవలను అందించుచున్నవి.

ఈ సంస్థ ప్రారంభింపబడినప్పటి నుండి 30-9-1984 వరకు 39,654 దరఖాస్తులకు 10,75,54,368 రూపాయలను వాణిజ్య మరియు సహకార బ్యాంకులద్వారా మరియు 2,54,26,251 రూపాయలను మార్జిను ద్రవ్యరూపంలో మంజూరుచేసింది. ఈ సంస్థ ప్రారంభించబడినప్పటినుండి 1980 మార్చివరకు ఏవిధమైన లక్ష్యాలనుపెట్టుకోలేదు. కాని 1980-81 నుండి పేదరిక నిర్మూలన పథకమునకు అమలుచేయుటవలన ప్రతిసంవత్సరం 5000 కుటుంబాలకు ఋణ సహాయమును అందించుట తన లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది. ఇదే లక్ష్యంను 1981-82 కూడ అమలుచేయడమైనది. ఈ లక్ష్యాన్ని 1982-83 సంవత్సరం 15,000 కుటుంబాలకు పెంచి వారియొక్క సంవత్సరాదాయం కనీసం 4000 రూపాయలుగా ఉండేవిధంగా నిర్ణయించారు.

పట్టిక

సంవత్సరవారీగా ఈసంస్థద్వారా లాభంపొందినవారిసంఖ్య ఆయినమొత్తం వ్యయం 1984-వరకు

| సంవత్సరము | లాభంపొందినవారి సంఖ్య | మొత్తం వ్యయం రూ. లలో |
|---|---|---|
| 1976-77 | 1000 | 17,54,805 |
| 1977-78 | 486 | 6,54,175 |
| 1978-79 | 294 | 5,99,480 |
| 1979-80 | 176 | 3,67,600 |
| 1980-81 | 5006 | 1,22,00,162 |
| 1981-82 | 4450 | 1,18,04,687 |
| 1982-83 | 10,869 | 3,37,50,355 |
| 1983-84 | 12,286 | 3,61,60,500 |

ఆధారం : కరీంనగర్ జిల్లా షెడ్యూల్డుకులాల సహకారసంఘం,కరీంనగర్

పై పట్టికద్వారా మనము తెలుసుకోగలిగిన విషయమేమిటంటే(1976-77)లో ఈ సంస్థలో లాభముపొందినవారి సంఖ్య 1000గా ఉండి క్రమంగా అది 1979-80 సంవత్సరం వరకు తగ్గుతూవచ్చింది కాని 1980-81 లో పేదరిక నిర్మూలనా పథకములను చేపట్టుటవలన లాభంపొందినవారి సంఖ్య గణనీయంగా పెరిగింది. ఇదేరీతిలో మొత్తం వ్యయంకూడ 1979-80 వరకు తగ్గి,1980-81 నుండి పెరుగుతూవచ్చినది. 1984-85 ఆర్థికసంవత్సరంలో 12,5000 కుటుంబా లకు ఆర్థికసహాయం అందజేయడం ధ్యేయంగా పెట్టుకొన్నది దీనినిబట్టి ఈ సంస్థ ప్రగతి మొదట కొంత మందకొడిగా నున్నప్పటికి 1981-82 సంవత్సరంనుండి వేగాన్ని పుంజుకొన్నదని చెప్పవచ్చు.

పట్టిక - 2

సంస్థ స్థాపననుండి 30-9-1984 వరకు బ్లాకువారీగా లాభంపొందినవారి సంఖ్య, మొత్తము ఖర్చు (రూపాయలలో)

| క్రమ సంఖ్య | బ్లాక్ పేరు | లాభంపొందిన వారి సంఖ్య | శాతం | మొత్తము వ్యయం | శాతం |
|---|---|---|---|---|---|
| 1. | కరీంనగర్ | 3,335 | 8.41 | 93,68,140 | 8.54 |
| 2. | గంగాధర | 2,697 | 6.80 | 67.60,750 | 6.17 |
| 3. | హుస్నాబాద్ | 2,515 | 6.34 | 62,71,390 | 5.72 |
| 4. | భీందేవరపల్లి | 3,074 | 7,75 | 1,12,52,680 | 10.24 |
| 5. | హుజురాబాద్ | 4,394 | 11.08 | 1,28,05,655 | 11.68 |
| 6. | సుల్తానాబాద్ | 2,324 | 5.86 | 48,58,570 | 4.43 |
| 7. | పెద్దపల్లి | 1,704 | 4.29 | 46,02,630 | 4.20 |
| 8. | మంథని | 2,611 | 6.58 | 63,96,020 | 5.83 |
| 9. | మహదేవ్‌పూర్ | 886 | 2.2[illegible] | 45,54,370 | 4.15 |
| 10. | మల్లియాల్ | 2,136 | 5.39 | 67,79,880 | 6.18 |
| 11. | జగిత్యాల్ | 3,214 | 8.10 | 1,20,00,070 | 10.94 |
| 12. | మెట్‌పల్లి | 3,418 | 8.61 | 88,99,110 | 8.11 |
| 13. | సిరిసిల్లా | 3,179 | 8.01 | 59,49,870 | 5 43 |
| 14. | వేములవాడ | 3,749 | 9.45 | 76,26,049 | 6.96 |
| 15. | కరీంనగర్(పట్టణం) | 418 | 1.08 | 15,27,589 | .89 |
| | మొత్తము | 39,654 | 100.00 | 10,96,40,708 | 100.00 |

ఆధారం :- కరీంనగర్ జిల్లా షెడ్యూల్డుకులాల సహకారసంఘం, కరీంనగర్ (ఆం.ప్ర.)

పై పట్టికప్రకారం కరీంనగర్ జిల్లాలో ఈ సంస్థ స్థాపన జరిగినప్పటి నుండియు ఇప్పటివరకు మొత్తం లాభపడిన బ్లాకులలో హుజురాబాద్, వేములవాడ మరియు మెట్‌పల్లి ప్రాధాన్యత క్రమంలో ఉన్నవి. ఈ కాలంలో జరిగిన మొత్తం వ్యయంలో ఎక్కువభాగం హుజురాబాద్, జగిత్యాల్, మరియు భీమదేవరపల్లి అని తెలియుచున్నది. సగటున ప్రతి సభ్యునిపై 2765 రూపాయల వ్యయం ఈకాలంలో జరిగింది. ఈ వ్యయాన్ని వేరు వేరు కార్యకలాపాలు కొనసాగించడానికి షెడ్యూల్డు కులాలవారిపై చేశారు. ఈ కార్యకలాపాలకు సంబంధించిన వివరాలు ఈ క్రింది పట్టికలో పొందుపరచబడినది

పట్టిక - 3

సంస్థ స్థాపించబడినప్పటినుండి 30-9-1984 వరకు స్కీంవారీగా లాభం పొందిన వారి సంఖ్య మరియు మొత్తం వ్యయం

| క్రమ సంఖ్య | స్కీం పేరు | లాభం పొందిన వారి సంఖ్య | మొత్తం వ్యయం (రూ॥ లలో) |
|---|---|---|---|
| 1. | వ్యవసాయరంగము, మరియు దీని అనుబంధ కార్యక్రమాలు | 30,868 (77 25) | 8,94,38,085(71.10) |
| 2. | పశుపోషణ కార్యక్రమాలు | 3,292(8.24) | 1,30,71,195(10.39) |
| 3. | మూడవ రంగము (కుటీర మరియు ఇతర పరిశ్రమలు) | 5,791(14.51) | 2,32,83,986(18.51) |
| | మొత్తము | 39 941(100.00) | 12,57,94,266(100.00) |

ఆధారం :- కరీంనగర్ జిల్లా షెడ్యూల్డు కులాల సహకార సంఘం, కరీంనగర్.

పై పట్టిక ననుసరించి మొత్తం లాభంపొందినవారిలో వ్యవసాయరంగం మరియు దాని అనుబంధ కార్యక్రమాలు చేపట్టినవారు ఎక్కువగా ఉన్నారు. మొత్తం వ్యయంలో 70 శాతముపైన ఈ కార్యకలాపాలపైనే జరిగింది. వ్యవసాయ రంగం తరువాత కుటీర మరియు ఇతర పరిశ్రమలపై ఎక్కువగా ఉన్నది. తరువాత ప్రాధాన్యత పశుపోషణ కార్యక్రమాలకు ఇవ్వబడింది.

పై కార్యకలాపాలనే కాకుండ చౌకధరల దుకాణాలను తెరవడానికై షెడ్యూల్డు కులాలకు చెందిన 194 మంది సభ్యులు దరఖాస్తుచేయగా అందులో 123 దరఖాస్తుదారులకు బ్యాంకులద్వారా అప్పులు మంజూరు చేయడం జరిగింది.

పై విశ్లేషణవల్ల ఈ జిల్లాలో షెడ్యూల్డు కులాల సేవా సహకారసంస్థపై గల మొట్టమొదట కొంత మందకొడిగా ఉన్నప్పటికి 1981-82 తరువాత గణనీయమైన ప్రగతిని సాధించిందని చెప్పవచ్చు. పేదరిక నిర్మూలన కార్యక్రమాలపై వివిధ రకాల పథకాలకు అప్పులు మంజూరు చేయడం జరిగింది.

బి. సుధాకర్, ఎమ్. యాదగిరి చార్యులు

# లేఖ

## రాశి ఫలితాలు

ఆర్యా!

బొబ్బిలినుండి సిద్ధాంతి నిష్టల వేంకట సత్యసుబ్రహ్మణ్యంగారు వ్రాయుచున్న "ఈ మాసం - మీ నక్షత్రఫలం" ఫలితములు అనుభవసిద్ధంగా శాస్త్రీయములుగా నున్నవి ఇంకను మరికొంచెము వివరించి వ్రాయించినచో మరింత బాగుగాను, ప్రజోపయోగముగాను యుండును.

డా. బందరు మోహనాంగరావు
కవిటి

# గ్రంథవిమర్శలు

యువభారతి ప్రచురణలు

## వ్యాససాహితీ సంహిత

(ఉపన్యాస వ్యాసమంజరి)

[ప్రతులకు: యువభారతి, 5-కింగ్స్‌వే. సికిందరాబాదు-3 (లేదా) యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు; తిలక్ రోడ్డు-హైదరాబాదు-1: వెల: రూ. 20-00లు]

వేదవ్యాసుని సాహిత్యంపై ప్రసిద్ధాంధ్ర సాహిత్య వేత్తలు తొమ్మిదిమంది ఉపన్యసించిన విషయం వ్యాసరూపమునొంది గ్రంథముగా అవతరించినదే యీ 'వ్యాససాహితీసంహిత' .. సార్థకమైన పేరు...

భగవద్గీతపై డా॥ ఎస్. బి. రఘునాథాచార్య,

ఉపనిషత్తులో నిగూఢంగా ఉన్న తత్వాన్ని కురుక్షేత్ర యుద్ధరంగంలో అర్జునుణ్ణి మిషగా పెట్టుకుని బుద్ధిమంతులు చక్కగా గ్రహించడానికి వీలుగా భగవాన్ ఉపదేశించారు. సమాజంలో జీవన యుద్ధరంగంలో డిగి పట్టీలు కొడుతూన్న ప్రతివాడికీ వాడెదుర్కొంటూన్న ప్రతి సమస్యకు భగవద్గీత పరిష్కారాలందిస్తున్నది...భగవద్గీత నిజంగా 'అమృతోపదేశం'...

ఆచార్యగారు తమ అభిప్రాయాన్ని ముందు ఈ వాక్యరూపేణ వెల్లడించి తరువాత యీ వాక్యాలకు చక్కని పటిష్ఠమైన భాష్యంలాగా భగవద్గీత స్వరూప స్వభావాలను వివరించారు. ఈ వ్యాసం అక్షరాస్యుడైన ప్రతి వ్యక్తికీ తేటతెలుగు మాటలతో భగవద్గీత తత్వాన్ని సూటిగా చెప్తూన్నది.

వ్యాసకృత బ్రహ్మసూత్రములు—స్తోత్రసాహిత్యము—అనే శీర్షికలో డా॥ రత్నాకరముబాలరాజుగారి వ్యాసం. బ్రహ్మసూత్రాలెన్ని వున్నా చతుస్సూత్రికే అవిరళ ప్రచారం వుంది. అథాతో బ్రహ్మజిజ్ఞాసేత్యాదులు నాలుగు. ఈ నాల్గింటినీ అర్థం చేసుకుంటే అంతా అర్థం అయినట్టే అని నా అభిప్రాయం.

ఇతర మతాలను ఖండించే తీరు బాలరాజుగారు నిస్సంకోచంగా చూపి కృతకృత్యులయ్యారు.

అలాగే వ్యాసుని స్తోత్ర వాఙ్మయం ఆయా గ్రంథాలనుంచి ఎత్తి చూపారు. విరాటపర్వంలో యుధిష్ఠిరుడు దుర్గను స్తుతించాడు. దానిని బాలరాజుగారివ్వలేదు. అది సర్వకార్య విజయప్రదాయినిగా ప్రసిద్ధమయింది, విష్ణుసహస్ర నామస్తోత్రం గురించి సుష్ఠుగ వివరించారు...

డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి 'శ్రీమద్భాగవతము'-పై వ్యాసం గంభీరార్థప్రతిపాదకమై ఉంది. వాల్మీకి రామాయణంలాగే శ్రీమద్భాగవతం కూడా గాయత్రీమంత్రార్థస్వరూపమని సప్రమాణంగా వివరించారు.

తీరుబాటుగా కూర్చుని ఏవో కథలు వింటూన్నట్టు కాక భాగవత హృదయాన్ని అర్థం చేసుకుని ప్రవర్తిస్తే మానవుడు చరితార్థుడవుతాడనే ఆర్యోక్తిని శ్రీరామమూర్తిగారు సప్రమాణంగా బోధించారు.

శ్రీ లక్ష్మీనృసింహస్వామి అనుగ్రహ మే కొంచెమైనను లేనిదే భాగవత గ్రంథమర్థము కాదని తమ యభిప్రాయముగ అన్నారు. ప్రత్యక్షర సత్యమది.

'సంస్కృత భారతం-ధర్మనీతి దృక్పథాలు'-అనే శీర్షికతో వెలువడిన శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారి వ్యాసం.

'ధర్మేచార్థేచ కామే చమోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తిన తత్క్వచిత్'-

అనే శ్లోకానికి మహాభాష్యంగా నడిచింది. ధర్మమననేమి? నీతియననేమి? ఆ రెండు భారతంలో ఏ విధంగా కనిపిస్తాయ్? అని ప్రశ్నించుకుని శాస్త్రిగారు ఆయా ఘట్టాలు వివరిస్తూ భారతం 'ధర్మనీతిసంహిత' అని ఋజువు చేశారు. తరచి చూస్తే భారతం చెప్పని ధర్మాలూ నీతులూ ఇంకొకచోట లేవనడం సత్య దూరం కాదు గదా!

భారతీయ సాహిత్యంపై వ్యాసుని ప్రభావం—వ్యాసుదెవరు?—అని శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు చెప్పినది సనాతనులూ అధునాతనులూ కూడా నిర్విరోధపద్ధతిని అంగీకరించవలసిందే అని నా అభిప్రాయం.

వాల్మీకినీ వ్యాసుణ్ణీ కాళిదాసునూ గురించి వారి వారి అనుకరణలను చెప్తూ అగ్రతాంబూలం వాల్మీకికి ఇచ్చి తదుపరి వాల్మీకిని కాళిదాసు అనుకరించిన విశిష్టతను సోదాహరణంగా చెప్పారు. తరువాత వ్యాసుని ప్రభావం భారత సాహిత్యంపై ప్రసరించిన రీతి నుద్ఘాటించారు. పాశ్చాత్యదేశాల్లో కూడా పురాణ ప్రభావం ఉందని చెప్పారు. వ్యాసుడొకడా? వేర్వేరుగా వున్నారా? అనేది ఎవరూ నిర్ణయించలేని ప్రశ్న అయింది.

'శ్రీ దేవీభాగవత తత్వము' అనే శీర్షికనున్న వ్యాసం డా॥ ప్రనాదరాయకులపతి రచన. ఉపాసకుడు కనుక ఆయన చెప్పినది సొంపుగానే ఉంటుంది. దేవీభాగవతం మహాపురాణమా? ఉపపురాణమా? అనే సమస్యకి ఆయనసమాధానం సరసంగాఉంది ఉత్తరదేశమునందు దీనినిగూర్చి రేగిన దుమ్మునుకూడా శ్రీకులపతి ఇందుఉటంకించిదేవీభాగవతం మహాపురాణముగానే చెప్పినట్టుకనిపించింది.

దేవీభాగవతము ప్రకారము సృష్ట్యాదిని మూలప్రకృతి రెండుశక్తులైనది. ఒకటి ప్రాణశక్తి. రెండు బుద్ధిశక్తి. మొదటిది రాధ- రెండవది దుర్గ. ప్రపంచమంతా యీరెంటికీ అధీనమై ఉంటుంది.

ఇందు శకునాల విషయంకూడా వివరించారు. సర్వులూ తెలుసుకోవలసేది. ఇలాగే దేవీపూజకి పనికివచ్చే వస్తువులూ పూలరానివీ యిందులో చెప్పారు. ఇవన్నీ తెలుసుకోవాలి మరి.

'వ్యాసుని రచనలు-అష్టాదశ మహాపురాణములు' అనే శీర్షికలో డా॥ పుల్లెల రామచంద్రుడుగారు చెప్పినది సర్వాత్మనా సమర్థనీయం.

పురాణశబ్ద నిర్వచనం, పురాణాలూ ఇతిహాసాలు, పురాణాల ఆవిర్భావం వ్యాసుడు. అష్టాదశ మహాపురాణాలు-ఇలాటి ఉపశీర్షికలతో ఆయా పురాణాల విషయమును వివరిస్తూ వచ్చారు చాలా కష్టసాధ్యమైన పని. బుద్ధికి ఎంతో పరిశ్రమకలిగించి నిగ్గుతేల్చి ప్రమాణంగా ఇచ్చిన విషయం.

పురాణాలలో సృష్టివర్ణన- అనే ఉపశీర్షికలో ఇచ్చిన విషయం పురాణ తత్వమునూ విశిష్టతనూ తెలుపుతుంది. అలాగే ప్రళయమూ మధ్యంతరాలూ అనే విషయం చదివితే శ్రీరామచంద్రుని సనాతన సాహిత్యమథనశక్తి సాధకునికి అక్షరరూపాన ప్రత్యక్షమై అభివందనాలందుకుంటుంది. సాధకుణ్ణి ప్రజ్ఞాశాలిని చేస్తుంది.

'వ్యాససాహిత్యం—సార్వకాలికత— అనే వ్యాసం డా॥ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు రచన సాహిత్య తత్వమును సమన్వయించడంలో ఆయనకు

గల సాహితీదృష్టి గాంభీర్యాన్ని తెలుపుతుంది.

చతుర్వేదములు- వ్యాసుడు పురాణసంహిత, మహాభారతం, అంతరార్థం, పురుషార్థవివేచన- ఇత్యాది- ఉపశీర్షికలతో వివరించిన విషయం పరమ నాస్తికులకుకూడా అభినందనీయమని నొక్కి వక్కాణిస్తారు.

మహాభారతం-మహాకావ్యం. వ్యాసరచయిత డా॥ దివాకర్ల వేంకటావధాని- మహాకావ్యముగా భారతానికున్న లక్షణాలు, అనుక్రమంగా భారతకథ - కథలోని ఆంతర్యం సక్రమంగా సలక్షణంగా చూపడమయింది. వ్యాసఘట్టాలుగా ప్రసిద్ధములైన శ్లోకాలలో-

'నదీజలం కేశవనారికేతుః
నగాహ్వ యోనామ న గారిసూనుః
ఏషోంగనా వేషధరః కిరీటీ
జిత్వా వయం....

అనే శ్లోకార్థం చాలామందికి అర్థంకాదు దానికి అవధానిగారర్థం చెప్పి పాఠకులను ఉపకరించారు.

మొత్తంమీద చెప్పవలసేది యువభారతి సాహితీ ప్రకాశన కృషి అభినంద్యం. ముఖపత్రంపై ఉన్న వ్యాసపీఠం - ఉపరి ఓంకారం చిత్రాకృతిలో కనువిందుగా సార్థకంగాఉంది.

## 2. దశరూపక సందర్శనం

వెల : రూ. 18/-

'విషాద సారంగధరం'పై డా. పి ఎస్. ఆర్. అప్పారావు, ప్రతాపరుద్రీయంపై డా. వి వి. యల్. నరసింహారావు, "బొబ్బిలియుద్ధము"పై ఆచార్య అమరేశం రాజేశ్వరశర్మ, "గయోపాఖ్యానం"పై డా. ముక్తేవి భారతి, "పాదుకా పట్టాభిషేకం"పై డా. ముదిగొండ వీరభద్రశాస్త్రి, 'కన్యాశుల్కం'పై డా. ఓగేటి అచ్యుతరామశాస్త్రి, 'పాండవోద్యోగం'పై ఆచార్య దివాకర్ల వేంకటావధాని 'సత్యహరిశ్చంద్రీయం'పై శ్రీ గంగశెట్టి లక్ష్మీనారాయణ 'వరవిక్రయం'పై శ్రీ పి. రాజారామదాస్ 'నర్తనశాల'పై డా. జి. వి. సుబ్రహ్మణ్యం-ప్రసంగించి ప్రసంగపాఠాలను అందించగా 'యువభారతి'వారు 'దశరూపక సందర్శనము'గా యీ గ్రంథాన్ని ప్రకటించారు, నాటక కర్తల్లాగే ప్రాసంగికులుకూడా సుప్రసిద్ధులు కనుక విషయ వివేచన గురించి చెప్పనక్కరలేదు.

మూలకథ, నాటకకర్తలుచేసిన మార్పులూ, కూర్పులూ, పాత్రపోషణ, రసం, ఔచిత్యవిచారచర్చ – ప్రజలలో వాటికికలిగిన ప్రశంస – సియబద్ధంగా ఉపన్యసించిన తీరు ముచ్చటగాఉంది. సారంగధర కథ చరిత్రవిరుద్ధమైనా దానికి ప్రసిద్ధికలిగించారు ధర్మవరంవారు. వేదం తాతగారి ప్రతాపరుద్రీయం తెలుగు నాటకరంగంలో ప్రతాపరుద్రీయమైంది. 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్' - నేను ఇప్పుడు పాడుతూఉంటాను. బలిజేపల్లివారి హరిశ్చంద్రం తెలుగుదేశంలో కాకోలు బ్రహ్మరాక్షస సమూహంబది - మాయామేయజగంబు, 'దశమో పయ్యెదలో'- ఇలాటి పద్యాలతో అజరామరమైన యశస్సు సంపాదించింది. కన్యాశుల్కంలో గిరీశం 'డామిట్' కథ అడ్డంగా తిరిగింద- అని పొరబడ్డవారిని నిత్యజీవితంలో హెచ్చరిస్తూఉంటాడు సర్వదా. ఇక పాండవోద్యోగంలో అవధానిగారు కొన్ని మార్పులు సూచించడం సముచితంగానే ఉంది. మరి గురువులు వాటినెందుకు ఊహించలేదో? ఏమైనా "జెండాపై కపిరాజు—— పద్యం ఒక్కటేచాలు గురువుల నాటకరచనా రాజ్యంలో సుస్థిర కీర్తిపతాకకు... ఇలాగే మిగిలిన రూపకాల గురించిన్ని పాఠకులు ప్రాసంగికుల వాగ్విభూతిని అర్థంచేసుకుని ఆనందించవచ్చు. ఈవిధంగా అనాడు అవతరించిన నాటకాలను ప్రచారంలోకితెచ్చి ఆధునిక నాటకకర్తలకు సలక్షణమైన రచనావకాశాన్ని అవలంబించేట్టు చెయ్యడం కొన్ని సాహితీ సంస్థలు (యువభారతి సంస్థలాగే) ప్రధానకర్తవ్యంగా భావించి కృషి చెయ్యాలని కోరుతున్నాను.

యామిజాల పద్మనాభస్వామి




*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phone: 75667 & 61247.*

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

ampro
BISCUITS
ampro
GLUCOSE

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్టును తినండి.




**ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు**
**ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.**